# "నా కొడుకు పైసదువు సదవాలన్నప్పుడు, నేనాడ్ని సదివించగలిగినందుకు నాకెంతో సంతోసంగుంది... ఇదంతా అద్భుతమైన కొత్త ఎవసాయం, జై కిసాన్ ఎరువుల పనితనం వల్లే!"

33611




ఆధునిక వ్యవసాయ పద్ధతులకు

## ౖకిసాన్ తోడైతే— బంగారు పంట

ా భూమి నుంచి అత్యధికంగా దిగుబడి పొందాలి అంటే ఆధునిక వ్యవసాయ పద్ధతులు అనుసరించడం అతి ముఖ్యం. భూమి పట్ల అవసరమైన శ్రద్ధంతా చూపండి బదులుగా పుష్కలమైన ఫలితాలిస్తుంది మీకు.
ఉదాహరణకు : ఎల్లప్పుడూ అధిక దిగుబడినిచ్చే విత్తనాలే వాడండి. నీటి పారుదలకు ఉత్తమ నీటి యాజమాన్య పద్ధతులు జత చేయండి. సస్యరక్షణ చేకూర్చండి, కలుపు మొక్కల్ని అరికట్టండి.
ఇక బంగారు పంటకోసం ఎల్లప్పుడూ ఏ ఎరువులు ాడాలో తెలివైన రైతుకు తెలుసు. అవి కిసాన్—నాణ్యతకూ, పనితనానికీ నమ్మకమైన రు.

## కిసాన్ సామ్రాట్ 18 : 46 : 0

ంట ఎదిగే తొలి దశల్లో సరైన మేరకు తజనినీ, అత్యధిక పాలులో ఫాస్ఫేట్ పోషణనీ ందిస్తుంది.

## జైకిసాన్ సంపూర్ణ 19 : 19 : 19

మన దేశంలో ఇటువంటి తరహా ఎరువు ఇదొక్కటే. పంటలకు అత్యధికంగా ఎన్ పి కె (నత్రజని, భాస్వరం, పొటాష్) పోషక పదార్థాలు అందిస్తుంది ఫలితంగా మొక్కలు ఆరోగ్యంగా ఎదిగి, పుష్కలంగా దిగుబడి ఇస్తాయి.

## జైకిసాన్ యూరియా 46.4%

స్వచ్ఛమైన తెల్లని సూక్ష్మ గుళికల రూపంలో వుండే ఈ ఎరువులో నత్రజని పోషక పదార్థాలు వుంటాయి. బైయూరేట్ పాలు అతి తక్కువగా ఉంటుంది. పైపాటుగా వేయటానికీ, ఆకుల మీద చల్లటానికీ ఆదర్శవంతమైనది.

---

- సంతులితమైన ఎరువులు అత్యధిక దిగుబడికి హామీ.
- జువారి వారి ఉచిత భూసార పరీక్ష సేవకోసం అడగండి.

---






# జై కిసాన్

## ఎరువులు

తెలివైన రైతులకు సుఖసంపదల మార్గ

**జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్**
జైకిసాన్ భవన్, జువారినగర్, గోవా 403 726.

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు : సికింద్రాబా విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగ్‌పూర్, పు ఇండోర్, ఆగ్రా, ఔరంగాబాద్, జువారినగర్.

## కథలు

న" ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర త్రిక అత్యంత రమణీయంగా వుంది. కథలలో వెలిసిన బొమ్మ", "అనాథ" కథలు ంపచేసేవిగా వున్నాయి.

-మోదేకుర్తి సత్యనారాయణ, అన్నవరం

★ ★ ★

1 జూన్ పత్రికలో కుమారి ఎ. వి. ర్ణంగారి "రంగు వెలిసిన బొమ్మ" కథ చాలా ది. నాకు తెలియకుండానే కళ్ళలో నీళ్ళు ము. -ఎం. వి. ఎస్. ఎస్. ప్రసాద్, కాకినాడ

★ ★ ★

ని ముఖ చిత్రంతో వెలువడిన 5-11 జూన్ 87 క చూడ ముచ్చటగా వుంది. ప్రచురించిన అరు ఉత్తమంగా వున్నాయి. "గొప్పవాడు" కథలో ం నీతి వుంది. తండ్రి సంపాదించే ఆస్తి కోసం ఏలు పడే ఆరాటం, చెల్లెలు పెళ్ళి కోసం తలు పంచుకోలేక కొడుకులు తలో ఒక ా తాము డబ్బు ఇవ్వాల్సి వస్తుందని ంచుకున్న కొడుకుల్ని చూసి తండ్రి పడే ాన్ని రచయిత కోరుకొండ సత్యానంద్ ఎంతో ంగా చిత్రీకరించారు.

-హేమసుందర్‌రావు, డోర్నకల్

## సీరియల్స్

పిగురుతు" సీరియల్ వెరైటీగా ఉంది. ముందు దు కూడా ఇలానే కొనసాగుతుందని ్తున్నాము. రచయితకు మా అభినందనలు.

-వి. నాగేశ్వరరావు, సత్తుపల్లి

★ ★ ★

పిగురుతు" సీరియల్ ప్రారంభంలోనే ఎంతో దాయకంగా వుంది. ముందు ముందు ెస్టింగ్‌గా సాగుతుందన్న నమ్మకాన్ని ంచింది. -ఉమా మనోహరి, నాగినీప్రియ, హిమబిందు, డోర్నకల్

★ ★ ★

## ఉత్తరాలు

జన జీవితానికి సంబంధించిన సీరియల్ 'తీపిగురుతు' ప్రచురించడం మండుటెండల్లో మలయమారుతంలా అన్పించింది. ఎప్పటికైనా మళ్ళీ నవలా ధోరణిలో మార్పు వస్తుందనిపిస్తోంది.

వైవిధ్యముగల సీరియల్స్ ప్రచురించే ఆంధ్ర సచిత్ర వార పత్రిక "వేయి పడగలు", "తీపిగురుతు", ప్రచురించడం ఆనందించదగినది.

-ఎస్. రామమోహనరావు, యలమంచిలి

★ ★ ★

'తీపిగురుతు' సీరియల్ ఆదిలోనే ఆకట్టుకుంది. డాక్టర్ కొత్త రవీంద్రబాబుగారి 'ప్రేమ సాగర మథనం' సీరియల్ బాగుంది.

-కాజ హనిత, ఏలూరు

## శీర్షికలు

5-11 జూన్ '87 నటి రజని ముఖ చిత్రంతో వెలువడిన సంచిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది. పత్రికలోని ప్రతి శీర్షికా పాఠకులకు ఒక వేడుక.

-జె. సుబ్రహ్మణ్యశాస్త్రి, జక్కరసకుప్పం

★ ★ ★

'అభిమాన తారలపై అభిప్రాయం' శీర్షిక వినూత్నంగా ఉంటున్నది. 'సినిమా విశేషాలు' బాగుంటున్నాయి. అందాల తార 'సుమలత' సమాధానాల కోసం ఎదురు చూస్తున్నాం.

-గొడవర్తి హరిప్రసాదరాజు, బోధన్ □




**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

3-9 జూలై, '87

శ్రీ ప్రభవ నామ సం. ఆషాఢ శు. సప్తమి

సంపుటము 79 : సంచిక 44

ముఖ్య సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు :
మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2.75 |
| పోస్ట్‌లో 6నెలల చందా | రు. 80.60 |
| పోస్ట్‌లో 12నెలల చందా | రు. 161.20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**

నటి రాధిక

(ఫొటో : ఎం. కె. రామమూర్తి)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# మారిపోయిన ఇంగ్లాండ్

ఇది మీరు చదివే సమయానికి ఇంగ్లండ్‌లో ఎన్నికలు అయిపోయి ఉంటాయి. శ్రీమతి థాచర్ వరుసగా మూడోసారి ప్రధానమంత్రిగా ప్రమాణస్వీకారం చేసి ఉంటారు. మరో వైపునుంచి, అట్లా జరగకపోయేటటువంటి అవకాశం కూడా ఉన్నది. ఎందుకంటే ఇంగ్లండ్ గతంలో ఉన్నట్లు ఇప్పుడు లేదు. శ్రీమతి థాచర్ మన శ్రీమతి ఇందిరాగాంధీ పది సంవత్సరాల క్రితం తప్పుడు అంచనాలు వేసుకుని విఫలమైనటువంటి పద్ధతిలోనే పొరపాటు పడవచ్చు. ఎన్నికలకు కొద్ది రోజులు ముందు నేను స్వయంగా ఇంగ్లండ్ వెళ్లి వివరంగా రాయగలనని ఆశిస్తున్నాను. ఐతే బ్రిటిష్ రాజకీయాల పట్ల నా ఆసక్తి ఇదివరకున్నంతగా ఇప్పుడు లేదు. కాని మార్గరెట్ థాచర్ ఒక ప్రత్యేకమైన అంశానికి నిదర్శనమైనటువంటి వ్యక్తి గనుక, ఆమె నుంచి మనం నేర్చుకోవలసిందెంతో ఉన్నది కనుక ఆమె ఓడినా, గెలిచినా ఆమె పట్ల నా ఆసక్తి మాత్రం కొనసాగుతుంది.

మొట్టమొదట, మార్గరెట్ థాచర్ నిజంగా మార్పును కోరే వ్యక్తి. తాము ఉన్నటువంటి సమాజాన్ని మార్చదలచుకున్న వ్యక్తి. ఈ రోజుల్లో మనకు ఇటువంటి వాళ్ళు ఎక్కువమంది లేరు. సాధారణంగా జరిగేది ఏమిటంటే, మన ఉద్యోగాన్ని, మన కుర్చీని పరిరక్షించుకోవడానికి రాజీపడడం, మెత్తబడి పోవడం అన్నది. నెహ్రూ మార్గం ఇదే. ఇవాళ మనం ఇబ్బందులలో ఉండడానికి గల అనేక కారణాలలో ఇది ఒకటి. ఇది గాంధీ మార్గం మాత్రం కాదు. అంటే మహాత్మాగాంధీ మార్గం అని కాదు. ఎందుకంటే గాంధీ కూడా మార్పును కోరిన వ్యక్తి. కనీసం మార్పును కోరే వాడిగా ప్రారంభించారు. ఆయన తన సుదీర్ఘ రాజకీయ జీవితం చివరి దశలో మాత్రం రాజీపడడం ప్రారంభించారు. మనం బతుకున్నటువంటిసమాజంలో రాజీపడడం కన్న మరో గత్యంతరం లేకపోవడానికే అవకాశం ఉంది. మరో వైపు, సరిగ్గా ఇటువంటి సమాజాలలోనే మెత్తని మార్గాలు పనిచేయవు. తనను తాను నాయకునిగానో, నాయకురాలిగానో పిలుచు కొనే వ్యక్తి మొదట ఒంటరిగా ప్రయాణం ప్రారంభించవలసి వచ్చినప్పటికీ తన భావాలనుముందుకు తోసుకుంటూ, వీలయినంత ఎక్కువ మందితనతో పాటు కలిసి వచ్చేలా జాగ్రత్త తీసుకోవాలి.

థాచర్ చేసినపని ఇదే. ఆమెకన్నా ముందు, లార్డ్ కీన్స్ చెప్పిన ఆర్థిక సిద్ధాంతానికి ప్రత్యామ్నాయమేదీ లేదని అందరూ ఆమోదించేవారు. ఆర్థిక వ్యవస్థలోనూ, ఇతర రంగాలలోనూ విస్తృతమైన ప్రభుత్వ ఆధిపత్యం ఉండాలనేది ఆ సిద్ధాంతం. కనుక రష్యన్ తరహా ప్రణాళికా విధానం, అధిక పన్నులు, లోటు బడ్జెట్ వగైరాలకు ప్రత్యామ్నాయం లేదని అనుకునే వాళ్ళు. థాచర్ కంటే ముందు వచ్చిన ప్రభుత్వాలు - అవి లేబర్ పార్టీలైనా, టోరీ పార్టీలైనా - అనుసరించి నటువంటి విధానంఇదే. దీనివల్ల నికర ఫలితం ఏమంటే, బ్రిటిష్ సమాజం ఏ విషయానికైనా, లేదాప్రతి విషయానికీ ప్రభుత్వం మీద ఆధారపడేదిగా తయారయింది. నిజానికి ఇందుకు తలకిందులుగా ఉండవలసింది. దీని ఫలితంగా అభివృద్ధి ఆగిపోయింది. గత యాభై సంవత్సరాలుగా బ్రిటన్ ఆర్థికంగానూ, రాజకీయంగానూ దిగజారి పోతూ ఉన్నది. చివరికి అది జపాన్, జర్మనీ, ఫ్రాన్సులకన్న వెనుకపడిపోయి ఐదో స్థానానికో, ఆరో స్థానానికో చేరింది.

శ్రీమతిథాచర్ ఈ పరిస్థితిని మార్చేసింది. ఆమె ట్రేడ్ యూనియన్‌లపై, బహుశా ప్రపంచంలోకెల్లా సోమరిలైన ట్రేడ్ యూనియన్లపై ధ్వజమెత్తింది. గొడవపడడం మానెయ్యమని హెచ్చరించింది. బ్రిటన్‌లో బలమయిన రాజకీయ శక్తిగా ఉన్న ట్రేడ్ యూనియన్లు తమ ఇష్టా రాజ్యంగా వ్యవహరిస్తూ, షరతులు విధిస్తూ ఉండేవి. మొత్తంమీద ప్రగతికీ, ఆధునికీకరణకు వ్యతిరేకంగా ఉండేవి. ( ప్రపంచంలోకెల్లా పురాతనమైన పరిశ్రమలు అక్కడి ఉక్కు కర్మాగారాలు వందేళ్ల కన్నా రైల్వేలు అంతకన్నా పాతవి. అక్కడి పెద్ద కర్మాగారం కనీసం పురావస్తు ప్రదర్శన శా పనికిరాదని వేళాకోళం చేస్తారు. ( బ్రిటిష్‌వాళ్ళు అటువంటి పరిశ్రమల సగర్వంగా చెప్పుకుంటూ, వాటిని ఒ ఉంచడానికి విరివిగా శక్తియు వెచ్చించడమే ఆశ్చర్యకరమయిన విషయం. వాటిని పాత సామానుల కింద అమ్మేయాలి.

బ్రిటిష్ సామ్రాజ్యం ఉన్నంత కాలం వా తుక్కు సామాన్లను తమకు అనుకూల ధరలకు ఎక్కడబడితే అక్కడ అమ్మేసే ఇప్పుడు చేతిలో సామ్రాజ్య శక్తి లేదు గనుక తమంతట తామే వ్యవహరించాల్సి వసు ఎందుకంటే వాళ్ళిప్పుడు పశ్చిమ జర్మనీ, వంటి శషభిషలు లేని దేశాలతో, నిర్దాక్షిణ్యమై మేనేజర్లతో పోటీ పడవలసి వస్తున్నది. దేశాలు తమ కర్మాగారాలను పునరు వేగంకన్నా రెట్టింపు, మూడింతల వేగంతో పునరుద్ధరిస్తుంది. లేబర్ ప్రభుత్వాలు తమ కార్మికుల పార్టీ అని అనుకున్నాయి కార్మికులను బుజ్జగించి ముద్దు చేశాయి. ( పరిస్థితి మరింత అధ్వాన్నమైపోయింది. నాయకత్వంలో కూడా పరిస్థితి మెరుగుపడలేదు. వాళ్ళు కూడా ఆ మూస తయారయిన వాళ్లే. రంగం మీద థాచర్ ప్రవే తర్వాతనే పరిస్థితులు మారడం మొదలైంది అంత సులభమైనదేమీ కాదు. ఎందుకంటే ఏ లేకుండా, ఎంతో త్యాగం లేకుండా సమ



ం సాధ్యం కాదు.

మంది ఇబ్బందులు పడ్తారనే మాట నిజమే. గం నాలుగింతలయింది. కొందరికి మళ్లీ లు దొరకక పోవచ్చునని కూడా సందేహం ఎన్నది. కాని బ్రిటిష్ సమాజం ఖుందనేదీ, దాని చలన మార్గంలో టి నిరుద్యోగాన్ని స్వీకరించ కున్నదనేదీ గణనీయమైనటువంటి లు. మూడింట రెండు వంతుల మంది పౌరులకు ఇప్పుడు స్వంత ఇళ్ళున్నాయి. అధికారానికి వచ్చిననాటికి సగం మందికి ం స్వంత ఇళ్ళుండేవి. వ్యాపారాలలో ఎన్న వారి సంఖ్య రెట్టింపయింది. ట్రేడ్ యున్ల సంఖ్య, వాటిలో సభ్యత్వం సంఖ్య దగినంతగా పడిపోయింది. లండన్ ఎస్ట్ పత్రిక రాసిన దాని ప్రకారం స్వేచ్ఛా ంలోని అన్ని దేశాల కన్నా చివరికి జపాన్, అమెరికాల కన్నా కూడా ఇంగ్లాండ్ ంగా అభివృద్ధి చెందుతున్న దేశంగా ఉన్నది.

తా ఎలా ఉన్నా, బ్రిటన్ గతంలో ఉన్నట్టుగా మాత్రం లేదు. యూరప్ నుంచి గానీ, అమెరికా గానీ లండన్‌లోని హీత్రో విమానాశ్రయంలో ే మీరిది గుర్తించగలుగుతారు. వీధులు ా ఉంటున్నాయి. దుకాణాల నిండా జనం దుస్తులు ఇదివరకున్న దానిలో సగం ాగా కూడా లేవు. ప్రజలు కూడా




## న్యూఢిల్లీ లేఖ

ఇదివరకటంత స్నేహంగా లేరు. నేను భారతదేశంలో కాని, గైటగానీ లండన్‌లో గడిపినంత ఎక్కువకాలం గడపలేదు. నేను లండన్‌లో విద్యార్థిగా ఉన్నప్పుడు మేం దాదాపు నెలకు మూడు వందల రూపాయలతో దర్జాగా బతికాం. గత నెలలో ఎనభై సంవత్సరాలు నిండిన లారెన్స్ ఆలివర్‌ను రెండు రూపాయలకు చూడగలిగే వాళ్లం. అతిశయోక్తులతో కూడిన ఆయన ప్రతిష్ఠను దగ్గరి నుంచి చూడగలిగే వాళ్లం. స్పృశించగలిగే వాళ్లం. నేను రెండు రూపాయలకు ఒక్కొక్కరిని చొప్పున ఆలివర్‌ను, గిన్నెస్‌ను, విలియన్ లీని, జాన్ మిల్స్‌ను చూశాను. ఈ మధ్య ఒక్కొక్కటి పదికోట్ల రూపాయలకు అమ్మకమైన చిత్రాలను అప్పుడు ఊరికే ఆ ప్రదర్శనశాలలోకి వెళ్లి చూసేవాళ్లం. అప్పుడక్కడ ఎవరూ ఉండేవాళ్ళు కాదు. కనీసం మామీద నిఘా వేయడానికి కాపలాదారు కూడా ఉండేవాడు కాదు. ఒక్క పెన్నీ కూడా చెల్లించవలసిన అవసరం ఉండేది కాదు. ప్రతిదీ ఉచితంగానే ఉండేది. బ్రిటిష్ మ్యూజియమ్‌కు ప్రవేశ రుసుం ఉండేది కాదు. ప్రతిదీ అద్భుతంగానే ఉండేది.

ఇప్పుడేవీ అంత అద్భుతంగా లేవు. ఎక్కడికైనా ఎలా వెళ్లాలని మీరు ఒక ఇంగ్లీషు వ్యక్తిని అ... ఆయన మీకు జవాబు చెప్పకుండా అలా ... వెళ్లిపోయే అవకాశాలే ఎక్కువగా ఉన్నాయి. ఆయన ఈ ప్రపంచ వ్యవహారం చూసి ఉన్నాడు, అర్థం చేసుకుని ఉన్నాడు. ఒకసారి ఒక వృద్ధురాలు నన్ను వీధిలో ఆపి, నేనెక్కడికి వెళుతున్నానో అడిగింది. ఆమె లేడీ వెల్లింగ్టన్ అని ఒంటరిగా, కృతజ్ఞతతో తోడు కోసం ఎదురు చూస్తున్నదని తెలిసింది. □



# నిత్యనూతన సీరియల్

## కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

# వేయిపడగలు



(గత సంచిక తరువాయి)

న్నప్పుడు ధర్మారావు, రాఘవరావు, కిరీటిరావు, ార్యపతియును కలసి బందరులో చదువుకొనిరి. ార్యపతి ధనవంతుల యింటి బిడ్డ. వారు మ్మవారు. కిరీటి రెడ్డి. వారిది పేద సంసారము. నిఅతడు చాల తెలివి కలవాడు. కిరీటి బందరులో . ఏ. చదువుచుండెను. రాఘవరావును ందరులోనే చదువుచు ధర్మారా విచట ఉన్నాడని సెంబరు సెలవులయిన తరువాత గుంటూరు చ్చెను. వీరు నలుగురు బందరులో న్నప్పుడల్లరియే కాని చదువన్నది చేయలేదు. గొడుగుపేటలో ఒక మేడ అద్దెకు సికొని దానిలో బస. ప్రొద్దుననే లేచి నిక్కి నీలిగి, లుగురును కలసి సుబ్రహ్మణ్యము చెరువు వద్దకు ోయి కాలకృత్యములు తీర్చెదరు. మొగము కడిగి డిగి గంట. ఇందులో ఒకని మొగమొ పుల్ల ఒక గురకొట్టును. ఒకరినొకరు తరుముకొందురు. రాచికములాడుకొందురు. రెండు పక్షముల్లై ిలిపోదురు. పక్షములు పడినా మధ్యాహ్నముదాక ంతే! అంతయు నవ్వుల లోనే? ఈ నవ్వులలోనే పోరాటము. "అబ్బాయి, మనమిద్దఱము ఒకటి. వారితో మాటాడరాదు." అని చీలదీసికొనుటలు, నడచుటలు, రోడ్డుకు వారొక ప్రక్క వీరొక ప్రక్క. ఒకరి వంక ఒకరు చూడనురాదు. చూచినచో "నా వంక ఎందుకు చూచితివి?" అని తగాదా. "నేను నీ వంక చూడలేదు. ఆ చెట్టు వంక చూచితిని" అని జవాబు. జాము ప్రొద్దెక్కిన తరువాత చెరువులో స్నానము. ఒకరితో ఒకరు జల్లు పోరాటాలు. తక్కిన స్నానము చేయువారితో వీరు పోరాదరు; వారందరు వీంద్రను ఎరుగుదురు. వారి దారిని వారు తొలగిపోదురు. అందరు చమత్కారముగానే మాట్లాడుదురు. ఇతరు లెవరైన కోపపడినచో వీరు నవ్వుచునే వారిని పరాచికము లెక్కువ ఆడుదురు. అట్లు సాగిపోవలసినదే. చివరకు కలువపువ్వు లొకటియో రెండో లాగి, ఒడళ్లు తుడుచుకొని, తడి గుడ్డలే పిండి కట్టుకొని యింటి త్రోవ పట్టుదురు. ధర్మారావు కొంచెము మడి. కిరీటి ధర్మారావును ఏమియు అనడు. సూర్యపతి "నేను మడి. నన్ను ముట్టుకొన వద్దనును రాఘవరావు వచ్చి తాకును. సూర్యపతి "నీవు బ్రాహ్మణుడవేగా" అనును.

కిరీటి : ధర్మారావు కాదా?

రాఘు : అయినచో సూర్యాన్ని ముట్టుకొమనుము.

ధర్మా : నోరు మూయుమురా.

సూర్యపతి : "నాకు మడి పోయినదిలే" అని ధర్మారావును తాకును. ధర్మారావు "సరే" అని పెదవులాడించుట మానివేసి సూర్యపతి బుజాన చేయి వేయబోవును. ఇంక ముగ్గురును మడియే. ధర్మారావు వారిని తాకరాదు; తాకినచో జిల్లాయీలు పెట్టుకొందురు. ఒక్కొక్కప్పుడు కిరీటి మడి కట్టును. రాఘవరావు మడి కట్టినచో తక్కిన ముగ్గురును తాకుదురు. అతడు "నా మడి అసలు చెడదుగా! నా జిల్లాయీలు దేవునికిచ్చి వేసితిని" అనును.

సూర్యపతి ఖర్చుతో గది నిండ తల నూనె, అత్తరులు, అగరువత్తులు ఉండును. నలుగురు దొరలు, నూనెలు రాచి జుత్తులు దువ్వుదురు.

క్రాఫింగు లేనిది ధర్మారావునకొక్కనికే. నలుగురు ఉతికిన దుస్తులు వేసెదరు. బట్టలన్నియు సూర్యపతివే! రెండు పెద్ద ట్రంకుల నిండ సూర్యపతి వస్త్రములుండెడివి. కలకత్తా పంచెలు నలువది, సిల్కు చొక్కాలు ముప్పది, బనియనులు ఏబది, పట్టుత్తరీయాలు కండువాలు- అత్తా కోడళ్ళంచువి నలుబది. ఈ రీతిగా నెలకు చాకలివానికి నాలుగు రూపాయిలిచ్చి ఉతికింతురు. ఇందులో ఎవని కిష్టము వచ్చినది వాడు కట్టుకొనెడిదే. తరువాత అత్తరులు రాచి పూట కూళ్ళింటికి ప్రయాణము. ప్రయాణము కాక ముందు ఆరోజునకు కావలసిన పుస్తకములు సర్దుకొందురు. సూర్యపతికి వెదకుచున్న పుస్తకము దొరకదు.

సూర్య: రాఘువా! నా పుస్తకము తీసితివా?

రాఘు: ఏ పుస్తకము? నీ తలకాయ! స్కూలుకు పుస్తకమెందుకోయి? మహ చదివి చచ్చెడి వాని వలె. ఒక నోటు బుక్కు పుచ్చుకుని బయలుదేఱు. చాలుతే అది మన చదువుకు.

పూటకూళ్ళ బస బుట్చయ్య పేటలో. రాఘువరావు బసలో చిన్నప్పటి నుండియు ఉండెను. "ఏమమ్మోవు! వేళ అయినది అన్నము పెట్టుము" అని రాఘురావు తొందర చేయును. "చదివినావు లేవయ్యా! చదివిన ఇన్నిసార్లు తప్పుట ఎందు అని ఆమె అనును. "ఓసి నీ దుంప తెగ! నా సొ తిని నాకే ఎదురు తిరుగుచున్నావు" రాఘువరావు. ఆమె "చూడు అయ్యా! చూ ఈయన సొమ్ము నేను తిన్నానట! నాకింత వ ఎనుబది రూపాయలు ఈయవలె. దవి యీయడు నాయనా! చంపుకొని తినును" అనున

రాఘు: నీకు నేనేమిటి? ఎనుబది రూపాయ ఏదీ? నోటు చూపించు! అబ్బో నీవా! నీవు ఎను గవ్వలు బాకీ ఉంచుదువా? "వట్టి పిసినిగొ



ద ఎవ్వరురా?" అని అడుగు; "లక్షిందేవి"
ఎరు. నీ మొగానికి ఎనుబది రూపాయలే!
క్షిం: ఇదిగో అబ్బాయి! "ముండా" అనకు.
ఘు:- ముండవు కావా? అయిన ఈ కుంకుమ
్కో?
ని కుంకుమ బరణి తెచ్చి ఆమె మొగమున
్తను. ఆమె మొగము తుడుచుకొని, "నీవు నా
ి నుంచి లేచి పో! గోల" అనును. "బస నాది,
పో!" అని రాఘవరావనును. తక్కిన ముగ్గురు
ఖన నవ్వుదురు. ఈ సంఘటనలు రోజన కొకటి
ద్దరి మధ్య. భోజనము చేయుచుందురు,
దేవి నేయ వడ్డించుచుండును. రాఘవరావు
క కొంచెము వేయుము" అనును. ఆమె
ుదు. రాఘవరావు "వేయుదువా, వేయవా?"
ఆమె చేయి పట్టుకొని నేయి బోర్లించుకొనును.
"నా సొమ్మంతయు పాడు చేయుచున్నా"డని
పెట్టును. రాఘవరావు "మొదటనే
ముముగా వేసినచో నీకంత నష్టము లేదు కదా!
గము కుదిరినదా? ఇంక ఎపుడయిన అడిగినచో
ుకుండ ఉండకుము!" అని భోజనము
ఖను.
ోజనమయిన తరువాత పాఠశాలలోనికి పోదురు.
ర్యపతియు, రాఘవరావును స్కూలు ఫైనలు
ువు చుండిరి. కిరీటియు, ధర్మారావును ఎఫ్.ఏ.
ువుచుండిరి. మొదటి పీరియడయినంతనే
ర్యపతి వచ్చి మేడ మీదికి ధర్మారావును రమ్మని
ు విసరును. అతడు నెమ్మదిగా లేచి వచ్చును.
ు అతని ననుసరించును. రాఘవరా వెదురు
ముచుండును. నలుగురు కలసి తక్కిన
ంతయు ఎగగొట్టి గొడుగుపేటకు బయలు
దురు. దారిలో ఒకరిని ఒకరు వెక్కిరించు
ుట, ఎవరినో ఆడిపోసికొనుటయు తప్ప వేఱే పని
ు.
రీటి: ప్రతి రోజును ఈ ఎగగొట్టుట ఏమిటి?
ూర్య: అబ్బో! మహా చదివినావు లేవోయి!
ాఘు: చదువకేమి, చదువగేమి? ఈయన చదివిన
ువేగా మా బఱ్ఱె దూడకు వచ్చినది.
ర్మా: మీ బఱ్ఱె దూడకు బాగుగా చదువు
ుచ్చునా?
ాఘు: ఆయన కెంతవచ్చునో అంత వచ్చును.
ారిలో ఎవరును స్కూలెగగొట్టితిమని అనరాదు.

# వేయి పడగలు

అన్నచో తక్కిన ముగ్గురును కలిసి వాని భరతము పట్టిరే!

గదికి పోయి చొక్కాలూడదీసి పరుపులు పఱచి శయనింతురు. ఇందులో ఎవరు నిద్ర పోరాదు. పోవుటకెవరైన ప్రయత్నించినచో తక్కిన ముగ్గురును వానిని పోనీయరు. ఆ పోనీయకపోవుటలో మూడు వరుసలున్నవి. మొదటి వరుస యిది. అతనిని వందసార్లు పలుకరించుట, అతనిని కదుపుచు వందసార్లు "సూర్యం, సూర్యం, సూర్యం, సూర్యం, సూర్యం, సూర్యం" అనుటయే! దీనికంతు లేదు, దీనితో వాడు నిద్ర మానును. మానడు?తక్కిన ముగ్గురు కలసి వానిని వెక్కిరించుట. వాడు దేనికో సమాధానము చెప్పును. "మేలుకొనియే ఉన్నావు! నిద్రపోయినావనుకున్నామె!" అని వానిని లేపి కూర్చుండబెట్టుట- ఇది రెండవ వరుస. మూడవ వరుస దిండ్లు చేత పుచ్చుకొని మోదుట. అంతటితో వానికి కోపము వచ్చి మఱల దిండుతో కొట్టును. అంతట మఱల పార్టీలు పడి దిండ్లతో యుద్ధము చేయుదురు. కొట్టిన వానినే కొట్టవలెనని లేదు. ఊరకున్న వానిని కూడ కొట్టవచ్చును. చివరికి దిండ్లు విసరుకొనుట వీధి లోనికి కూడ పోవును ఇంతలో మూడు గంటలగును.

నలుగురును దుస్తులు వేసికొని బయలుదేఱి, కాఫీ హొటలులో అల్లరి చేయుచునే యింత తిని చివరి పీరియడునకు కాలేజీకి మఱల తయారు. కిరీటియు, ధర్మారావును తెలుగు, సంస్కృతము, లాజిక్కు గ్రూపువారు. శాస్త్రులుగారు తెమ్మనుచున్నారని తెచ్చి హాజరు పట్టీలో హాజరు వేసికొనియిచ్చి తిరిగి వత్తురు. సూర్యపతి ధనవంతుడగుట ప్రధానోపాధ్యాయు డెరిగిన వాడు గాన అతనికి తగాదా లేదు. అతని ద్వారా రాఘవరావునకు లేదు. ఇద్దరును మొగము చూపించి వత్తురు.

అటు ఇటు తిరిగి మఱల హొటలునకు చేరుకొని భోజనము చేసి గదికి పోయి దీపము వెలిగించి చదువు ఆరంభింతురు. రాఘవరావు తన లాంతరార్పి తాను పండుకొని "ఏమిటోయి, వెధవ చదువులు! ఈ మొగాలు ప్యాసయి చచ్చినట్లే" అనును.

"సూర్య: నోరు మూయవోయి! తా చెడ్డ కోతి వనమెల్ల చెరిచినదట!

రాఘ: ధర్మారావు!నీవు రావోయి చదువు మాని వేసి, వారిద్దరు మొద్దులులే! చదువుకోనీ!

ధర్మారావు చదువు మాని వచ్చును. ఇద్దరు పండుకొని వారికి తోచకుండగా బిగ్గరగా మాటలాడుదురు. అక్కడ నుండి తగాదా. పుస్తకములతో, దిండ్లతో యుద్ధము! మానివేసి నలుగురు వరుసగా పండుకొని ముచ్చటలాడుదురు. ఒకరి దగ్గఱ ఒకరు పండుకొనవలయునని తన పరుపువాని దగ్గరగా వేయును. ఇంకొకడు వారి యిద్దరి మధ్య వచ్చి పరుండును. ఇంకొకడు వారి యిద్దరి మధ్యకు వచ్చును. ఇట్లొకరి మీద ఒకరు పడిపోదురు. చివరకు కాదని దూర దూరముగ పండుకొందురు. వారు ముఖ్యముగా చెప్పుకొనునవి దయ్యాల కథలు, పాముల కథలు, దొంగల కథలు, పెద్ద పులుల కథలు. రాత్రి కొంత దూరమైన తరువాత అందరు అలసిరా, నిద్ర పోదురు. ఒక్కడే నిద్ర పోవలె అనుకొనెనా, వరుసలున్నవిగా! అవి జరుగును. ఆ వరుసలు జరిగిన తరువాత నలుగురు లేచి గదికి తాళము పెట్టి, కాలేజీదాక పోయి తిరిగి వత్తురు. పని ఏమియు లేదు. తెల్లవారుకడ నిదురపోదురు. మరునాడు ఎనిమిదింటికి లేతురు. ఇది వారి దిన చర్య.

ఒకానొకనాడు నాటకమునకు పోవలె అనిపించును. అందరి దగ్గఱ డబ్బును లెక్క చూడగా ఒక రూపాయి తక్కువగును.

సూర్య: మాని వేయుదములే!

కిరీ: నీవు ముసుగు పెట్టుకొని పండుకో! మేము పోదుము.

సూర్య : నేనును వత్తును. ఎక్కడనైన అప్పు తెచ్చెదము.

ధర్మా: ఇంకెవరున్నారు? రాఘవరావు పెంపుడు తల్లి ఉన్నదిగా!

రాఘ: ఛీ! వెధవ ముండ, నాకు పెంపుడు తల్లి ఏమిటి? పూటకూళ్ళది!

కిరీ: దాని సొమ్ము తినవచ్చు గాని, అది పెంపుడు తల్లి అనరాదేమిటి?

నలుగురు కలసి లక్షిందేవి యింటికి పోయి తలుపు తట్టుదురు. ఆమె తలుపు తీసి వీరిని చూచి "ఎందుకు నాయనా? అర్ధరాత్రి వేళ వచ్చినారు! నా దగ్గఱ డబ్బు లేదు బాబూ?" అనును.

రాఘ: ఒక్క రూపాయేనమ్మా!

లక్షిం: రూపాయి కాదు గదా, దమ్మిడీ కూడ లేదు.

రాఘ: రూపాయికే చచ్చిపోదువా? గుటుక్కుమందువా? నీకు రేపటికి కట్టెలు చేరవేయవలసినదేనా?

లక్షిం: నీవు వెయ్యి తిట్టు, లక్ష తిట్టు, నా దగ్గఱ పైసా లేదు.

రాఘ: ఇపుడు నీ తలకాయ బ్రద్దలు కొట్టి ఆ చేతుల గాజులెత్తుకపోయిన ఏమి చేసెదవు? డబ్బు నిలువ చేసి ఏమి చేసికొందువు? ఎలుకలు పందికొక్కులు తినుటకా?.... ఇత్తువా, ఘాయవా చెప్పు? నాటకానికి వేళ అగుచున్నది.

ఃరిగిన కథ – 12: -సుబ్బన్నపేట జమీందారు కృష్ణమనాయని మరణానంతరం రంగారావుగారికి
ట్టాభిషేకం జరుగుతుంది. రత్నగిరిని సభలో రామేశ్వరముగారు అవమానిస్తారు. దేవదాసి గిరికను
ులవంతముగా తీసుకురమ్మని కాసావానిని పంపుతాడు. ఆమె రాదని కాసావానిని పంపివేస్తాడు
ర్మారావు. ధర్మారావు గురించి సభలో చర్చ జరుగుతుంది. రంగారావుగారు రామేశ్వరమును
ుందలిస్తారు. పట్టాభిషేకానికి పది లక్షలు ఖర్చు తేలుతుంది. ధర్మారావుపైన, రామేశ్వరముపైన
ప్రతీకారము తీర్చుకోవాలని రామేశ్వరము అనుకుంటాడు. రుక్మిణమ్మారావుగారు కబురు పంపగా
ోటలోనికి వెడతాడు ధర్మారావు. ధర్మారావు భార్య అరుంధతిని కాపురానికి తీసుకు వస్తారు. తమ
ఇలవేల్పు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి మీద అరుంధతికి భక్తి ఏర్పడుతుంది. రుక్మిణమ్మారావుగారు
అరుంధతికి చంద్రహారమును బహూకరిస్తారు. ధర్మారావును రుక్మిణమ్మారావుగారు కళాశాలలో చేరమని
చెబుతారు. ధర్మారావు గుంటూరు కళాశాలలో చేరతాడు.

కిరీ: ఇంటిలో వెదకి రావోయి.

లక్ష్మి: ఇంటిలో ఎక్కడ ఉన్నది! నా కొంగునే ఉన్నది!

రాఘురావూడదీయబోవును. ఆమె ఊడదీయ నీయదు.

రాఘ: ధర్మారావూ! నేను దీని చేతులు పట్టుకొందునుగాని, నీవూడదీయవోయి.

చివరకెట్లయిననేమి రాఘవరావు వూడదీసి డబ్బు తీసికొనును. అందులో రూపాయి అణా ఉండును.

రాఘ: ఇదిగో. నీ అణా నాకెందుకు? వెధవ అణా. తీసికో.

లక్షిం: ఈ అణాతో ఏమి చేసికోను.

రాఘ: బుఱ్ఱ గొఱిగించుకో.

లక్షిం: రేపటికి నెయ్యి లేదు. ఏమి వేసికొని తినెదవు? గడ్డి తిందువా? నేయి లేకపోయిన మఱల ముద్ద ఎత్తవు.

రాఘ: అక్కడికి రోజును నేయి వేసి చచ్చుచున్నట్లు!

ఒక్కొక్కప్పుడు గృహము లోనికి పోయి ఆ గూడులు ఈ గూడులు వెదకి డబ్బు తెచ్చును. నాటకమునకు పోదురు. అక్కడను సరిగ కూర్చుండరు. సూర్యపతి వారందఱను తరుమును.

ఇట్లు సంవత్సరమున్నర జరిగెను. మొదటి ఏడు సూర్యపతి , రాఘవరావులిద్దరు తప్పిరి. కిరీటి ధర్మారావులు మొదటి ఏడే కనుక ఎట్లో దాటిరి. సెలవులయిన తరువాత మఱల చదువులకు వచ్చిరి. సగము సంవత్సరము కడచినది. సూర్యపతి తండ్రి పోవుట చేత అతడు చదువు మానెను. చివరి మూడు నెలలు తక్కినవారు ముగ్గురే అయిరి. ఒక కళ తక్కువయినను ఆ మూడు నెలలు అట్లే జరిగెను. కిరీటి పరీక్ష తప్పెను. రాఘవరావాయేడు స్కూలు ఫయినలు పరీక్ష అయ్యెను. సెలవులిచ్చిన తరువాత రాఘవరావింటికి పోవుచుండెను. లక్షిందేవితో చెప్పి "ఇంక రానమ్మోవ్" అనెను.

లక్షిం: నా డబ్బు మాట ఏమి చెప్పినావు?

రాఘ: నీ డబ్బా! డబ్బేమిటి? నేను నీకు దమ్మిడీ అయిన ఈయనక్కఱ లేదు. సాక్ష్యమేమయిన కావలసినచో కిరీటిని చెప్పుమనుము. అతడు పెద్ద మనిషి కదా!

లక్షిం: పిల్లికి ఎలుక సాక్ష్యమన్నట్లున్నది.

రాఘ: ఏమమ్మోయ్! ఒడలు దగ్గఱ పెట్టుకొని మాట్లాడుము. నోటికి వచ్చినట్లెల్ల ప్రేలుచున్నావే! పెద్ద మనిషిని, ఈవు ఎఫ్.ఎ. ప్యాసు కాబోవుచున్న వానిని పట్టుకొని ఎలుక అందువా?

లక్షిం: సరే కాని, ఏమిటో చెప్పు. రైలు ఖర్చుకు డబ్బులు లేవా! ఎంత కావలె! పది అణాలు కాదూ?

రాఘ : రూపాయి చావు! వట్టి చేతులతో పోనా?

ఆమె రూపాయి ఇచ్చెను. లక్షిందేవికి ఏబది యేండ్లుండును. తల వెంట్రుకల విధవరాలు. రాఘవరావు మీద ఆమెకెందుకో అంత అపేక్ష ఉండెడిది. రాఘవరావు ఎఫ్.ఏ. మొదటి ఏడే బందరులో తప్పి మఱల చదువుచు చిన్నతనములో గుంటూరునకు వచ్చెను. వచ్చి నెల అయినది. హాస్టలులో అతనికి సీటు లేకపోయెను. ఊరిలో గది పుచ్చుకొని ఉండెను. అతనికి సూర్యపతి చాల సహాయపడుచుండెను.

ధర్మారావు రాఘవరావులు నేడు కొండవీటికి పోవుచు తమ మిత్రుల లేమికి చాల విచారపడుచు సెనగ పప్పు, బెల్లము కొని బయలుదేఱిరి. రాఘవరావు తన ఉత్తరీయమున మూట కట్టుకొనెను. ధర్మారావు తనకు కొంచెమిమ్మనెను.

రాఘ: కొండ మీదనే తినవలయును. ఇక్కడ నీకు గింజ యీయను.

ధర్మా: ఏడ్చినావు. తన్ని లాగుకొందును.

రాఘ: తిరిగి వెళ్ళు లోపుగా నాచేత నీవు తన్నులు తినకున్న అంతే చాలును.

ధర్మారావు రాఘవరావులిద్దఱు జంట కవులు. వారిద్దరిలోను రాఘవరావు పోకడ చాల మెత్తనిది. రాఘవరావు నియోగి. వారిది గుడివాడ వద్ద ఒక ఊరు. ఇద్దరును మూడు నాలుగైదాఱు ఫారములు కలిసి చదువుకొనిరి. ఇద్దరకును చాల స్నేహమున్నది. కలిసి ఏవో పద్యములు వ్రాసెడివారు. ధర్మారావుకు రాఘవరావు కవిత్వమన్నచో ఎంతో యిష్టము. ఒకనాడు రాఘవరావు తండ్రి బందరు వచ్చి ధర్మారావును చూచి "మీదే ఊరు నాయనా?" అనెను. ధర్మారావు "సుబ్బన్నపేట" అనెను. "ఎవరి అబ్బాయివి?" అనగా "రామేశ్వర శాస్త్రిగారి అబ్బాయిని" అనెను. రాఘవరావు తండ్రి పేరు వేంకటాచలపతి. ఆయన ధర్మారావును కౌగలించుకొని "రామేశ్వరశాస్త్రిగారి కుమారుడవా నాయనా! మీ నాన్నయు, నేనును ప్రాణ స్నేహితులము. మీ నాయన ఎక్కడ తండ్రీ! నిరతాన్నదాత! మహా పురుషుడు" అని మెచ్చుకొనెను.

అప్పటి నుండి ధర్మారావు, రాఘవరావుల స్నేహము మఱియు వృద్ధి పొందెను. ఆ నలుగురి స్నేహములో పొరపే లేదు. అందులో వీరి ఎడల అసలు లేదు. ఏ యిద్దఱి మధ్యను లేదు. వారు నలుగురు నాలుగు దిక్కుల చివరలను ఉండనిమ్ము! వారి హృదయమ కలసియే ఉండును.

ఇద్దఱును కలసి కొండ ఎక్కిరి. ఎక ధర్మారావు "సూర్యపతి వచ్చినచో మన తెగును. ఈ కొండ ఎక్కులోపుగా వంద కూర్చుండు మనెడి వాడు. రాలేదో బ్రతికినా అనెను.

రాఘ: పొన్న కాయ వలె గుఱ్ఱపు బం కూర్చుండుమన్న గూర్చుండును. కొం దూరము నడచినచో ఆయాసము. సుతి మె ప్రాణము పాపం! లేత వంకాయ!

ఇద్దఱును నవ్వుకొనిరి. "ఉత్తరము వ్రాసి వచ్చెడి వాడే సుమా!" అనుకొనిరి. "ఈసారి ఆదివారములలో బెజవాడ పోదము. అతనిని వత్తము" అనుకొనిరి.

మాఘ మాసము వచ్చి ఎండలు మండి చుండెను. కొండ మీద పచ్చని ఆకంత మాడిపోజొచ్చెను. వారు కొండ పడమటి నుండి పడమటి ద్వారము దాటి పెద్ద మైదానముల పోయిరి. ఇద్దఱి మేనులు గగురు పొడిచె "ఇచ్చట మన పూర్వపు రెడ్లు గుఱ్ఱాలు దూకించి ఏనుగులను ఎక్కిరో! మనమయోగ్యుల మి తిరుగుచుంటి"మనుకొనిరి. "కిరీటిరావు తెచ్చితిమి కాదు. అతడెంత పొంగిపోయెడి వాడ అనుకొనిరి. తారా బురుజు పోయి చూ మిరియాల తఖతు దర్శించిరి. నేతి కొట్టు చూ అచట గుఱ్ఱాలు నిలిచెడి చోట గుఱ్ఱపు డెక్క గుర్తులు పరీక్షించిరి. వారిర్వురును పూర్వ చ కథా స్మృతి చేత వివశాంగులై ప్రతి నెత్రునాళవ వేడి నెత్తురులతో నడచిరి. ఒక పూర్వ శాభ మును తెలిపెడి ప్రదేశము చూచిరా, యిద్దరు ఒ వంక ఒకరు చూచుకొందురు. ఇంక మాటాడనక్క లేదు. ఇద్దరును పరస్పర మర్మము చేసికొందు వారి ఆత్మలు కవితా విషయమున, రసజ్ఞ విషయమున అంత సన్నిహితములై ఉండె



రిద్దరుకాని ఒకడే!

మధ్యాహ్నము దాటి వెదుళ్ళ చెరువు వద్దకు యి సెనగ పప్పు తిని నీరు త్రాగి గభ్భున త్రేచిరి. చ్చట కొంత సేపు విశ్రమించిరి. ఆ దుర్గ నిర్మాణ శల మాశ్చర్యముగా ఉన్నది. కోట కట్టుట కెట్టి క్కని స్థలము కనిపెట్టిరి! చక్కని జల సమృద్ధి ల చోటు, లక్షలాదిగ జనము నివసింపదగిన టు, కొండలకు, కొండలకు కలసి కట్టిన గోడ చేత ర్భేద్యమైన చోటు. ఆ రెడ్లు, వారి పరాక్రమము, రి యౌధార్యము, వారు పోషించిన కవులు వారి ృదయములు ఆనందభరితములు అయ్యెను.

ప్రొద్దుకుంకు వేళకు తూర్పు ద్వారమున దిగి త్తుల బావి చూచిరి. ఆ ఘోర వృత్తాంతము ండి తిరిగి వచ్చిరి. అచ్చట పెద్ద బాతి ండుండెను. దానితో రెడ్లు క్రీడించిరని చెప్పిరి. ది ఇప్పుడు ముప్పురు కలసి కాని ఎత్తలేరు. ఆ ండుతో బంతులాడిరా? వారి బల పరాక్రమము ట్టివో!

రాఘు: "సార్వభౌముని భుజాస్తంభ మెక్కెను దా నగరి వాకిట నుండు నల్ల గుండు" ఇదే దియేమో?

ధర్మా: కావచ్చును. అదియొక పుణ్య సమయము. న మపుడైన బ్రతికియున్నాము కాదు.

రాఘు: ఉన్నచో ఏమి బ్రతుకు? కాఫీ హోటలులా! ంగ్లీషు చదువులా! నీవు బి.ఏ. చదువుదువా! ఏ ండి చెంబో పుచ్చుకొని సంభావన కేగెడివాడవు ధవ వైదికివి!

ధర్మా: నీవు మంత్రిగా ఉండెడి వాడవు. స్నేహితు ను వచ్చి అడిగినచో నన్ను కొంచె మాదరించెడు ాడవు. కాదా?

రాఘు: అప్పుడసలు నీ మొగమే నే నెఱుగను.

ఇద్దరును కలసి రైలు స్టేషను వైపు నడిచిరి. చ్చటికి స్టేషను దూరమగుట వలనను, చీకటి డుట వలనను, వేగముగ నడచుచుండిరి. దారిలో ండవీటి రెడ్లు, అప్పటి శోభయు, వాని స్తావనయే జరుగుచుండెను. సగము దూరము డచిరి.

# వేయిపడగలు

రాఘు: వారు కవిత్వ మెంత పోషించిరి! కవిసార్వ భౌముడయిన శ్రీనాథుని వారు పోషించు టయే, వారు సారస్వతమునకు మఱవరాని మహోప కారము చేయుట.

ధర్మా: ఎఱ్ఱాప్రగ్గడను మాత్రము పోషించలేదా?

రాఘు: తెలుగులో తక్కిన అందరు కవులును శ్రీనాథుని తరువాతి వారే! వారికి శ్రీనాథునకు పోలికయే లేదు.

ధర్మా: అదేమి మాట! ఎఱ్ఱా ప్రెగ్గడ శిల్పమే శిల్పము! ఆయన భారతారణ్య పర్వశేషము పూరించెనన్న సామాన్యమా? సావిత్ర్యుపాఖ్యానము, యక్ష ప్రశ్నలు అట్లెవడు వ్రాయగలడు? తరువాత పింగళి సూరన! ఆయన ప్రభావతి- ఓహోహో! ఏమి రచన! ఆయనతో పోల్చదగిన వారు మన భాషలో ఒకరో, యిద్దరో అంతియ.

రాఘు: శ్రీనాథునితో ఎవ్వరును పోలలేరు. తక్కినదంతయు అట్టి పెట్టుము. సీస పద్యమును ఆయన ఎంత బాగు చేసెను.

ధర్మా: సీస పద్య మతని మూలముననే అసలు పాడయినది.

రాఘవరావు ముందు నడచుచున్న వాడాగి "ఛీ! నోరు మూయుము" అనెను.

ధర్మారావు "వాగక నడువుము. శ్రీనాథుడు లేకపోయినచో సీసమంత దౌర్భాగ్య దశకు రానేరాదు" అనెను.

రాఘవరావునకు కోపము మితి మీరిపోయెను. లాగి ధర్మారావును చెంపకాయ కొట్టెను. దెబ్బ చుఱ్ఱున తగిలెను. అతని కపోలము నెత్తురులు కమ్మెను. ధర్మారావు "అబ్బా" అని చేతితో చెక్కిలి అదుముకొని కోపముతో రాఘవ రావు వంక చూచెను. రాఘవరావు మొగములో కత్తి వేసిన నెత్తురు చుక్క లేదు. మొగము వివర్ణమైపోయెను. ధర్మారావాలో చించెను. అతనిని మఱల కొట్టవలయునన్నంత కోపము వచ్చినది. కాని ఆగెను.

ధర్మారావు దారి తొలగి ముందునకు వచ్చె నడువసాగెను. రాఘవరావనుసరించెను. ఒకరితో ఒకరు మాటాడుటలేదు.నడుచుచుండిరి.

రాఘవరావు యంత్రము వలె అతనిని అనుసరించెనే కాని అతని మేనిలో ప్రాణములు లేవు. కొంత దూరము పోయిన తరువాత అతని కాలోచనా పరం పర పుట్టెను. ధర్మారావెంత మంచివాడు! అతడే తిరిగి కొట్టినచో తానేమగును? ధర్మారావును, తానును సమ వయస్కులయ్యును ధర్మారావు ఎడల ఇతరుల కున్న మర్యాదను బట్టి

అతడే గౌరవనీయుడు! తన మిత్రులలో ధర్మారా వట్లుండునుగాని, పరుల కతని చూచినచో భయము వేయును. అతడంత తేజశ్శాలి. అంత గంభీరుడు. అతడన్నచో తన కెంత గౌరవము! చివరికిదా తాను చేసిన పని! ధర్మారావు చాల బుద్ధిమంతుడు. శ్రీనాథుని సీసమును గూర్చి అట్లన్నచో అతడేల అనెనో? అతని వలె తానాలోచించలేడాయెను. ఛీ! ఛీ! తనకన్న ధూర్తుడుండడు. రేపు కిరీటి సూర్యపతులతో ఏమని చెప్పవలయును? తన తండ్రికిది తెలిసినచో తన్ను బ్రతుకనిచ్చునా? అతనికన్న తానేమి తెలివికలవాడు? ధర్మారావు ప్రతి తరగతియు క్రమముగా పరీక్షయిచ్చుచుండగా తాను ప్రతిదియు తప్పుటయే నాయెను.

ఒక్క అర మైలు దూరము నడిచిరి. బాగుగా చీకటి పడినది. రైలందునో, అందదో అని ధర్మారావు తొందరగా నడుచుచుండెను. రాఘవరావతనితో నడువలేక మధ్య మధ్య చిన్న పరువులెత్తు చుండెను. దారి అది అవునో, కాదో!

రాఘవరావు పరుగెత్తి ధర్మారావుకన్న ముందు నడువజొచ్చెను. కాని ధర్మారావు నాలుగైదుసార్లు అతని మడమలు త్రొక్కవలసి వచ్చెను. రాఘవరావు "మడమలు త్రొక్కెదవేమి?" అనెను. ధర్మారావునకు కోపము తగ్గలేదు. ధర్మారావు ముందు నడచెను. రాఘవరావు మఱల ముందునకు పరుగెత్తి "నాకు భయము వేయుచున్నది నీతో నేను నడువ








నెస్టమ్ బేబీ సిరియల్
ప్రారంభించేందుకు ఆదర్శప్రాయమైనది
పెరుగుదలకు ఆదర్శప్రాయమైనది
నెస్టమ్, పాలు-పూర్తి పోషక
విలువలున్న ఆహారం.
నెస్టమ్‌తో వివిధ రకాల ఆహారంలో
నెస్టమ్
రైస్
పాలలో కలపండి.
ఉచితం
మీ బాబు, తన ఆహారంలో, కొత్త
రుచులను కోరుతాడు అందుకని-మీ
ఉచిత నెస్టమ్ వంటల పుస్తకం
కోసం రాయండి.
నెస్టమ్
పోస్ట్ బాక్స్ నెం. 6016,
న్యూ ఢిల్లీ-110008.
Nestlé
Nestum
baby cereal
Rice
mix with milk
Nestlé
baby cereal
Rice
mix with milk

## వేయిపడగలు

లేకున్నాను" అనెను. ధర్మారావు కోపముతో ముందు నడవబోయెను. రాఘవరావునకు దుఃఖము తరుముకొని వచ్చెను. అతనికి దుఃఖమాగక బిగ్గరగా ఏడ్చి ధర్మారావును కౌగలించుకొనెను. ధర్మారావేమి చేయును? నిలువెల్ల నీరయ్యెను. అట్టే నిలబడిపోయెను.

అట్లు పది నిముసములున్న తరువాత ఇద్దఱకు ఉద్వేగము తగ్గెను. ఎవరును మాటాడలేదు. చీకటిలో ఒకరి మొగ మొకరు చూచుకొనిరి. ఏమియు కనిపించలేదు. కాని స్పర్శచేతనే ధర్మారావు కోపము పోయినదని రాఘవుడు గ్రహించెను. రాఘవుని పశ్చాత్తాపము ప్రమాణము దాటినదని ధర్మారావు గ్రహించెను. తన ఉత్తరీయముతో రాఘవరావు కనులు తుడిచి ధర్మారావతనిని ముందు నడువుమనెను. కాని రాఘవరావు కొంత దూరమతని ప్రక్కగా కౌగలించుకొనియే నడిచి తరువాత అట్లు నడుచుట కష్టమయి ముందు నడచెను. స్టేషను దగ్గఱకు వెళ్ళునప్పటికి రైలు దాటిపోయెను.

దగ్గఱలో సత్రమున్నదని తెలిసికొని అటకు చనిరి. అచట సత్రములో ఒక ముసలిది డబ్బు తీసికొని అన్నము పెట్టును. కాని మనుష్యులు వచ్చిన తరువాత వారు కావలయునన్నచో వంట మొదలు పెట్టును. వీరిద్దరు ప్రొద్దుటి నుండి తిండి లేక మలమల మాడుచు అమె అప్పుడు వంట మొదలు పెట్టిదననగా మనసులో సగము చచ్చిరి.

వంటయై భోజనమగు వఱకు రాత్రి రెండు జాములయినది. సత్రములో బయట పండుకొనిరి. ప్రక్కలు లేవు. ఉత్తరీయములే కొంత సేపు పరుపులు, కొంతసేపు దుప్పటులుగా తెల్లవారినది.

హృదయమును నిద్ర కుదుట పఱచునట్లు మఱొకడు చేయలేదు. రాత్రి అంతయు వారు సరిగా మాట్లాడనే లేదు. తెల్లవారుసరికి ఇద్దఱకు యథాపూర్వకముగా ప్రపంగము సాగెను.

రాఘ: ధర్మన్నా! లేవోయి. ఈ పూట కూడ రైలు చెడగొట్టెదవా?

ధర్మా: నిన్న నేనే చెడగొట్టినది, వెధవ తెలివి పోవుచున్నావు.

రాఘ: నోటికి సరిగా రానీ. మఱల చెంపకాయలు తినెదవు. అప్పుడే మఱచి పోయినావా? నిన్న ప్రొద్దున కొండ ఎక్కుచు అన్నాను కదా, తిరిగి వెళ్ళులో పుగా నాచేత నీవు తన్నులు తినకున్న అంతే చాలునని. అది నిజమా, అబద్ధమా!

అని లేవకున్న ధర్మారావు మీద పడి ప్రేమ వెదల క్రక్కుచు కౌగలించుకొని ఒక్కటే నవ్వెను. ధర్మారావు "మీద నుంచి లే!" అనెను. రాఘవరావు లేవకుండ "ఇంకను కోపము పోలేదా? అయిన కొట్టు"మని ధర్మారావు చేయి తన చెంప మీద పెట్టుకొనెను. ధర్మారావతని చేయి నొక్కెను. రాఘవరావు గిలగిలలాడి వదలించుకొని "అబ్బా! అక్కడికి కసి తీరినది కావలయును" అని సర్దుకొనెను. తరువాత రైలుకు పోయి యింటికి చేరిరి. (ఇంకా ఉంది)



## నూనె, క్రొవ్వు పదార్థాలు తగ్గించుకోండి రుచిని మాత్రం తగ్గించుకోకండి.

నిర్లేప్. మీకు రుచి, దాంతోపే ఆరోగ్యం అందిస్తుంది. ప్రత్యేకమైన నాన్‌స్టిక్ పూత కలిగినది కనుక నూనె పదార్థాలు తక్కువగా వాడినప్పటికీ, మీ కుటుంబం వారికి పసందైన భోజనం రుచికరంగా తయారుచేసుకోవచ్చు.

అవునండీ, మీ కుటుంబానికంతా మంచి ఆరోగ్యానికి హామీ ఇస్తుంది నిర్లేప్.

- వంట పాత్రల విస్తృత శ్రేణి
- తక్షణ విక్రయానంతర సేవ
- ఐఎస్ఐ మార్కు పొందిన ఉత్కృష్ట-సాధ్యాల

# నిర్లేప్
నాన్‌స్టిక్ కుక్ వేర్






ఆంధ్రప్రదేశ్‌కు డిస్ట్రిబ్యూటర్లు



**Mahavir** Enterprises

కాంచన్‌జంగ కాంప్లెక్స్, కింగ్ కోఠి రోడ్, హైదరాబాద్-1

ఫోన్: 231198, 235856.





# కనిపించని న్యాయం

వి.సర్వేశ్వర శర్మ, చావలి శ్రీరామకుమార్

'పలక నువ్వు తీశావు. నువ్వు దొంగవి" దేళ్ళ రవి తొమ్మిదేళ్ళ గోపీతో అంటున్నాడు.

ప తియ్యలేదు. నేను దొంగని కాదు" గోపీ ముఖం వేసుకుని అన్నాడు.

' పలక తెచ్చిఇయ్యి లేకపోతే వెంకటరెడ్డితో తాను' రవి దబాయించి చెప్పాడు.

ఏ ఏడుపు మొదలుపెట్టాడు. టీచర్ జానకి ష్స" అని గట్టిగా అరచింది. తరగతిలో రూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. గోపీ ఏడుపు లుపెట్టాడు.

ం జరిగింది? ఎందుకు ఏడుస్తున్నావు?" జానకి ంది.

వి పలకపోయింది. నేను తీశానని నన్ను దొంగ పన్నాడు. వెంకటరెడ్డితో చెబుతాడట!" గోపీ పూస్తూ చెబుతున్నాడు.

ంకటరెడ్డి పేరు వినేసరికి జానకి గతుక్కుమంది. వి పలక ఎవరు తీశారు?" జానకి అడిగింది.

వి పలక ఇక్కడ మరచిపోయాడు. ఇదిగో దవుంది" వెనుక వరుసలో కూర్చున్న ఆనందు పోతున్న లాగును పైకి లాగుకుంటూ పలక కు ఇచ్చాడు.

'లవిహార్ అనే చిన్న కాన్వెంటులో జరిగిన ఎటన ఇది. వెంకటరెడ్డి ఎవరు? వెంకటరెడ్డికి ంటులో చదువుకునే ఆ పసిపిల్లలకు ంధం ఏమిటి? ఆ కాన్వెంటు ఎక్కడవుంది?

దొక చిన్న పట్టణం. అటు పూర్తిగా పట్టణ వరణం లేదు. అలాగని గ్రామ వాతావరణం మధ్యస్థంగా వుంటుంది. ఎందరో ఒబరులు తాము అనుకున్నది సాధించగల తం.

న్నట్టుండి ఆ పట్టణంలో పెద్ద సంచలనం పలయింది. ఆ సంచలనానికి కారణం టరెడ్డి. ఆ పట్టణం వచ్చిన వెంకటరెడ్డి చాలా ప్రకాలంలోనే అందరికీ తెలిసిపోయాడు. ఎలా సాదంటే-

ానకాలు అనే మోతుబరి పట్టణానికి పది మీటర్ల దూరంలో ఉన్న ఒక గ్రామంలో ాడు. పానకాలు పేరు చెబితే పట్టణంలో ామందికి భయం. చాలా పలుకుబడిగల షి. చదువుకోలేదుగాని లేకపోతే చాలా స్థాయికి వెళ్ళిపోయి వుండేవాడని ుకుంటారు.

అలాంటి పానకాలు ఒకరోజున రాత్రి పన్నెండు గంటలకు మెడలమీద కాంతం అనే అమ్మాయిని ఎక్కించుకుని మెయిన్‌రోడ్ వెంబడి తీసుకు వెళ్ళాడని పట్టణంలో అందరకూ తెలిసిపోయింది

"ఎలా జరిగింది? ఈ సంఘటన?"

ఆ పట్టణంలో ఒక పోలీసుస్టేషను వుంది. ఆఫీసర్లు వస్తున్నారు. బదిలీలయి వెళ్ళిపోతున్నారు. కాని దానిగురించిన వివరాలు చాలామందికి తెలీదు. సంబంధం వున్నవారికి తప్ప మిగిలినవారికి తెలీదు

నేరస్థులను పట్టుకోవడం, వారికి ఆ తర్వాత జరగాల్సిన తతంగం జరిపించడంలో పోలీసుస్టేషనులోని అధికారులు ఎలాచేసేవారో ఎవరికీ తెలీదు

ఆరడుగుల వెంకటరెడ్డి ఆ పోలీసుస్టేషనుకు కొత్తగా వచ్చిన సబ్‌ఇన్‌స్పెక్టరు. డ్రస్‌లో వుండగాచూస్తే ఎంతటి రౌడీ అయినా పారిపోతాడు.

వెంకటరెడ్డి డ్యూటీలో జేరిన రాత్రి ఒక లాడ్జిమీద రైడింగ్‌కు వెళ్ళాడు ఆ రైడింగ్‌లో పానకాలు దొరికాడు. లాడ్జి ఓనరు పానకాలు గొప్పదనం గురించి వెంకటరెడ్డికి చెప్పాడు. వెంకటరెడ్డి యింకా బిగుసుకుపోయాడు.

ఫలితంగా ఆ లాడ్జిలో దొరికిన పానకాలు తను అనుభవిద్దామనుకున్న కాంతాన్ని మెడలమీద ఎక్కించుకుని మెయిన్‌బజారు వెంబడి పోలీసుస్టేషనుకు వెళ్ళాల్సివచ్చింది

పానకాలుకు ఏం శిక్ష పడిందో తెలీదు. ఎంత జుల్మానా కట్టాడో తెలీదు. పానకాలు ఎవరికీ ఎక్కడా కనిపించిన జాడ తెలీదు. కాని వెంకటరెడ్డి పేరు బాగా తెలిసిపోయింది.

పండగల పేరున జరిగే కోడి పందాలు ఆగిపోయాయి. నిరంతరంసాగే పేకాటలు అదృశ్యమయిపోయాయి. నేరస్థులకు వెంకటరెడ్డి పేరు సింహస్వప్నం. మంచి వాళ్ళకు కూడా వెంకటరెడ్డి పేరు చెబితే హడల్.

కొంతమంది ఉద్యోగాన్నిబట్టి తమ పరపతి పెంచుకుని పదిమందికి తెలుస్తారు. అయితే అలాంటివారు బదిలీ అయినా, రిటైర్ అయినా తెరమరుగయిపోతారు.

చాలా కొద్దిమంది అంకితస్వభావంతో ఉద్యోగం విలువను పదింతలుచేస్తారు. అలాంటివారు చరిత్రలో మంచిస్థానాన్ని సంపాదించుకుంటారు. వెంకటరెడ్డి ఈ కోవకు చెందినవాడు.

వెంకటరెడ్డిగారు అని అనరు. ఎస్. ఐ. గారని అసలు అనరు. వెంకటరెడ్డి ఆ పేరు చెబితే ఏడ్చే పసిపిల్లలు-ఏడుపు ఆపేస్తారు.

ఒక చిన్న కాన్వెంటులో ఎప్పుడూ వెంకటరెడ్డిని చూడని పసిపిల్లలు వెంకటరెడ్డి పేరును ప్రస్తావించేసరికి ఎంతటి అప్రమత్తతతో ఉన్నారో......దానినిబట్టి వెంకటరెడ్డి విశేషం ఊహించుకో వచ్చు.

ఆ పట్టణంలో చంద్రయ్య పేరుమోసిన న్యాయవాది. చంద్రయ్య ఏ కేసు వాదించినా తప్పక గెలుస్తుందని ప్రతీతి. ఒక సందర్భంలో వెంకటరెడ్డి, చంద్రయ్య కలవడం తటస్థించింది.

మాటల సందర్భంలో చంద్రయ్య వెంకటరెడ్డిని అడిగాడు. "పానకాలు..... గుర్తున్నాడా?"

"గుర్తున్నాడు."

'పానకాలు విషయంలో మీరు ఎందుకు అలాంటి నిర్ణయం తీసుకున్నారు?" చంద్రయ్య అడిగాడు.

వెంకటరెడ్డి స్వభావం ఎవరికీ తెలీదు. కాని తనంటే చాలాగౌరవిస్తాడనే ధైర్యంతో చంద్రయ్య ఆ ప్రశ్నకు సమాధానం వినాలని వెంకటరెడ్డిని అడిగాడు.

"లేదు సార్. వ్యభిచారం నిర్మూలించాలనేది చట్టం. పానకాలు పెద్ద మోతుబరి. ఆలోచించడంకన్నా తన మాట నెగ్గాలనే స్వభావం గలవాడు లాడ్జి ఓనరు చెప్పిన మాటలనుబట్టి గ్రహించాను" కాసేపు ఆగాడు.

"పానకాలు ధోరణిలో డబ్బుతో చట్టాన్ని, న్యాయాన్ని కొనగలనన్న ధీమా కన్పించింది".

"సమాజంలో మార్పు రావాలి. చట్టం ఉద్దేశ్యం కూడా ప్రజలకు రక్షణ కల్పించడం. . పానకాలు లాంటి మనుషులను కోర్టులో హాజరుపరచి అతని నేరాన్ని నిరూపించడం ఆపై అతనికి జరిమానా......అవన్నీ మామూలుగా జరిగేవిషయాలు".

"అందుకే ఆలోచించాను. నిర్ణయం తీసుకున్నాను. మనిషి చేసిన తప్పు మళ్ళీ చేయకూడదు. మనిషి తప్పుచేస్తే జరిమానా విధించడం. జరిమానా కట్టడం. సహజధోరణిలో అధికారులకు దొరకకుండా మళ్ళీ అదే తప్పుచేయడం....."

"మనిషి ఆలోచనలో మార్పురావాలి. అందుకే మనసు నిత్యం హెచ్చరించాలి. తప్పు గురించి

ఆలోచించకూడదు. అప్పుడే మంచి సమాజం తయారవుతుంది. నిర్ణయం తీసుకున్నాను. నాకు న్యాయం అన్పించింది."

"పానకాలును హింసించలేదు. నాల్గు గోడలమధ్య జరిగే రహస్యం......బహిరంగం కావాలని అలాచేశాను. నాకు కావలసింది పానకాలులో మార్పు. అతన్ని శిక్షించటం కాదు".

చంద్రయ్య మాట్లాడలేదు.

*****

కొత్తసినిమా విడుదలయ్యింది. ఒకప్పుడు టికెట్లు బ్లాకులో దొరికేవి, ఇప్పుడు ఆ ప్రసక్తిలేదు. క్యూలో నుంచోవాలి. ఎటువంటి యిబ్బంది లేకుండా టికెట్లు దొరుకుతున్నాయి.

మొదటి ఆట సినిమాకు వెళ్ళడానికి వీలు కుదరని ప్రేక్షకులు రెండవ ఆటకు వచ్చి చూస్తారు. సినిమా రెండవ ఆట మొదలయింది. ప్రేక్షకులు తన్మయత్వంలో మునిగివున్నారు.

ప్రొజక్టరు నుండి కాంతి తెరమీద పడుతోంది. కాంతి రుజామార్గంలో ప్రయాణం చేస్తుంది. కావలిస్తే చూసుకోండి. కాంతిమార్గం స్పష్టంగా కన్పించేటట్లు చేస్తోంది హాలులోంచి వస్తున్నపొగ.

కొత్తగా పెళ్ళయిన దంపతులు సినిమా చూస్తున్నారు. వెనుక సీటులోంచి తాజాగా వదిలిన పొగ కొత్తపెళ్ళికూతురుకు దగ్గు తెప్పిస్తోంది మరొక వరుసలో పెద్దింటి ఆడబడుచులు కూర్చున్నారు. పొగ సముద్రంలో మునిగిపోయారు.

సినిమా కాసేపు ఆటవిడుపు. ఆ సరదా తీరడంకోసం ఎన్నిబాధలయినా భరించాలి తప్పదు అన్నట్లు బాధపడుతోంది పగలల్లా ఇంటిచాకిరీతో సతమతమయి భర్తతో సినిమాకు వచ్చిన ఒక మధ్యతరగతి కుటుంబంలోని ఇల్లాలు.

"సార్! మీకోసం ఎవరో వచ్చారు. బయట వున్నారు." సినిమా మంచిరసపట్టులో వుండగా భుజంమీద చెయ్యివేసి చెప్పాడు ఒకవ్యక్తి.

"నాకోసమా? ఎవరు?" ఉలిక్కిపడి అన్నాడు ఆసామీ.

"మీకోసమేసార్!" ఆవ్యక్తి చెప్పాడు.

గట్టిగా ఒక్క దమ్ముపీల్చి పొగవదిలాడు. కాలికింద అంతవరకూ తృప్తినిచ్చిన దానిని పడేసి నలిపేశాడు.

హాలుబయటకు వచ్చాడు. "నమస్కారం సార్!" పరిచయంవున్న కంఠం విన్పించింది ఆసామీకి.

"నమస్కారం. ఏమిటి విశేషం" ఆసామీ అడిగాడు.




"పొరబాటయిపోయింది సార్. మీరు ఒకమాట చెప్పండిసార్" పరిచయం వున్న కంఠం అంటోంది.

ఆసామీ చుట్టూ చూశాడు. విషయం అర్థం అయ్యింది.

ఎదురుగా పోలీసు వ్యాన్. తెలివిగా ఆలోచించాడు

మి.
ఎవ్వు వ్యాన్ ఎక్కు. నేను మాట్లాడతాను".
రిచయ కంఠం. మాట్లాడకుండా వ్యాను డు.

ాత్లో! నమస్కారంసార్! మీరు. .." అర్థోక్తిగా ోయాడు

సామి మాట్లాడలేకపోయాడు. తనుడయిపోయాడు.

ది వ్యాను ఎక్కుదాం' వారితీశాడు ఆసామి.
ౖవర్ ప్రక్క రెండు సీట్లలో నూ కూర్చున్నారు.

సామికి తలవంపుగావుంది. సినిమా ంటర్లలో పొగ త్రాగడం నిషేధించబడింది. ఇది విషయం కాదు చాలా పాత విషయం. కాని ి అంతగా ఎవరూ పట్టించుకోవడంలేదు మకే థియేటర్లలో పొగత్రాగుతున్నారు.

ధికారులు చర్య తీసుకోకపోవడం, థియేటర్ జమాన్యం చూసి చూడనట్లు ఊరుకోవడం త్రాగేవారిని థియేటర్‌లో పొగ త్రాగేందుకు త్సహించినట్లుయింది.

చట్టం తెలియనివాడు, నిరక్షరాస్యుడు, క్ష్యంగా ప్రవర్తించడం కాదు. ఎంత ప్రమాదం ింది. చట్టం తెలిసినవాడు, నేరం చేస్తే ఏం శిక్ష ంచాలి? న్యాయాన్ని పరిరక్షించవల్సినవాడు ట్టాన్ని ఉల్లంఘిస్తే ఏం జరుగుతుంది?

సామీకి చాలా విచారంగావుంది. ఎప్పుడూ ద్దాయిల తరఫున వాదించే తను ఒక ద్దాయిగా తయారయిన పరిస్థితివచ్చింది. తనకు శిక్ష పడాల్సిందే. చూస్తే చట్టాన్ని గౌరవించి డకపోతే చట్టాన్ని ఉల్లంఘించే పరిస్థితికి చ్చింది తనపరిస్థితి.

జాతిని జాగృతం చేసి సమాజాన్ని సరియైన ర్గంలోకి దారి చూపి నడిపించాల్సిన తనకు ొక పెద్ద కనువిప్పు. ఎంతోమంది పోలీసు కారులు తనకు తెలుసు. కాని వెంకటరెడ్డిలాంటి ళ్ళు తెలీదు.

వెంకటరెడ్డి మీద తనకు చాలా గౌరవం

# కనిపించని న్యాయం

వెంకటరెడ్డి చాలా గొప్పవాడు సమాజ శ్రేయస్సు అతని ఊపిరి. నేరస్థులను చాలా విచిత్రంగా శిక్షిస్తాడు వెంకటరెడ్డి. అతని పరిధి వేరు. అతని న్యాయం చట్టం చట్రంలో నే ఉంటుంది.

వ్యాను రోడ్డు మీద వెడుతోంది డ్రైవర్ ప్రక్కన కూర్చున్న వెంకటరెడ్డి ఆసామి చంద్రయ్యతో ఏమి మాట్లాడడం లేదు

వ్యాను మరొక సినిమా థియేటరు ముందు ఆగింది.

"మా డ్యూటీలో మేము ఉంటాం. తమరు ఇంటికి వెళ్లిపోండి సార్" వెంకటరెడ్డి అన్నాడు

"సారీ! నేను పొరబాటు ..."

"క్షమించండి! సార్! తమరు వెళ్లిపొండి!" వెంకటరెడ్డి అన్నాడు. న్యాయస్థానంలో తన అర్గ్యుమెంట్సుతో గడగడలాడించే చంద్రయ్య వెంకటరెడ్డి ఆజ్ఞకు బద్ధుడై వెళ్లిపోయాడు.

చాలా రోజులు గడిచిపోయాయి. వెంకటరెడ్డి ఆ పట్టణం నుండి బదిలీ అయిపోయి వెళ్లిపోయాడు. చంద్రయ్య జీవితంలో వెంకటరెడ్డి అర్థంకాని ఒక విచిత్ర వ్యక్తిగా మిగిలిపోయాడు. వెంకటరెడ్డి ప్రభావం ఏమిటో తెలీదు చంద్రయ్య మళ్లీ సినిమా చూడలేదు.

చంద్రయ్య మనస్సులో సినిమా చూసే ఆలోచనే రాదు. ఒకనాటి తన అనుభవం జీవితంలో ఎంతటి ప్రభావం చూపిందో అనుకుంటాడు చంద్రయ్య.

ఒక రోజున కొంచెం తీరుబడిగా ఉంది. రేడియో విందామని ఆన్ చేశాడు చంద్రయ్య. "ఆకాశవాణి ... కేంద్రం ... మీరిప్పుడు 'చట్టం చట్రంలో న్యాయం' అనే అంశంపై డిఫై. యస్. పి. శ్రీ వెంకటరెడ్డి ప్రసంగం వింటారు." చంద్రయ్య చాలా ఆసక్తిగా వినడం మొదలుపెట్టాడు.

వెంకటరెడ్డి ఎన్నో విషయాలు విశేషంగా వివరిస్తున్నాడు. ఉన్నట్టుండి వెంకటరెడ్డి ప్రసంగం సరికొత్త మలుపు తిరిగింది.

'సమాజంలో మంచి గుర్తింపు పొందిన విద్యాధికులు సామాన్యంగా నేరం చెయ్యరు. నేరం చేయడానికి ఇష్టపడరు తమకు తెలియని పరిస్థితులలో నేరం చేస్తే వారిని అవమానపరచకూడదు. దానిని బహిరంగ పరచకూడదు. ఎందుచేతనంటే సమాజానికి దారి చూపే విద్యాధికుడు తప్పు చేశాడనే భావం ఇతరులకు కలగకూడదు.

పోలీసు అధికారి దృష్టిలోకి వెళ్లిందనే విషయం చాలు అటువంటి వారిలో పరివర్తన వచ్చేందుకు. అటువంటి వారు శిక్ష స్వయంగా వేసుకుంటారు. సమాజాన్ని అను నిత్యం హెచ్చరించగలరు.

నేరం చేసిన వారిని శిక్షించడం అనేది న్యాయస్థానం పరిధి. కాని చట్టాన్ని ఉల్లంఘించే నేరాలను న్యాయస్థానానికి తీసుకు వెళ్లే ముందు సమాజపరంగా దాని ప్రభావం ఎట్లా ఉంటుందని ఆలోచించి నిర్ణయం తీసుకున్నట్లయితే చాలా మంచిది."

చంద్రయ్య దృష్టిలో వెంకటరెడ్డి మరొకసారి బాగా ఎదిగిపోయాడు. వెంకటరెడ్డి చేతిలో తను ఓడిపోయాడు. తనకు తెలిసిన న్యాయ శాస్త్రంలో వెంకటరెడ్డి చెబుతున్న న్యాయం కన్పించదు.

చంద్రయ్య ఆలోచిస్తున్నాడు. వెంకటరెడ్డి న్యాయమూర్తులకు న్యాయమూర్తి. న్యాయ శాస్త్రం అర్థ వివరణ చెప్పగల సమర్థుడు. తన సమయస్ఫూర్తితో శాశ్వతంగా సినిమా చూడకుండా నాకు నేను శిక్ష విధించుకునేలా చేశాడు వెంకటరెడ్డి.

నిజంగా చట్టం చట్రంలో న్యాయాన్ని పరిరక్షించగల పోలీసు ఆఫీసరు వెంకటరెడ్డి అన్పించింది చంద్రయ్యకు. □

# నడుస్తున్న చరిత్ర

రాగద్వేషాలు రగిలి
ఇద్దరు విద్యార్థులు ఒక్కక్లాసులో
ఒద్దిగా కూర్చోని కాలమిది!
ఇన్విజిలేటరు ఒంటరిగా
ఇంటికి చేరని కాలమిది!
ఆకసాన నక్షత్రాల్ని లెక్కించే కాలమిది
బలవంతుడి లెక్కలనే బలపరిచే కాలమిది!
చదివినవాడికి మార్కులు రాని కాలమిది
ప్రశ్నా పత్రం గుట్టుపెట్టాల్సినవాడే
బట్టబయలు చేస్తున్న కాలమిది!
ఇంటి దొంగను ఈశ్వరుడు పట్టిన కాలమిది
ఇంట్లో వాళ్ళు ఈశ్వరుడ్ని శిక్షించిన కాలమిది!
తల్లి భారతికి గంతలు కట్టి
తనయులు తాకట్టుపెడుతున్న కాలమిది!
కడుపు కొట్టి కడుపు నింపుకొనే కాలమిది!
కడుపు నిండినా కడుపుకొట్టడం మానని కాలమిది!
ఎంతటి వింత కాలమిది
మరెంతటి చేటుకాలమిది!

అడిగోపుల వెంకటరత్నమ్.



సీరియల్

# ప్రేమసాగరమథనం

డాక్టర్ కొత్త రవీంద్రబాబు



(గత సంచిక తరువాయి)

విలాసిని తెల్లవారిన తర్వాత లేచి గది తలుపు తెరుచుకుని బయటకు ృచ్చింది.

మేడలోంచి చలమయ్య చకచక పరుగులాటి నడకతో వచ్చాడు. రాత్రంతా ాగారం చేసినందువల్ల నిద్ర వచ్చి లోపలకు వెళ్ళి పడుకున్నాడే గాని విలాసిని ది తలుపు కీచుమని శబ్దంతో తెరుచుకోగానే మెలకువ వచ్చిందతనికి!

పంపు దగ్గర నీళ్ళు పట్టుకోటానికి బకెట్ తీసుకు వెళ్తున్న విలాసినితో విలాసినీ! రాత్రంతా మీ మేనమామ కొడుకు మన సందులో పహరా కాసాడు!" ని చెప్పాడు వెకిలి నవ్వు నవ్వుతూ.

అతని మాటలకు కోపంతో ముఖం జేవురించి తలదించుకుని వెళ్ళి ోయింది విలాసిని.

"నిజం! పరాచికానికందం లేదు' రాత్రి నిన్ను గేటు దగ్గరదాకా పంపి వెళ్ళిన తను, అదే మీ మేనమామ కొడుకు, రాత్రంతా మన సందులో పహరా కాసాడు!"

అతని మాటలకు ఆశ్చర్యపోతూ గదిలోకి వెళ్ళింది విలాసిని.

దీప్ తనకోసం రాత్రంతా మేలుకుని వుండి జాగారం చేసాడన్న విషయం మెకు ఆనందం కల్గించింది.

చకచక వంట పూర్తి చేసుకుని భోంచేసి టిఫిన్ బాక్స్‌లో అన్నం కూర ంచుకుని కాంతి ఎంపోరియమ్‌కు బయల్దేరింది. సందు దాటగానే దీప్ దురయ్యాడామెకు!

కొంచెం ఎరుపెక్కిన అతని కళ్ళు చూడగానే చలమయ్య చెప్పిన మాట జమేనని తెలిసిందామెకు.

"హలో! గుడ్‌మార్నింగ్!" అంటూ విష్ చేసాడతను.

"గుడ్‌మార్నింగ్! మీరు రాత్రి ..."

"మళ్ళీ ఆ వెధవలు తిరిగి వచ్చి మిమ్మి బాధిస్తారేమోనని రాత్రి ఇక్కడే ున్నాను. వెధవలు వళ్ళు పట్టించుకుంటూ క్లబ్‌లో పడి వుంటారు! అయినా ఆ ంగతి మీ కెలా తెలిసింది?"

"మా యింటి గోడలకు కళ్ళుంటాయి లెండి!" అంటూ ఫక్కున నవ్వి అతనికి చలమయ్య విషయం చెప్పింది.

"పాయిరిజం పరాకాష్ఠ చెందిన వ్యక్తి అన్న మాట!" అన్నాడు దీప్ సాలోచనగా.

"ముక్కూ మొహం తెలియని అనాథ కోసం ఇంత శ్రమ పడుతున్నారు! మీ రుణం ఎలా తీర్చుకోవాలో తెలియటం లేదు."

'అయినవాళ్ళ మధ్య రుణాలు తీర్చటాలు ఏమిటి?" అని చప్పున నాలుక కరుచుకున్నాడు దీప్.

చివాలున తలఎత్తి అతనివంక నిశితంగా చూసింది విలాసిని

"ఆత్మీయతాభావం ఏర్పడ్డానికి ఎంత కాలం కావాలి? కొంతమందిని చూడగానే ఎన్నో జన్మల స్నేహబంధం వున్నట్లు ఆత్మీయులమనే భావన మనసులో చల్లగాలి తెమ్మెరలా వీస్తుంది! మిమ్మలను చూడగానే నాకు అలా అనిపించింది!"

"మర్చిపోయాను! రాత్రి మా హౌస్ ఓనరు మీ గురించి ఎవరు అని అడిగితే మా మేనమామ కొడుకు అని చెప్పాను!" అంది విలాసిని. ఆమె కంఠంలో వొలికిన ఆర్ద్రతా భావానికి దీప్ మనసు కరగిపోయింది.

"నిజంగా నేను .." మాట్లాడలేకపోయాడు దీప్

"అలా చెప్పకపోతే అతడు లేనిపోనివి వూహించుకుంటాడు. చిలువలు పలువలు చేసి నలుగురికి చెబుతాడు! అందుకని మీరు నాకు మేనమామ కొడుకవుతారని అబద్ధం చెప్పాను!"

"అయితే నేను మీ యింటికి రావాలి!"

"ఎందుకు?"

"మీ హౌస్ ఓనర్‌కు ధన్యవాదాలు తెలుపటానికి!"

"అతనికెందుకు?"

"మీతో నాకు గల స్నేహబంధాన్ని వృద్ధి పరచి దాన్ని రక్త సంబంధంగా మార్చినందుకు!"

కాంతి ఎంపోరియం కనపడడంతో పక్కకు తప్పుకుని వుండిపోయాడు దీప్.

అతని వంక చురుకుగా చూసి వెళ్ళింది విలాసిని - ఆ చూపులో కృతజ్ఞత, స్నేహభావం మిళితమై వున్నాయి!

విలాసిని సరిగా కాంతి ఎంపోరియం మెట్లెక్కుతుండగా సుడి గాలిలా దూసుకుని వచ్చింది రాణి.

'ఏయ్ విలూ ? ఏమిటే తొందరగా కోటీశ్వరురాలు కావాలని పిచ్చి పనులు చేస్తున్నావట" అని కోపంగా అడిగింది రాణి.

విలాసిని రాణి మాటలు పట్టించుకోనట్లు "ఏమ్మా రాణీ! బాగున్నావా! బొత్తిగా చిక్కిపోయావేమమ్మా" అని ఆప్యాయంగా పలుకరించింది, ప్రేమగా భుజంమీద చేయి వేసి.

తండ్రి ఇంట్లో వున్నంతకాలం రాణి విషయాలన్నీ విలాసిని చూస్తుండేది. తల్లి ఇందిర రాణి విషయాలేమీ పట్టించుకోక పనివాళ్ళమీద వదిలితే

జరిగిన కథ– 5: నారాయణరావు చివరి కోరికపై సందీప్ విజయవాడ ిస్తాడు విలాసిని గురించి వివరాలు, ఆమెను సవతి తల్లి, ఆమె తమ్ముడు ాగరాజు వేధిస్తున్నారని తెలుసుకుంటాడు. తాను తెచ్చిన ఎనిమిది లక్షల ూపాయలు విలాసిని ఖాతాలో జమ చేస్తాడు ఆమెపై అత్యాచారం రపబోయిన ముఠాను చితకతన్ని ఆమెను రక్షిస్తాడు. నాగరాజు ముఠా అక్రమ ్థావరం మీద పోలీసులు దాడి చేస్తారు. తనపై దాడిక, విలాసిని ఖాతాలో బ్బుకు తన ప్రత్యర్థి సన్నీ కారణమని ఆయనపై పగ బూనుతాడు నాగరాజు. న్నీ కుడిభుజమైన సాంబు మరణిస్తాడు.

చిన్నప్పుడు ఎత్తుకుని పెంచింది; స్నానం చేయించింది, అన్నం తినిపించింది. ఏడుస్తుంటే కథలు చెప్పి సముదాయించింది! అందువలన చెల్లి కసురుకున్నా. విసురుకున్నా సరకుగొనకుండా అలా అడిగింది విలాసిని!

"ఆపు నీ వెధవ వేషాలు! పైకి ప్రేమ వొలకబోస్తావు - కడుపునిండా విషం నింపుకుంటావు! నువ్వు నువ్వు పయోముఖ విషకుంభానివి.... గోముఖవ్యాఘ్రానివి.... నువ్వు తేనె పూసిన కత్తివి.... పురుగులు నిండివున్న యాపిల్ పండువి...." సినిమా డైలాగులు వల్లించి ఆయాసంతో రొప్పసాగింది రాణి.

షాపులోని వర్కర్లు నిలబడి రాణి వంక వింతగా చూడసాగారు!

"నీరసంగా కనబడుతున్నావు రాణీ! ఇలా రామ్మా! ముఖం నిండా చెమట పట్టింది. ఫాన్‌కింద కూర్చో! వుండు నీ కిష్టమైన కాడ్ ఛిక్స్ తెచ్చి పెడతాను" అంటూ పక్కనున్న ఫాన్సీ షాపుకు వెళ్ళింది విలాసిని.

రాణి తిట్లు పట్టించుకోకుండా ఆమెకు యిష్టమైన వస్తువులు తెచ్చి తినిపిస్తే కోపం పోతుంది! ఆ విషయం విలాసినికి తెలుసు! సవతి చెల్లెల్ని ఎత్తుకుని పెంచిన ప్రేమపాశంవలన ఆమె మనసులో రాణి అంటే ఒక విధమైన ఆర్ద్రభావం వున్నది.

కాడ్‌బరీ చిక్‌లెట్స్ పాకెట్ చించి చిక్‌లెట్ రాణి నోటిలో వుంచుతూ "ఐస్



శారద, విజయవాడ

జార్బరుషావువాడు విలాసినిని గురించి అంత గ్యాదగా చెప్పాడుకదా! నిజానికి అంత స్కారవంతులు వుంటారనుకోను! నవలలోను, మాల్లోను మనిషిని అందంగా చిత్రిస్తారు.

: సంస్కారానికి, వృత్తికి లేదా ఆర్థిక, మాజిక స్థాయికి సంబంధం లేదు అని ప్పడమే నా వుద్దేశం!

రగాని కొండల్రావు గౌడె, ఖమ్మం

డాక్టర్‌కుండే రిస్కును, రైటర్‌కుండే వోర్పును ఒక లగా అందిస్తే బాగుంటుంది. ప్రేమసాగర థనం అంతర్యం ఏమిటి?

: సుశ్రుత నర్సింగ్‌హోం (ఆంధ్రపత్రిక సీరియల్)లో డాక్టరు రచయిత రో!

ప్రేమసాగర మధనం చివర వరకు విితే ఆంతర్యం బోధ పడుతుంది!

మారి పెయ్యేటి చాముండేశ్వరి, లకలూరిపేట

సమాజంపై రచనల ప్రభావం ఎక్కువా? యితపై సమాజం ప్రభావం ఎక్కువా?

: రచయిత సమాజంలో భాగం గనుక నల ప్రభావం సమాజంమీద,

# రచయిత



# జవాబులు

సమాజం ప్రభావం రచయిత (రచన)ల మీద వుంటుంది.

సమాజగమనాన్ని సంపూర్ణంగా మార్చగల రచనలు అరుదుగా అయినా వస్తుంటాయి.

శ్రీపాద శాంతి శ్రీనివాస్, బొబ్బిలి

ప్ర : రచయిత్రులు సెక్స్, హారర్ నవలలు రాస్తూ స్త్రీలను అసభ్యంగాచిత్రీకరిస్తున్నారు.

జ : అందరూ కాదనుకుంటాను! కొద్దిమంది వ్రాసే జుగుప్సాకరమైన వ్రాతలను అందరకూ అన్వయించకండి. కాల మహిమ, సమకాలీన సమాజ ప్రభావం వలన ఆ కొద్దిమంది అయినా అలా వ్రాస్తుండి వుండవచ్చు.

యల్లపు భాస్కరరావు, గవరపాలెం, అనకాపల్లి

ప్ర : గుణం గొప్పదా? కులం గొప్పదా?

జ : నిస్సందేహంగా గుణం గొప్పది! కుల ప్రభావం అంతరించినప్పుడే మన దేశం పురోభివృద్ధిపథంలో ముందుకు వెడుతుంది.

బోర్ల వెంకట రమణగౌడ్, రమేష్,నాగభూషణమ్, ప్రసాదరావు, హరిప్రసాద్, కర్నూలు

ప్ర : ప్రేమసాగర మథనం బాగా నచ్చింది ..... డాక్టరు డిగ్రీకి ప్రాముఖ్యం యిస్తారా?

ధన్యవాదాలు. రెండో ప్రశ్నకు సమాధానం యిచ్చాను. (మరొకరికి ఇదే శీర్షికలో).

వింజమూరి కృష్ణమూర్తి, వరంగల్

ప్ర : ప్రేమసాగరం మథిస్తే ఏమవుతుంది?

జ : సీరియల్ చివర వరకు చదివితే తెలుస్తుంది!

# ప్రేమసాగర మథనం

ర్లర్ తెరచి వుంది! నీ కిష్టమైన ఫ్రూట్‌సాలడ్ రెడీగా వుంది! రామ్మా!" అంటూ ణిని కాంతి ఎంపోరియం దగ్గర్లోనేవున్న ఐస్ పార్లర్‌కు తీసుకుని వెళ్ళింది.

"ఛీ! వదులు! ఏమిటి!" కసురుకుంటూ విసురుకుంటూ అక్క వెంట ఐస్ ర్లర్‌కు వెళ్ళింది రాణి.

రెండు ఫ్రూట్‌సాలడ్ ఆర్డర్ చేసింది విలాసిని. బేరర్ కప్పులు తీసుకురాగానే స్పూన్‌తో చెల్లికి తినిపించసాగింది విలాసిని. రెండు కప్పులు ఖాళీ అయ్యాక రో రెండు కప్పులు తినిపించింది విలాసిని రాణిచేత.

అప్పటికి రాణికి అక్కమీద కోపం తగ్గింది.

"నువ్వు సన్నీగాడి దగ్గర ఎనిమిది లక్షలు తీసుకుని మామయ్య రహస్యాలు తనికి తెలిపావు! అందుకని మామయ్యకు నీమీద కోపంగా ంది! తెల్లవారుజామున మామయ్య గోడౌన్ మీద రెయిడ్ జరిగింది!" అసలు షయం అక్కకు చెప్పింది రాణి.

"ఏమిటమ్మా నువ్వనేది? నా దగ్గర ఎనిమిది లక్షలు డబ్బుంటే ట్టల షాపులో గుమాస్తా వుద్యోగం ఎందుకు చేస్తాను!" విస్తుపోతూ అడిగింది లాసిని.

"ఏమో! అదంతా నాకు తెలియదు! మామయ్యకు నీమీద కోపంగా వుంది రి!"

రాణికి రాత్రి జరిగిన విషయం చెబుదామా వద్దా అని క్షణం ఆలోచించింది లాసిని. నాగరాజు రాణిల మధ్య కాఫ్ లవ్ - శృంగార రసాస్వాదనాబంధం గుర్తుచ్చి ఆ విషయం చెప్పడం అంత మంచిదికాదనుకొని మిన్నకుండిపోయింది.

"అక్కా! రాత్రంతా నిద్ర పట్టలేదు!"

"ఏమ్మా! రాత్రి భోంచేయలేదా?"

"ఊఁ నువ్వు యింట్లోంచి వెళ్ళిపోయాక నా కెవరూ అన్నం తినిపించటంలేదు! అందుకని నేను సరిగా భోంచేయటంలేదు!"

విలాసిని మనసులో రాణి అంటే జాలి కల్గింది. దీర్ఘంగా నిట్టూర్చి "బేరర్! మరో రెండు ఫ్రూట్‌సాలడ్ కప్పులు పట్రా!" అంది.

"వద్దు! వద్దు!" అంటున్న రాణిచేత రెండు కప్పులూ తినిపించింది విలాసిని.

"విలక్కా! మరే నేను యింట్లో చెప్పకుండా వచ్చాను. మంచంమీద దిండ్లు వుంచి పైన దుప్పటి కప్పి బాత్‌రూం తలుపు తీసుకుని మేడ వెనుక మెట్లగుండా వచ్చాను! ఎక్కువసేపు వుంటే అమ్మకనుమానం వస్తుంది!" అంది రాణి.

"అలాగేనమ్మా! అప్పుడప్పుడూ వస్తూండు" అని విలాసిని అనగానే తలూపుతూ వెళ్ళిపోయింది రాణి.

పిచ్చిపిల్ల! నేనంటే మనసులో ప్రేమ అభిమానం వున్నాయి! కాని తల్లి, మామల ప్రభావం నుండి బయట పడలేకపైకి నామీద రుసరుసలాడుతుంది.

రాణి స్ప్లిట్ పర్సనాలిటీ డెవెలప్ చేసుకుంటున్నది. అనుకుంటూ షాపు లోకి వెళ్ళింది విలాసిని.

కాంతి ఎంపోరియంలో గుమాస్తా రామం "మా కందరికి పార్టీ యివ్వాలండోయి!" అని నవ్వుతూ అడిగాడు.

"దేనికి?" అంది విలాసిని.

"లాటరీలో ఎనిమిది లక్షలు వచ్చినందుకు!" అంది మరో క్లర్కు రమ.

విలాసిని నివ్వెరపోయింది క్షణం సేపు. ఇందాక రాణి అదే మాట యిప్పుడు మళ్ళీ అదే పాట!

"ఏమిటి మీరనేది?" అంది ఆశ్చర్యంగా.

"నిన్న బాంకులో ఎనిమిది లక్షలు డిపాజిట్ చేసుకుని యివ్వాళ చిరుగుల చీర కట్టుకుని షాపులో గుమాస్తా వుద్యోగం చేయటానికొచ్చావూ!" అంది రమ గుంభనగా.

"నాకే ఎనిమిది లక్షలొస్తేనా!" అన్నాడు రామం.

"ఏం చేస్తావేం?" అంది రమ.

జి. ఎ. వెంకటేష్, చిలమత్తూర్, హిందూపురం

ప్ర : మిమ్మల్ని ఏ ప్రేరణ రచయితగా మార్చింది?

జ : మనసులో కలిగే అనుభూతులు నలుగురితో పంచుకోవాలనే ఆకాంక్ష నన్ను రచయితను చేసిందను కుంటున్నాను.

ప్రతాప వెంకటసుబ్బారాయుడు. హైదరాబాదు

ప్ర : ప్రేమసాగర మధనం అద్భుతంగా రాస్తున్నారు వైద్యం, సాహిత్యంలో ఏదంటే మక్కువ?

జ : మీ అభిమానానికి కృతజ్ఞతలు. రెండు కనులలో ఏదంటే మక్కువ అంటే ఏం సమాధానం చెప్పను?

మాడభూషి నరసింహాచారి, నర్సాపురం

ప్ర : వయసుతో పాటు రచయితల స్థాయి పెరగడంలేదెందుకు?

జ : మీ అభిప్రాయం నిజం కాదను కుంటాను! వయసుతో, అనుభవంతో రచనకు సమగ్రత సంపూర్ణత సిద్ధిస్తుందను కుంటాను (కొందరిలో నయినా!)

## ఉత్తమ ప్రశ్న

మాడభూషి నరసింహాచారి, నర్సాపురం

ప్ర : సమకాలీన రచయితల రచనలను ఏవిధంగా అంచనా వేస్తారు?

జ : భాష, భావం, భావుకత, శైలి, శిల్పం సామాజిక దృక్పథం, సమభావం, ఎవరినీ కించ పరచకుండా వుండడం, ఎవరినీ అనవసరంగా అందలం ఎక్కించకుండా వుండటం, ఒరిజినాలిటీ, కొత్త పోకడలు, సార్వ జనీనత, మొదలగు విషయాలను బట్టి రచనలు నన్ను ఆకర్షించడమో లేదా నాలో వుదాసీనత కల్గించడమో జరుగుతుంది.

ఏ రచననూ నేను ద్వేషించను- వున్న మంచి తీసుకోవటం, చెడు పట్ల ఉదాసీనభావం వహించడం- అంతవరకే!

యల్లపు భాస్కరరావు, అనకాపల్లి

ప్ర : ప్రేమ అనే పదం లేకుండా ఏ రచయితా నవల వ్రాయలేకపోతున్నాడు.

జ : ప్రేమ లేని జీవితం లేదు!- ప్రేమలేని జీవుల సమూహంతో యీ ప్రపంచం నిండి వుంటుందనుకోలేను!

మేచినేని అనూరాధ, అశ్వారావుపేట

ప్ర : వైద్యవృత్తికి సంబంధించని శైలిని, విషయాన్ని ఎన్నుకున్నారెందుకు?

జ : వైద్యవృత్తికి సంబంధించినవే రాస్తే నాకు తలనొప్పి, మీకు విసుగు! అందుకని

సి. వి. నరసింహదాసు, విజయనగరం

ప్ర : రచన అంటే పాఠకులను మభ్యపెట్టి మత్తు కలిగించేదయివుంటున్నది

జ : "మత్తు" ప్రభావం ఎక్కువవుతున్న సమాజంలో కఠిన జీవిత సత్యాలను చదువుకునే ఓపిక నశించిపోతున్న పాఠకులను దృష్టిలో పెట్టుకుని పాప్యులర్ కావాలనుకునే రచయితలు మత్తు ఎక్కించే గమ్మత్తు రచనలు చేస్తున్నారు!

వి. యస్. శాస్త్రి, సత్తెనపల్లి

ప్ర : మీ రచనల వుద్దేశం ఏమిటి? ఏ తెలియజేయాలనుకుంటున్నారు?

జ : మనసులో ఎగసిపడే వివిధ భావాలను, అనుభూతులను నలుగురితో పంచుకోవాలన్న ఆకాంక్ష నన్ను రచయితను చేసింది. ☐

---

"గుమాస్తా వుద్యోగం మాని హాయిగా కాలిమీద కాలేసుకుని దర్జాగా, జల్సాగా, ఠీవిగా వుషారుగా, వుల్లాసంగా...."

"అపవోయ్ పగటి కలలు! నీకు నాకు ఎందుకు వస్తాయి లక్షలు" అంది రమ.

* * * * * * * * *

డిస్కో డాన్స్ హాల్‌లో నృత్యం చేసే రసిక యిల్లు మాచవరంలో వుంది. సన్నీ ఏలూరు రోడ్డు రామమందిరం దగ్గర ఆటో ఎక్కి రసిక యింటికి వెళ్లాడు. తలుపు మీద గొళ్ళెంతో మూడు సార్లు తట్టాడు సన్నీ.

బద్ధకంగా మంచంమీద పడివున్న రసిక హుషారుగా లేచి వచ్చి తలుపు తీసింది. తలుపు తట్టిన శబ్దాన్ని బట్టి వచ్చినది సన్నీ అని పోల్చుకుందామె!

"సన్నీ డియర్! ఏమిటి అలా వున్నావు? అలసిపోయిన డిస్కో డాన్సర్‌లా?" అందామె.

మాట్లాడకుండా లోపలకు వెళ్ళి యీఫోం బెడ్‌మీద వాలిపోయాడు సన్నీ.

అతని కాలికున్న బూట్లను విప్పుతూ పరీక్షగా చూచిందతని వైపు. బట్టలు నలిగిపోయి వున్నాయి. వళ్ళంతా చెమట దిగ కారుతున్నది.

ఫాన్ స్విచ్ నొక్కి అతని షర్టు, పాంటు విప్పి లుంగీ తెచ్చి చుట్టింది. ఫ్రిజ్‌లోని అయిస్ వాటర్ గిన్నెలో వేసి కొంచెం యుడికొలోన్ చిలకరించి కర్చీఫ్ అందులో ముంచి దాంతో సన్నీ వళ్ళు తుడవసాగిందామె. వంటిన పట్టిన చెమట పోగొట్టాక సన్నీ మనసును వేడెక్కించటానికి స్కాచ్ విస్కీ గ్లాస్‌లో పోసి ఏరేటెడ్ వాటర్ కలిపి అతని పెదాల దగ్గరుంచింది.

రసిక సపర్యలవలన సేద దీరిన సన్నీ లేచి కూర్చున్నాడు.

"హల్లో డాలీ!" అన్నాడతను. డాన్స్ బేబీ అని ఒకమారూ, డాలీ అని వొకమారు పిలుస్తుంటాడు రసికను.

"సుడియర్" అంది డాలీ గోముగా.

"మనసేం బాలేదు డియర్!"

"డిస్కో డాన్స్ రికార్డు పెట్టేదా?"

"వద్దు!"

"సుడియర్! ఎందుకలా వున్నావు? నువ్విలా డీలా పడిపోయి వుండగ చూడలేదు!"

"అరగంట క్రితం నీ సుడియర్ మంటలలో మాడి మసి అయి వుండేవాడు!"

"ఆ! అంత పనికి సాహసించిం దెవరు?"

"కోటిగాడు బుక్‌షాప్ ఎదురుగా వున్న మేడమీద నుండి స్మోక్ బాంబ్ కట్టిన అవుటను షాపులోకి పేల్చాడు! అవుటులో ఎక్స్‌ప్లోజివ్స్ బాగా కూరినట్టున్నాడు నిముషాలలో షాపు దగ్ధమైంది. ఎలానో ప్రాణాలు రక్షించుకుని బయట పడ్డాను."

"పోన్లే డియర్! వెధవ షాపు పోతేపోయింది! ప్రాణాలు రక్షించుకుని బయట పడ్డావు! అంతే చాలు!"

"ప్రాణం కన్న మిన్న అయిన అనుచరుడు సాంబు మాడి మసి అయిపోయాడు!"

"ఆ! సాంబుపోయాడా?"

"భయంకర నరకం అనుభవించి కుక్కచావు చచ్చాడు!" డాలీ! డబ్బిస్తే తోకాడించుకుంటూ వెంట తిరిగే అనుచరులు ఎందరైనా వుంటారు!

కాని ప్రాణాన్ని వొడ్డి బాస్ ప్రాణాలు కాసే అనుచరులు దొరకరు!"

"కోటిగాడి కెంత ధైర్యం!?"

"కోటిగాడిదేముంది! కిరాయికి కక్కుర్తిపడి కోరిన పని చేస్తాడు!

వాడిని పంపించిన ఆ నల్లతాచు నాగరాజుగాడ్ని ఎలాగైనా పరాభవించాలి! వీలయితే సఫా చేయాలి!"

"సుడియర్! నాగరాజును పరాభవించాలంటే ఒకటే మార్గం!"

"ఏమిటి?"

"వాడు తన అక్క సవతి కూతుర్ని ప్రాణాలకంటే ఎక్కువగా ప్రేమిస్తున్నాడు!"

"డాలీ! పరాచికాలాడటానికి యిదా సమయం! నాగరాజుకూ నాకూ లవ్ ఎఫైర్స్ వుంటాయా?!"....

"నిజం డియర్! నీమీద వొట్టు! వాడు నిండా మందు కొట్టినప్పుడు, పసందైన

## జ్ఞాని-అజ్ఞాని




అజ్ఞానికి అహంభావం, జ్ఞానికి శాంతగుణం సాధారణ మైనవి. తన కేమీ తెలియక పోయినా, అన్నీ తెలుసునని అనుకోవడమూ, తనకి చాలా విషయాలు తెలిసి వున్నా, ఇంకా తెలుసుకో వలసినవి అపారంగా ఉన్నాయని గమనించి, జ్ఞాని తనకేమీ తెలియదని వినయం చూపడమూ సర్వ సాధారణమే! ఈ విషయం "తెలివి యొకింత లేని యెడ దృప్తుడనై కరిభంగి సర్వమున్..... తెలిసిన వాడనని అజ్ఞాని భావిస్తాడనీ, 'తెలియని వాడనై మెలగితిన్" అని జ్ఞాని భావిస్తాడనీ విద్వాంసు లెన్నడో చెప్పి ఉన్నారు.

తనకు సుఖంగా కాలం గడచిపోతూ, తనవారు మంచి స్థితిలో ఉండడం వల్ల "నాకేమీ లోపంలేదు" అని అనుకునే అజ్ఞాని, ఏదో ఒక గట్టి దెబ్బతిని మనస్సు క్రుంగి పోయి ఎంతో పరితపించడం, ధైర్యం పూర్తిగా నశించడం అజ్ఞానిలో కానవస్తూ ఉంటుంది. "ఆపదలందు ధైర్యగుణం" అవలంబించి శాంత గుణంతో – జ్ఞాని పట్టించు కోకుండా ఉండడం కానవస్తుంది.

తానెంతో చదువుకున్నా. దానిని సరియైన పద్ధతిలో ఉపయోగించడం తెలియక, అపార్ధం చేసుకుని అజ్ఞాని చిక్కులలో పడిపోతాడు. యుక్తాయుక్త విచక్షణ గల జ్ఞాని, తాను నేర్చుకున్న విద్యను సద్వినియోగం చేసికొని ప్రయోజనాన్ని పొందగలడు.

అజ్ఞాని పొగడ్తకు లొంగిపోతాడు. ఇతరులు తమ తమ ప్రయోజనాలకోసం తన్ను కొనియాడితే ఆ ప్రశంస యధార్ధమనే భ్రాంతి పడి వారు కోరిన పనులన్నీ చేస్తాడు. మత దురహంకారులూ, కలహప్రియులూ ప్రోత్సహిస్తే, వాటిలో చిక్కుకొని, తానెరుగని వారికీ, ఎరిగిన వారికీ కూడా అపాయం కలుగజేస్తాడు. చివరకు తనకు కూడా ఉపద్రవాన్ని తెచ్చుకొంటాడు. విచక్షణ కల జ్ఞాని యిట్టి విద్రోహ చర్యలకు చాలా దూరంగా ఉంటాడు.

జ్ఞానికి, అజ్ఞానికి గల ప్రధాన భేదం పరతత్వ సంబంధమైనది. పర తత్వాన్ని తెలిసి కొన్న వారి జ్ఞానమే జ్ఞానంగాని, శాస్త్ర జ్ఞానం కాదని తత్వ వేత్తల అభిప్రాయం. అట్టి జ్ఞానాన్ని గురించి అపేక్ష లేనివాడు అజ్ఞాని అనిపించు కుంటాడు.

ఈ విధంగా చాలా విషయాల్లో వీరిద్దరికీ భేదం కానవస్తుంది. మానవుడు భగవంతుడు ప్రసాదించిన తన బుద్ధిని ఉత్తమ మార్గంలో వినియోగించుకొని అజ్ఞాని అనే పేరు తెచ్చుకోకుండా జ్ఞాని యై తన జీవితాన్ని సార్ధకం చేసుకోవలసి ఉన్నది.

–బులుసు వేంకటరమణయ్య

## ప్రేమసాగర మథనం

సుందరాంగుల కౌగిలిలో కరగి వున్నప్పుడు ఆ అమ్మాయి పేరే జపిస్తూ వుంటాడన్నది మా క్లబ్‌లో అందరకు తెలిసిన విషయమే!"

"నిజంగానా!"

"అవును! సత్యప్రమాణికంగా! మాయల పకీరు ప్రాణాలు చిలుక హృదయంలో వున్నట్లు వాడి పంచప్రాణాలూ సవతి మేనగోడలు విలాసిని చుట్టూ పరిభ్రమిస్తూ వున్నాయి!"

"పట్టపగలు పబ్లీగ్గా ప్రత్యర్థి ప్రాణాలు తీయాలని చూసే నాగరాజు మనసునిండా వున్న ఆ రంగుల రామచిలుకను పరాభవించడం ఎలా?

ఆ అమ్మాయిని వాడు వెయ్యి కళ్ళతో చూస్తూ కాపాడుకుంటాడే!"

"నాగరాజు అక్కకీ సవతి కూతురుకు పడదు! అందువల్ల ఆ అమ్మాయి కాంతి ఎంపోరియంలో క్లర్క్‌గా పని చేస్తున్నది.

సూర్యారావుపేటలో చిన్న గదిలో అద్దె కుంటున్నది!

ఆ అమ్మాయికి నాగరాజు పొడ సుతరామూ గిట్టదు! అందుకే యిల్లు వదలి వెళ్ళిపోయింది!"

"కో అంటే కావలసినంతమంది పడుచు పిల్లలు దొరుకుతుండగా ఆ లుచ్ఛాగాడి మనసు ఆ అమ్మాయి మీదకు పోవడం ఏమిటి?

ఆ పిల్ల ఎలా వుంటుందేం?"

"దానిమ్మ మొగ్గలా నేవళంగా వుంటుంది! నాగరాజుకు యింతవరకు కౌగిటిలో కరిగిపోతామనేవారేగాని "ఛీ! పో!" అని కసురుకునే వాళ్ళు లేకపోవడంతో అతనికి ఆ అమ్మాయిమీద విపరీతమైన ఆకర్షణ కలిగింది.

ఆ ఆకర్షణ రోజు రోజుకు పెరుగుతుందేగాని తరగడం లేదు."

దానిమ్మ మొగ్గలా నేవళంగా వున్న అందాల సుందరి కౌగిట కరగిపోతున్నట్లు తేనెల సోనలు చిలికే ఆమె పెదాలు తన పెదాలను మృదువుగా స్పృశిస్తున్నట్లు. లేత తమలపాకులలాంటి ఆమె చేతులు తన శరీరాన్ని పరామర్శిస్తున్నట్లు, చిగురాకులలాటి వేళ్ళు తన జుట్టు లోపలికు వెళ్ళి చక్కలిగింతలు పెడుతున్నట్లు - వూహించుకోసాగాడు. క్షణం క్రితం భయంతో గజగజలాడిన సన్నీ యిప్పుడు ఆవేశంగా తన పొందుకై తహతహలాడడం చూచి విస్తుపోయిన రసిక తన్మయత్వంతో అతను విలాసిని పేరు ఉచ్చరించడం విని షాక్ తిన్నది.

(ఇంకా ఉంది)

ఎం. ఆర్. డి. బళ్లారి

★ అందరూ మిమ్మల్ని మగవారంటే ద్వేషం అంటారు కదా? నాకు మాత్రం అలా అనిపించదు ... ఆడవారికి అసూయ జాస్తి అంటారు కాని నిజానికి మగవాళ్లకే ఎక్కువ. ఇది ఆఫీసుల్లో పనిచేసే స్త్రీలని అడిగితే చెప్తారు.

● నాకు పురుష ద్వేషం లేదన్న సంగతి నా స్నేహితులందరికీ, నా అభిమాను లందరికీ తెలిసిన నిజం. ఇక, నిజాన్ని - కోపంగా, అసూయగా, ద్వేషంగా చిత్రీకరించడం - నిజాన్ని నిర్భయంగా ఎదుర్కో లేనివాళ్లు చేసే పని. వాళ్ల మాటలు పట్టించుకోవడం అనవసరం - అసూయ సంగతికి వస్తే మీరన్నది నిజం. అందమైన ఆడదాన్ని చూసినా, పేరు తెచ్చుకున్న ఆడదాన్ని చూసినా మనసులో మంట వాచుకోలేరు. వారి శీలం మంచిది కాదని ప్రచారం చేస్తారు. ఆకాశరామన్న ఉత్తరాలు రాస్తారు. తమ తమ పేరు బయటపడకుండా ఎంతైనా చేస్తారు.

యు. ఎమ్. కె. ఆర్; వాస్కో

★ ఎప్పుడు కావాలంటే అప్పుడు పెళ్లి చేసుకోవడం ఎప్పుడు వద్దనుకుంటే అప్పుడు విడాకులు యిచ్చే స్వేచ్ఛ ఒక్క పురుషునికేనా స్త్రీకి కూడా వుందా?

● ఇద్దరికీ లేదు ; పెళ్లి అంటే ఏమిటని వుద్దేశం. ఆడా మగా కలయికేనా? కాదే. ఒక మగాడు ఒక ఆడది ఎప్పుడేనా ఎక్కడేనా కలిసి బ్రతకొచ్చు. కాని వాళ్లు భార్యా భర్తలు అనం మనం. సంతానం అన్నది లేకపోతే ఈ స్వేచ్ఛ ఎవరు పడితే వారే వాడుకునేవారేమోగాని- సంతతి వుంటే- వదలడం చేరదీయడం అంత సులభం కాదు. ఈ మధ్య నలభై రెండేళ్లు కలసి బ్రతికిన ఆమెనో ముసలాడు వదిలిపెట్టాడు. కోర్టు వారు- వివాహం చేసుకో పోయినా- ఆమె భార్యే అవుతుంది- భరణం యివ్వవలసినదే-నని- తీర్పు యిచ్చింది. అంచేత కాస్త జాగ్రత్తగా వుండడమే మంచిది- మీ మగవాళ్లు!




ఎన్. కె. ఆర్; పర్లాకిమిడి

★ జన్మ జన్మలకు నీ మేలు మరువను. ఇది ఎంత వరకు నిజం?

● సినిమా చూస్తున్నంత వరకు! ఇదో ఊతపదం. అంతే.

★ మనిషి తాను సాధించలేనిది ఏది? సాధించి అనుభవించలేనిది ఏది?

● కోరికల్ని సాధించలేడు. సాధించినవి అనుభ వించలేడు- కారణం ఒకటే- తీరేకొద్దీ పెరుగుతాయి కోరికలు!

★ భువిలో శాశ్వతంగా మిగిలేది ఏది?

● ఎవరు చూడొచ్చారు స్వామి! ఏదీ మిగలక పోవచ్చునని విటంబాంబు చెప్తుంది.

★ ప్రతి విషయాన్ని విమర్శనాత్మక దృష్టితో చూడడం ఎంత వరకు సమంజసం?

● ప్రతీదీ విమర్శిస్తూపోతూంటే సంతోషించ డానికేం మిగలదు!

ఆర్; గుంటూరు

★ రామలక్ష్మిగారూ కోరికలు లేకపోతే?

● మనిషే లేడు! దేవుడూ లేడు!

జి. వి. కె. ఆర్; సికింద్రాబాదు

★ కొందరు కంటి ఎదుట నిలబడే నిజాన్ని కూడ గుర్తించలేరెందుకు?

● మనం- కంటికి కనిపించే దాన్నైనా సరే మనకి కావలసినట్టు చూస్తామేగాని- ఉన్నది ఉన్నట్టు చూడలేం. అంచేత.

ఆనారా; ఖర్గపూరు

★ ఆడది అబల కాదు సబల అని మీరు రచనల ద్వారా నిరూపిస్తున్నారు కదా? అకస్మాత్తుగా మీకు ప్రభుత్వం బహుమతి ప్రకటిస్తే?

● వాళ్లకి పిచ్చా? నాకు పిచ్చా స్వామి? అబల కాదని- ఆడది క్షణ క్షణం ఎక్కడో అక్కడ నిరూపించుకుంటూనే వుంది. కాని ఏం లాభం? నలుగురు మూర్ఖులు బలాత్కరించి చంపితే అది పత్రికల కెక్కుతుంది. సినిమాకి కథ అవుతుంది. పేవ్‌మెంట్ల మీద జీవన పోరాటం సాగించే వారి ముందు నాలాంటి వాళ్లెందుకూ పనికిరారు. నేను సబల అని నిరూపిస్తూ రచనలు చేయడం లేదు- చూడరా? అర్థం కాదా?

★ కె. రా. గారూ చంటి పిల్లలకి సహితం ఓటు వుంటే?

● కుటుంబ నియంత్రణ పథకాన్ని తోసి రాజంటుంది- ప్రభుత్వం.

ఎం. ఎస్. ఆర్. కాజ

★ కథలూ నవలలూ గట్రా రాయడానికి ఎంత విద్యార్హత వుండాలి? ఎంత వయస్సు వుండవలెను?

● విద్యార్హతలకంటే- లోకజ్ఞానం, పరిశీలనా దృక్పథం ముఖ్యం రచన చేయడానికి. ఇక వయసు అంటారా? లత తొమ్మిదో ఏట రాయడం ప్రారంభించిందట. నేను నాకు ఇరవై రెండొచ్చేదాకా రాయాలని తెలియలేదు! అసలు పదేళ్లు దాటేదాకా చదువుకోవడం అవసరంగానే అనిపించలేదు! అంచేత ఎంత వయస్సుంటే రచనకి అర్హతో చెప్పడం కష్టం.

★ కథ రాస్తూ బ్రేక్ వేస్తే కంటిన్యూ చేయలేక పోతున్నా ఎందువల్ల?

● 'అభ్యాసము కూసు విద్య' అన్న సామెత వినలేదా? రాస్తూంటే- అదో వ్యసనంగా మారిపోతే- మీ మనసు నిర్మలమో అనిర్మలమో,.... రాస్తూనే వుంటారు.

★ మనస్ఫూర్తిగా ప్రేమించిన అమ్మాయిని చేసుకోలేకపోవడంకంటే చావడం మిన్న - కామెంట్?

● వేస్టు. ప్రేమ చావు కోరదు, సుఖం కోరుతుంది. పెళ్లి చేసుకుని నేననుకున్న ప్రేమ యిది కాదు అని వాపోయే కన్నా- ప్రేమించి వూరుకోడంలో కూడా కాస్త అర్థం వుంది- ఆలోచించి చూడండి.

మధు, అంబుసోలి

★ ప్రశ్నావళికి ప్రేమావళి అన్న పేరు బాగుంటుం దండి.

● చిత్తం. అర్థమైన సలహాలు పాటిస్తూ పోతే యీ శీర్షిక- అష్టావకుడి డోలులా తయారవుతుంది! అంచేత- నేను సలహాలు వింటాను. నాకు సరైనదని తోచినదే చేస్తాను!

ఎస్. ఎస్. ఎమ్. ఒంగోలు

★ ఈ స్వార్థపూరిత ప్రపంచంలో మగవాడి స్వార్థం బయట పడేదెప్పుడు?

● ప్రతి క్షణం బయట పడుతూనే వుంటే- ఎప్పుడు అంటారేమిటి?! □



# బైద్యనాథ్ ..............

## ఇద్దరికీ ఆరోగ్యము మరియు పెరుగుదల కొరకై

జీవితమంతా

మీరు భాగస్వాములు కనుక

మీరు శ్రద్ధవహిస్తారు కనుక

మీరు ఒకరికి మరియొకరు
ఆనందముగా ఉండుటకు
శ్రద్ధ తీసుకుంటారు.

మీకు శక్తిని, బలమును కలుగజేసి
రోజు రోజుకు సంవత్సరముల తరబడి
విటా-ఎక్స్ మిమ్ములను కాపాడును.

స్త్రీ పురుషులకు బలవర్ధకమైన ఔషధము.




## బైద్యనాథ్
## విటా-ఎక్స్

## మొటిమలా?

మొటిమలు, మచ్చలు, ఉడుకు పొక్కులు మరియు
చర్మరోగములకు ఆదర్శమైన నివారిణి
మంచి రక్త శుద్ధికరము, చర్మమును పరిశుద్ధముగా
ఉంచును,

## బైద్యనాథ్
## సురక్తాస్ట్రాంగ్





రక్తమును శుద్ధి చేయును. చర్మమును నిర్మలముగా ఉంచును.



మామూలు పండ్లపొడికాదు ఔషధముకూడా దంతక్షయము మరియు చిగుళ్ళ
వ్యాధులకు అత్యవసరమైన నివారిణి ఆరోగ్యకరమైన దంతములు బలమైన
చిగుళ్ళు ఆరోగ్యముగా చింతలు లేకుండా ఉంచును.

వైద్యనాథ్ ఎర్ర పండ్లపొడి మాత్రమే ఈ పనిచేయును

## బైద్యనాథ్
## ఆయుర్వేద పండ్లపొడి

83P 97T.

# సర్వ మంగళకరం 'శ్రీ మంగళగిరి క్షేత్రం'

ఏ ముదయినా దారినిపోయే దానయ్యయినా, గాతలో సిగే దానాన్ని దోసిళ్ళతో దోరగా రక్షించుకునే దినాలివి అటువంటిది, భక్తులొసిగే పానకం'లో సగం మాత్రమే స్వీకరించి, ద్వితీయార్థం, తిరిగిచ్చేసే ఏకైక పావనమూర్తి 'శ్రీ పానకాల లక్ష్మి నృసింహ స్వామి' అంటే నిర్వివాదాంశ విషయం యుగ యుగాలుగా భక్తులనావిధంగానే ఆదరిస్తున్న పురాణ ప్రసిద్ధుడు, 'మంగళగిరి క్షేత్ర స్వామి' శ్రీ నృసింహస్వామి

విష్ణు పురాణ ప్రవచనం ప్రకారం, మన భారత దేశ మండలి సప్త పర్వత శ్రేష్ఠులలో, 'పారియాత్ర' పర్వత మొకటి నాటి పారియాత్ర పర్వతమే, నేటి మంగళగిరి' యని పెద్దల ఉవాచ మంగళగిరికి తోతాద్రి' హస్తగిరి, స్తోత్రాద్రి, ముక్త్యద్రి' అనునవి నామాంతరములు.

భూలోక మండలి స్వయం వ్యక్త అష్ట వైష్ణవ క్షేత్రాలలో నొకటి. ఈ తోతాద్రి ఈ అష్ట వైష్ణవ క్షేత్రాలూ, సర్వదా దేవతలచే పూజింపబడుతుంట వని, ఆర్యోక్తి కనుకనే మంగళగిరిలో 'పానకాల నృసింహుని' ఉదయం ఎనిమిది గంటల నుండి, మధ్యాహ్నం పంద్రెండు వరకు మాత్రమే భక్తులు దర్శించగలరు తక్కిన కాలమంతయూ దేవతలకే నిర్దేశింపబడింది. భక్తుల కానమయంలో దర్శన భాగ్యం దొరకదు.



శ్రీ పానకాల నృసింహస్వామి, (ఎగువ సన్నిధి)

విజయవాడ- గుంటూరుల మధ్య నెలకొని



శ్రీలక్ష్మి నరసింహస్వామి (దిగువ సన్నిధి)

యున్న 'మంగళగిరి క్షేత్రం' భారతావనిలోనే ప్రసిద్ధి గాంచినది ఉత్తర భారతీయులు' పన్నా నరసింగ' యని, దక్షిణీయులు పానకాల నరసింహుడని ఆరాధించే ఈ స్వామి సన్నిధి నున్న ప్రతీ తీర్థం, వెం చేసిన పర్వతం కూడా పౌరాణికంగా ప్రసిద్ధి నొందినవే

## క్షేత్ర పురాణం!

జగన్నాధుడు 'జగన్నాథంలో భోజనము, సింహాచలంలో చందనము, మంగళగిరిలో గంధోదక పానము, తిరుపతిలో ప్రభుత్వము, శ్రీరంగంలో శయనం' యేర్పాటు గావించుకుని జగన్నాటక చక్రం త్రిప్పుతున్నాడని భక్తుల నమ్మకం

హిరణ్య కశిపుని సంహరించిన 'ఉగ్ర నృసింహుని' శాంతింప చేయుటకు, సర్వ మంగళ 'శ్రీ లక్ష్మి' మున్ముందుగా ఈ పర్వతంపై తపస్సొనరించి, కార్యసిద్ధి పొందిన దిగాన, ఈ గిరికి 'మంగళగిరి' నామం చరితార్థ మయింది. లక్ష్మీదేవి తపస్సిద్ధి పొందిన గుహలోనే "మార్కండ లక్ష్మమ్మ" గానెలిచి, భక్తుల నాదుకుంటోంది



శ్రీ పానకాల నృసింహస్వామి, తదితర ఆలయాలు – మంగళాద్రి

పూర్వం,'నముచి' యనే దానవ శ్రేష్ఠుడు, చతుర్ముఖుని మెప్పించి పొడి, తడి పదార్థములచే గాని, యక్షదానవ, వానర, మానవులచే గాని, క్రిమికీటక జంతువులచే గాని, సర్పములచే గాని, శస్త్రాస్త్ర మరేతర ఆయుధములచే గాని మరణం సంభవించకుండునట్లు" వరం పొంది, లోక కంటకుడు కాగా, శ్రీహరి 'నృసింహావతారం'తో భయంకర మూర్తియై 'మంగళాద్రి' పై ఆవిర్భవించి, తన 'నిశ్వాసాగ్ని'చే ఆ దానవుని బూడిద యొనరించెను. భయంకర నిశ్వాసాగ్నికి తాళలేని బ్రహ్మాది దేవతలు, మునీశ్వరులు 'నరహరి' ని శాంతింపుమని వేడుకొనగ, "కృతయుగంలో అమృతము తోనూ, త్రేతాయుగమున ఆవు నెయ్యితోనూ, ద్వాపరయుగంలో గోక్షీరం తోనూ, కలియుగంలో పటిక బెల్లపు పానకము తోనూ, తన తాపాగ్ని చల్లార్చుకుందునని, అట్లొనరించి పునీతులు కమ్మని" ఆదేశించి, మంగళాద్రిపై 'స్వయం వ్యక్తు' డాయినట అయోనిజాని ఆదేశం అనాటి నుంచి నేటి వరకూ, శిరోధార్యమై ఆచరింప బడుతోంది

దిగువ సన్నిధిలో 'లక్ష్మీనృసింహస్వామి' వారిని ద్వాపర యుగంలో 'ధర్మరాజు' ప్రతిష్ఠించెనని పెద్దలమాట

శ్రీరాముని ఆదేశాను సారం, 'ఆంజనేయుడు' లోక కళ్యాణార్థమై, క్షేత్ర పాలకునిగా నిలిచి యున్నాడు

ఈ నరసింహక్షేత్రంలో, స్నానమాచరించిననూ, నీరు గ్రోలిననూ, బ్రహ్మహత్యాది పాపములు తొలిగి పోవునని'భవానీ శంకరగీత' ప్రవచనం ఇచ్చుటి 'పుణ్యతీర్థములు' కూడా ఇతిహాస పూర్వక గాథలలో నిమిడినవే

క్షీర సాగర జనిత 'శ్రీలక్ష్మి' శ్రీహరిని చేపట్టు శుభ ఘడియలలో, మంగళ స్నాన మొనరించుటకు, ముల్లోక ములలోని సర్వపుణ్య తీర్థాల జల సమ్మేళనంతో 'పుష్కరిణి'ని మంగళగిరిలో దేవతలు నిర్మించేరుట అదియే 'లక్ష్మి కళ్యాణ సరస్సు'గా ప్రసిద్ధిగాంచినది

హిరణ్యాక్షుని వధానంతరం, 'వరహావతారి' తన వొంటి నంటిన నీటిని విదిల్చించుకోగా నేర్పడిన జలాశయమే 'వరహతీర్థం' (కిటతీర్థం)గా ప్రకాశించింది.



క్షేత్ర పాలకుడు – ఆంజనేయుడు (ఎగువ సన్నిధి)

పరశురాముని చేతిలో వరమ పదమొందిన 'సుదర్శన చక్ర రూపాంతరి' కార్త వీర్యార్జునుడు తన పేరు చిరస్మరణీయంగా చక్రధారి' చల్లని చూపుతో చక్రతీర్థ'మై చరితార్థుడాయెనట

విష్ణువర్ధనుడను రాజు, అతని సతి, శాపవశమున 'ఒక, వటవృక్షము లై 'నాదీ జంఘుడను ముని ఆశ్రమము చెంత యుండెడివారు కాలగతిని, నాదీజంఘుని కరుణాకటాక్షాలకు లోనై 'వటవృక్షం తన పేరు వర్ధిలునట్లు 'వటతీర్థం గా రూపాంతర మొందినట్లు చెప్పబడుతోంది

## క్షేత్ర విశేషాలు!

మంగళగిరి క్షేత్రం 'ఎగువ సన్నిధి, దిగువ సన్నిధ యని విభజింప బడింది

ఎగువ సన్నిధికి సుమారు 500 మెట్లు ఎక్కి పానకాల నృసింహుని దర్శించుకోవాలి 'స్వామి' గుడిపై భాగాన 'మార్కొండ లక్ష్మమ్మ' గుడి, ప్రక్కన క్షేత్ర పాలకుని నిలువెత్తు శిలావిగ్రహం భక్తులకు కనువిందు చేస్తాయి ఎగువ మెట్ల దారిలో, శ్రీ వేంకటేశ్వరస్వామి వారి గుడి, సంతాన దాయిని – పాల చెట్టు, శ్రీ చైతన్య ప్రభువు పాద వేదిక' మున్నగు నవి దర్శించుకోవచ్చు కొండపై నుండి, మంగళగిరి పట్నణం, దేవాలయాల సముదాయం ప్రకృతి సొగసులతో శోభించి, పర్యాటకుల మనస్సును ఆనందడోలికల్లో డోలలాడిస్తాయి

దిగువ సన్నిధిలో 'శ్రీ లక్ష్మీ నృసింహస్వామి, రాజ్యలక్ష్మీ అమ్మవారల ఆలయాలు, దక్షిణావృత శంఖము, రామమందిరం, గరుడాళ్వారుల దేవాలయం, వివిధ తీర్థములు నెలకొని యున్నవి

## క్షేత్రంలో ఉత్సవరోజులు :

ఉగాది ప్రాతఃకాలమున మూల స్వామికి 'తిరువంజనము' వైశాఖ మాసంలో 'జయంత్యుత్సవం', 'శేష వాహనోత్సవం', ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి దశమి వరకూ 'నవరాత్రి ఉత్సవములు', మాఘశుద్ధ ఏకాదశినాడు 'తెప్పోత్సవం' జరుపబడును

ఇవిగాక ఏకాదశి రోజులు, శ్రావణమాసం, కార్తీక మాసం, ధనుర్మాసం రోజులలో కూడా స్వామివారికి విశేషార్చనలు జరుపబడును

ఉత్సవ రోజులలో భారతదేశ మందలి పయితావులనుండి లక్షల కొలది భక్తులు, సాధారణ రోజులలో వందల కొలది, క్షేత్రాన్ని దర్శించి పునీతులవుతున్నారు

## క్షేత్ర చరిత్ర :

యుగాల నాటిదని చెప్పబడుతున్న ఈ దేవాలయాలను నిర్మించిన వారెవరో తెలియకున్నా, క్షేత్రాభి వృద్ధికి చేయూత నిచ్చిన చరితార్థులెందరో

క్రీ శకం 8వ శతాబ్దంలో 'శ్రీ శంకరాచార్యులు వారు' –13వ శతాబ్దంలో 'శ్రీ చైతన్య ప్రభువు', 14వ శతాబ్దంలో 'శ్రీ కృష్ణ దేవరాయలు 16వ శతాబ్దంలో ఒరిస్సా ప్రభువులు 'సిద్ధరాజా' రాజయ్య దేవర వారు ఈ క్షేత్రానికి విచ్చేసి స్వామిని సేవించి తరించేరు రాజులు విశేషకానుకల నొసగేరు

క్రీ శకం 1594లో గోల్కొండ సుల్తాను సేనాపతి



శ్రీ రాజ్యలక్ష్మీ అమ్మవారు (దిగువ సన్నిధి)

'కుబు అలీ' మంగళగిరి విచ్చేసి, నాటి రాజకీయ భయాందోళన పరిస్థితులలో ప్రజలకు అభయ మిచ్చి, వలసలను నివారించేరు

క్రీ. శకం 1807లో 'శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు' చే బంగారు శిఖరాలతో అత్యంత ఎత్తైన 'గాలిగోపురం' దిగువ సన్నిధిలో నిర్మింప బడింది 11 అంతస్తుల ఈ గాలిగోపురం ఎత్తు 153 అడుగులు, వెడల్పు 49 అడుగులు ప్రస్తుతం నెలకొనియున్న ఆలయాలు కూడా వారిచే పునర్ నిర్మింప బడినవని భావింప బడుతోంది

ఉత్తర గాలిగోపురం శ్రీ మాదహనుమంతరావు, ఎగువ సన్నిధికి మెట్లు శ్రీ చెన్నాప్రగడ బలరామ దాసుగారు నిర్మించేరు

శ్రీమతి కైవారం బాలాంబగారు నిరతాన్నదానం చేసి, చరితార్థులయ్యేరు వారు కైవల్య, మొందిన పిదప, వారిధర్మ సత్రంలో 'బ్రహ్మోత్సవ రోజులలో 'అన్నదానం' జరుపబడుతోంది

శ్రీయుతులు రామానుజాచార్యులు మధ్వాచార్యులు, వల్లభాచార్యులు కూడా క్షేత్ర స్వామిని సేవించి, తరించేరు

## క్షేత్ర ఆదాయ వ్యయాలు :

సుమారు 400 ఎకరాలు తడి, పొడి భూములు కల్గిన ఈ క్షేత్ర స్వామి రాబడి సంవత్సరానికి దగ్గర దగ్గర నాల్గు లక్షలు స్వామి వారి కొచ్చే భూరి విరాళాలు, కానుకలు ఎండోమెంట్సు వారి పర్యవేక్షణలో, పవిత్ర క్షేత్రాన్ని పలు విధములుగా అభివృద్ధి నొనరించుటకు సహకరిస్తున్నాయి

భక్త సంఘముచే దక్షిణ గాలిగోపురం నిర్మింప బడింది

ప్రముఖులు, నిర్మాత శ్రీ ఎమ్ ఎస్ రెడ్డిచే వేంకటాద్రినాయుడు గాలిగోపురం పై పార పునరుద్ధరణ నటులు శ్రీకృష్ణచే గరుడాళ్వార్ దేవాలయం విమాన గోపురం పై పార పునరుద్ధరణ జరుపబడ్డాయి

ఆలయాన్ని సుందర నిలయంగా తీర్చి దిద్దడానికి దాతల విరాళాలు, సేవలు కోరబడుతున్నాయి

ప్రాచీన ఆలయాల పునరుద్ధరణకు ఆం ప్ర ప్రభుత్వం వారు నిర్ణయించిన ఆలయాలలో మంగళగిరి వొకటి కావడం, సర్వమంగళకరం

వ్యాసం, ఫొటోలు :
నిడమర్తి ఆదిలక్ష్మీ ప్రసాద్

విషయ సేకరణకు సహకరించిన శ్రీ నారుమంచి వీరభద్రరావు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కు కృతజ్ఞతలు
–వ్యాసకర్త

రాజావేంకటాద్రి నాయుడు గాలిగోపురం



# కొడుకా! నువ్వో చెడిపో!

వద్దమన్నాటి కుటుంబరావు

ఆరోజు హనుమాయమ్మగారి ఆనందానికి అవధుల్లేవు. ఎందుకంటే. .ఆవిడ ఒక్కగా నొక్క కొడుకు .... ఆరేళ్ళ తరువాత అమెరికా నుంచి వస్తున్నాడు.

అబ్బాయి ఎం బి. బి. ఎస్ పూర్తి చెయ్యగానే... పెళ్ళి కుదరటం.... పెళ్ళి కాగానే పిల్ల మేనమామ – నవ దంపతుల నిద్దరినీ అమెరికా తీసుకెళ్ళి పోవటం ... అంతా కలలో జరిగినట్టుగా ఉందామెకి. ఆ తరువాత ఇదేరావటం! అందుకని .. ఆమె పడే హడావుడి అంతా ఇంతా కాదు.

ఇంటికి సున్నం కొట్టించింది. ఇళ్ళు వాకిళ్ళు పేడతో అలికించి చక్కగా ముగ్గులు పెట్టించింది. అరిసెలు జంతికలు చేయించింది. కొత్తగా టమోటో.... వంకాయ.... ములక్కాయ ఊరగాయలు పెట్టించింది. అవకాయ మాగాయలు ఎటు తిరిగీ ఉండనే ఉన్నయ్!

కొడుకు కోడలుకు ప్రత్యేకంగా ఒక గది కేటాయించింది. ఆరేళ్ళయినా ఇంకా కోడలు కడుపు పండలేదు వాళ్ళకో నలుసు పుట్టి ఉంటే.. తనకింకా ఎంత ఆనందంగా ఉండేదో? బాబునో... పాపనో... ఇక్కడే పెంచుతుండేది తను.... అనుకుంది హనుమాయమ్మ.

ఆమె ఇంత హళ్ళూ పెళ్ళూ చేస్తున్నా.... ఆమె భర్త శ్రీమాన్ సీతయ్య గారి కిదేమీ పట్టినట్టు లేదు.

ఆయన పానాసక్తుడు! ఇంటి విషయాల్లో పూర్తిగా అనాసక్తుడు!

ఆయనకి మందు గ్లాసు ముందుంటే.... మహదానందంగా ఉంటాడు. ఆనందో బ్రహ్మ! అంటుంటాడు.

పదెకరాల పొలం పనులు మొత్తం .... పాలేళ్ళ సాయంతో హనుమాయమ్మ గారు చూసుకో వాల్సిందే! మందొకటే ఉంటే..... హనుమాయమ్మ గారి కింత చింత ఉండేది కాదేమో? దానికి తోడు అడపా దడపా పరాయి పడతుల జోడు కూడా కావాలి సీతయ్యకి. డబ్బు వెదజల్లి .... పాలేళ్ళ పెళ్ళాలలో ఆ బలహీనత కలవాళ్ళని వలవేసి పట్టి.... పక్కో కూర్చో పెట్టు కుంటాడు. కూలీకి వచ్చిన వాళ్ళలో.... జాలీగా ఉండేదాన్ని ఎన్నుకుని.... డబ్బుతో కొనుక్కుంటాడు. లేదా.... ఆర్థిక అవసరాల నిమిత్తం.... పరపురుషులకి లోబడే భామల్ని వాడుకుంటూ ఉంటాడు.

హనుమాయమ్మ .... భర్తకి ఎన్నో విధాల నచ్చ జెప్పింది. హిత బోధ చేసింది. బతిమాలింది బామాలింది. కసిదీరా తిట్టింది జుట్టు పట్టి పీకింది. ఏడ్చింది.... మొత్తుకుంది! వాటన్నిటికీ సీతయ్య ఒకటే సమాధానం చెప్పాడు. "ఒసే హనుమా! నీ వయస్సు నలభై ఆరు... నా వయస్సు యాభై అయిదు నేనింకా బతికితే పదేళ్ళు బతుకుతానేమో. నీకా.. . ? ఆ ధ్యాసే లేకుండా పోయింది. నాకా? ఆ యావ ఎక్కువగా ఉంది! ఏం చెయ్యమంటావు చెప్పు? పదెకరాల పొలం మీద వచ్చే అయివేజు లింగు లిటుకూ మంటూ ఉన్న మనిద్దరం ఏం చేసుకుంటాం చెప్పు? అందుకని... మందుని... మగువని పరిపూర్ణంగా అనుభవించి చచ్చి పోదామని నిర్ణయించుకున్నాను. నువ్వు అరిచి గీపెట్టినా... నా పద్ధతి మారదు. నువ్వు నాకు అడ్డం పడకుండా ఉంటే.... రోజూ మందుకు ఓ పాతిక రూపాయలు.... రెండు రోజుల కోసారి పరాయి ఆడదాని సుఖానికి యాభై రూపాయలు చాలు. లేదా? నీ బంగారు నగలు.... దాచుకున్న డబ్బు వగైరాలు... ఒక్కొక్కటి వరస వరసగా సరదాగా మాయమయి పోతాయ్! నీకు ఏది బాగుంటుందో నువ్వే నిర్ణయించుకో!"

హతాసురాలయి పోయింది హనుమాయమ్మ. ఆఖరి అస్త్రంగా.... "అబ్బాయిని రానీండి. మీకు బాగా గడ్డి పెట్టించి .... బుద్ధి చెప్పిస్తాను" అంది..... గొంతు పూడుకు పోగా.

"హె! హెహె!" అంటూ వెటకారంగా నవ్వాడు. సీతయ్య "ఏమిటా కొంకరింపు?" అంది హనుమాయమ్మ..... కోపంగా.

"వాడుండేదే .... అమెరికాలో! అక్కడ పరిస్థితి ఏమిటో తెలుసా నీకు?" అన్నాడు సీతయ్య.

"తమరే శెలవివ్వండి" అన్నట్టుగా ఎత్తి పొడుపుగా చూసింది.

"అక్కడ ... ఏ మగాడికీ ఒక్క పెళ్ళాం మాత్రమే ఉండదు. దేనితో కావాలంటే ... దానితో పోవచ్చు. ఇక్కడలా... భయపడుతూ... భయపడుతూ... చాటుమాటుగా చావక్కరలేదు. పబ్లిగ్గా... తనకు నచ్చిన ఆడదాన్ని ముద్దు పెట్టుకోవచ్చు... తనకు కావలసిన చోటుకి తీసుకు వెళ్ళి బులపాటం తీర్చుకోవచ్చు! చెవులు కొరుక్కోటాలు, అల్లరి పెట్టటాలు పోలీసు కేసులు పెట్టించటాలు ఉండవ్. ఇక మందంటావా? దాని సంగతి చెప్పనే అక్కరలేదు. భేషుగ్గా ... అంతా సీమ సరుకేగా! దొరకేవి? నీకు తెలుసో తెలియదో... మంచినీళ్ళు తాగినట్టుగా మందు తాగుతారట అమెరికాలో."

ఇంతకీ ఇదంతా ఎందుకు చెపుతున్నావు?" అంది ఈసడింపుగా.

"అలాంటి అమెరికాలో ఉన్న నీ సుపుత్రుడు .. ఇంకా పవిత్రంగా ఉన్నాడనుకున్నావా పిచ్చి మొహమా? ఇక నీ చచ్చు పుచ్చు సలహాలు మానేసి .. . నా విషయంలో చూసి చూడనట్టుగా పోతూ ఉండు" అన్నాడు అదోలా నవ్వుతూ.

భర్త అలా అనేసరికి లేనిపోని దిగులు పట్టుకుంది హనుమాయమ్మకి. మొగుడెటు తిరిగీ చెడిపోయాడు. కొడుకు కూడా అమెరికా వెళ్ళి పాడయిపోయి ఉంటాడా? ఆమె మనసు మొద్దుబారిపోయింది. కొన్నాళ్ళు. ఆలోచించి... ఆలోచించి ... మానసికమైన వ్యధ అనుభవించి ... చివరకు గుండె దిటవు చేసుకొని 'వచ్చినప్పుడు ... ఎలాగోలా అడిగి తెలుసుకోవచ్చులే!' అనుకుంది. మళ్ళీ తన ఆలోచనకు తనలో తనే నవ్వుకుంది. తన పిచ్చిగానీ. "అబ్బాయ్! నువ్వు తాగుతావటగా? చెడిపోయావటగా?" అని తను ముఖాన అడగగలదా? ఒకవేళ అడిగినా... వాడు తన తప్పుల్ని ఒప్పుకుంటాడా? అంతే! ఆపైన తన ఆలోచనలకి స్వస్తి చెప్పింది హనుమాయమ్మ.

అబ్బాయొచ్చే రోజూ రానే వచ్చింది. వాకిట్లో కారు ఆగగానే... పుత్రోత్సాహంతో బయటికి పరుగెత్తు కొచ్చింది. హనుమాయమ్మ భార్య బలవంతం మీద... మందు గ్లాసు దాచేసి... తనూ వీధి వాకిట్లోకి వచ్చాడు సీతయ్య.

పనిమనిషి పళ్ళెం అందించగా కొడుక్కి దిష్టి తీసి హారతి పట్టి .. కొబ్బరి కాయ నేల మీద కొట్టి పారేసి – "రా నాన్నా! లోపలికి! అన్నట్టు ... కోడలేది?" అంది హనుమాయమ్మ.

"రావటానికి కుదరలేదమ్మా? అందుకని నేనొక్కడినే వచ్చాను. నువ్వూ నాన్నా బాగున్నారా?" అన్నాడు శేఖర్. తలూపింది హనుమాయమ్మ. ఆరేళ్ళ తరవాత కొడుకుని చూసిన ఆనందంలో మాట రావటం లేదామెకి. కాస్త వళ్ళు చేశాడు. చక్కగా కంటికి నిండుగా ఉన్నాడు... అనుకొని సంతృప్తిపడిందా తల్లి మనసు!

"మాకేమిటోయ్...? నిక్షేపరాయుడి కుప్పల్లా ఉన్నాం... ఇద్దరమూను! నువ్వు ... కోడలు.. ఆమె మేనమామ – అంతా బాగున్నారా?" కుశల ప్రశ్నలు వేశాడు సీతయ్య.

"ఓ. కే" అంటూ ... టాక్సీకి డబ్బులిచ్చి పంపేశాడు శేఖర్. నౌకర్లు లగేజి లోపలికి తీసుకొచ్చారు.

లోపలికి వెళ్ళి ... క్షణాల్లో... గ్లాసు నిండా చిక్కటి కాఫీ కలుపు కొచ్చింది హనుమాయమ్మ.

కాళ్ళు కడుక్కొచ్చిన శేఖర్... ఆయిష్టంగా చూసి "మరిచిపోయావా అమ్మా...? నాకు కాఫీ అలవాటు లేదని. అక్కడ కూడా కాలేదమ్మా" అన్నాడు నవ్వుతూ.

"నా మతిమండ! అవును కదూ! ఉండు ... పాలు పట్టుకొస్తాను" అంటూ లోపలికి వెడుతూ... భర్తకేసి కనుకొలకుల్లోంచి సగర్వంగా చూసింది హనుమాయమ్మ.

'ఇల్లలకగానే పండగయి పోయిందని మురిసిపోకు. వీడు కాఫీ మానేసి 'విస్కీ' సేవిస్తూ ఉండి ఉంటాడనుకున్న సీతయ్య నిర్లక్ష్యంగా తలెగరేసి భార్యని చూసి – ఆమె వెళ్ళిపోయాక అన్నాడు... కుర్చీలో కూర్చున్న కొడుకుతో "అవునోయ్! అమెరికాలో కాఫీ తాగకపోతే నలుగురూ నవ్వరా?"

అందులోని నర్మగర్భితమైన భావం అర్థం కాలేదు శేఖర్‌కి. "ఎందుకు నవ్వుతారు నాన్నా? అసలక్కడ ఇలాంటివి పట్టించుకోటానికి టైమే ఉండదు. అంతా స్పీడు జీవితం" అన్నాడు మామూలుగా. దెబ్బ తిన్నట్టయిపోయింది సీతయ్య పరిస్థితి.



పాలు గ్లాసులో తీసుకొచ్చింది హనుమాయమ్మ. శేఖర్ తాగుతుంటే... ఆప్యాయంగా అతనికేసి చూస్తూ ఉండిపోయింది. తన కడుపు పంట ... తన నోముల ఫలం..! ఎంతగా ఎదిగిపోయాడు! ఎంత పెద్దవాడయి పోయాడు? ఆమె మాతృ హృదయం ఆర్ద్రమైంది.

గ్లాసు కింద పెట్టేశాడు శేఖర్. ఓ పది నిముషాలు... గుట్టలు గుట్టలు కబుర్లు దొర్లాయి ముగ్గురి మధ్య.

అమెరికాలో ఉన్న తెలుగువారి జీవన సరళి... ఇక్కడికీ... అమెరికాకీ ఉన్న తేడా అంతా వివరించి చెప్పాడు... శేఖర్.

"మన ఊరు బాగుందంటావా? అమెరికా బాగుందంటావా?" తెలివిగా ప్రశ్నించాననుకున్నాడు సీతయ్య... మీసం మెలి పెడుతున్నట్టు భార్య కేసి చూస్తూ.

కొడుకేం జవాబు చెపుతాడోనని ఆదుర్దా పడిపోతోంది హనుమాయమ్మ.

"నాన్నా పనస తొనలు ఎలా ఉంటయ్?" ఎదురు ప్రశ్న వేశాడు శేఖర్.

"మధురంగా ఉంటయ్ "

"మరి తేనె?"

"అదీ మధురంగా ఉంటుంది."

"పనస తొనలు మధురంగా ఉంటయ్యా... తేనె మధురంగా ఉంటుందా...? అంటే ఏం జవాబు చెపుతావు నాన్నా?"

బుర్ర గోక్కున్నాడు సీతయ్య.

ఫక్కుమంది హనుమాయమ్మ – విజయగర్వంతో.

"జన్మభూమి... మరపురానిది ... అమెరికా మరువలేనిది. రెంటినీ పోల్చి చూడటం అనవసరం నాన్నా!" అన్నాడు శేఖర్.



తలూపక తప్ప లేదు సీతయ్యకి.

"నువ్వు బట్టలు మార్చుకుని స్నానం చేసి... కాసేపు విశ్రాంతి తీసుకో... అరగంటలో నీకు కమ్మని భోజనం ఎడతాను" అంది హనుమాయమ్మ.

"అలాగేమ్మా" అంటూ లేచాడు శేఖర్.

కమ్మని నెయ్యి... గడ్డ పెరుగు... తాజా కూరలు... నవులూరించే సాంబారు... రసాలతో.. తృప్తిగా శేఖర్ భోం చేస్తుంటే ... తన కడుపే ఎండిపోయినట్టుగా సంబరపడిపోయింది హనుమాయమ్మ.

తండ్రి వెంట వెళ్ళి పొలాలు చూసి వచ్చాడు శేఖర్.

తన బండారం ఎక్కడ బయట పడి పోతుందో అని పళ్ళు బలవంతాన ఊరుకున్నాడు గానీ .. మూడు రోజులయ్యేసరికి ఉండలేకపోయాడు సీతయ్య. మందు లేక నాలుక పిడచ గట్టుకుపోతోంది. మగువ పొందు కోసం శరీరం తహతహలాడిపోతోంది.

అయితే దానికో చక్కని పథకం మాత్రం వేశాడు.

"ఒరేయ్ శేకూ! ఇవ్వాళ సాయంత్రం నాలుగింటికి బయలుదేరి మన పొలం వెడదాం ఈ రాత్రికి అక్కడే బస. పొద్దున్న తిరిగి వద్దాం" అన్నాడు హనుమాయమ్మ లోపలెక్కడో పనిలో ఉన్న సమయం చూసి.

"ఎందుకు నాన్నా?" అన్నాడు శేఖర్.

"విశేషముంది. తరవాత చెపుతాగా?" అన్నాడు లోగొంతుకతో.

తనకీ పిక్నిక్ లాంపులా ఉంటుందనుకున్న శేఖర్ "సరే!" నన్నాడు యధాలాపంగా.

పెరట్లోకి వచ్చిన తరవాత భార్యతో గుసగుసగా అన్నాడు సీతయ్య "ఏమే మహా ఇల్లాలా? కొంపదీసి నా ఘనకార్యాల సంగతి.... మన శేఖర్ గాడి చెవిన గాని వేసేశావా? నేను స్నానానికి... వాటికి వెళ్ళినప్పుడు..." అన్నాడు.

"ఊరుకోండి! మీరు మరీను... ఏ భార్యయినా తన కొడుకు ముందు... తన భర్తని కించపరుచుకుంటుందా? అది తనకి మాత్రం ఏం గౌరవం? పైగా మీరీ మూడు రోజుల్నించీ బుద్ధిమంతుడిలా మసలుతున్నారు గదా!" అంది

# కొడుకా! నువ్వూ చెడిపో!

భర్తతో... మెచ్చుకోలుగా.

"అదీ! భార్యంటే అలా ఉండాలి! ఆఁ! ఇంతకీ మన వాడి గురించి నీ అభిప్రాయమేమిటంటావ్? ఇదివరకటి లాగానే ఉన్నాడా.... ఏమన్నా మారాడంటావా?" అన్నాడు కుతూహలంగా.

"నాకేం మారినట్టు కనుపించటం లేదు... ఇదివరకటి కన్నా నిదానం ఎక్కువయినట్టు కనుపిస్తోంది. అబ్బాయిని చూడటానికి వచ్చిన ఇరుగు పొరుగు మగవాళ్ళు ... ఆడవాళ్ళు ... వాడ్ని ఎంతగానో మెచ్చుకున్నారు. తరవాత నీకేమమ్మా! బంగారం లాంటి డాక్టర్ బాబుని కొడుకుగా కన్నావు అని" అంది హనుమాయమ్మ – సంతోషంగా.

తేలిగ్గా కొట్టేశాడు సీతయ్య. "మెరిసేదంతా బంగారం అనుకుంటే ఎలాగే భార్యారత్నమా?"

"అంటే మీ ఉద్దేశమేమిటి?" చివ్వున కోపం వచ్చింది హనుమాయమ్మకు.

"చెపుతాగా? కొంచెం ఆగు" అన్నాడు సీతయ్య. అదోలా నవ్వుతూ.

"ఏమిటో? మీ మాటలు నాకేమీ అర్థం కావటం లేదు. కొడుకు చెడిపోకుండా ఉండాలని ప్రతి తండ్రీ కోరుకుంటాడు. మీరేమిటి... ఇలా మాట్లాడుతున్నారు? శుభం పలకరా పంతులూ! అంటే... పెళ్ళి కూతురు ముండేదన్నట్టుగా..." ఈసడింపుగా అంది హనుమాయమ్మ.

ఏమనుకున్నాడో ఏమో ... సీతయ్య ఆ విషయాన్ని పొడిగించకుండా.. "నేనూ అబ్బాయి... సాయంత్రం మన పొలాల కేసి వెడతాం" అన్నాడు.

"వెళ్ళి రండి! దాంట్లో విశేషమేముంది?" అంది హనుమాయమ్మ... మామూలుగా.

సీతయ్య పథకం ఆమెకి తెలియదుగా మరి!

కాఫీ టిఫిన్లు అయిన తరవాత కొడుకుని తీసుకుని బయలుదేరాడు సీతయ్య.

హనుమాయమ్మ చాలా సంతోషపడ్డది. అబ్బాయి రాకతో తన భర్తలో కూడా కొంత మార్పు వచ్చినందుకు ఆమెకెంతో ఆనందంగా ఉంది. "అబ్బాయి తిరిగి వెళ్ళిన తరవాత కూడా... ఈయని లాగే ఉండేట్టు చెయ్యి భగవంతుడా!" అని వెయ్యి దేవుళ్ళకు మొక్కుకుంది.

చేలగట్టు మీద నడుస్తున్నారు తండ్రీ కొడుకులు. పచ్చని పొలాలు... పచ్చని చెట్లు... ప్రకృతి కన్య... పచ్చని చీర జాకెట్టు ధరించి విలాసంగా తన విహారం చేస్తున్నట్టుంది. వినీలాకాశంలో తెల్లటి మబ్బులు వింత సోయగాన్నీతున్నాయి. మెల్ల మెల్లగా ... చేల మీద నుంచి వీచే చల్లగాలి వంటికి హాయిగా తగులోంది. సూర్యుడు పశ్చిమాద్రికి చేరుకోటానికి త్వరపడుతున్నాడు.

"అబ్బాయ్! ఎలా ఉన్నయ్ మన పొలాలు?" అన్నాడు సీతయ్య.

"చాలా బాగున్నయ్ నాన్నా! అణువణువునా నువ్వు . తీసుకొంటున్న శ్రద్ధ ప్రత్యేకంగా కనుపిస్తోంది. ఎకరానికి పాతిక బస్తాల పైనే అవ్వచ్చునుకుంటాను."

బాణం దెబ్బ తిన్నట్టు విలవిలలాడిపోయాడు సీతయ్య. ఏనాడన్నా పొలం పనులమీద తను శ్రద్ధ చూపిస్తేగా? వెంటనే తేరుకుని..." అవును! అవును..."అన్నాడు తడబడుతూ.

ఇంకో ఫర్లాంగు నడిచేంత వరకూ తండ్రీ కొడుకుల మధ్య మౌనం రాజ్యమేలింది.

"ఇదేమిటి నాన్నా?" అన్నాడు శేఖర్... అక్కడ ప్రత్యేకంగా ఉన్న చుట్టిల్లును చూసి.

"ఒక్కోసారి... పొలం పనులు ముమ్మరంగా ఉన్నప్పుడు... పాలేళ్ళతో పాటు రాత్రి పూట కూడా ఇక్కడే ఉండాల్సి వస్తుంది. అలాంటప్పుడు ఉండటానికి పనికి వచ్చే విశ్రాంతి గృహం లాంటిది."

"ఓహో !" అన్నట్టుగా తలూపాడు శేఖర్. పక్కనున్న పాలేరు పాకని కూడా చూస్తూ...

"రండయ్యగోరూ! రండి అబ్బాయి గోరూ!" అంటూ స్వాగతం పలికాడు ఒక పాలేరు... పాక తలుపులు తీస్తూ...

"బాగున్నావా పోలయ్యా!" అంటూ పలకరించాడు శేఖర్.

"బాగుండాసండీ" అన్నాడు పోలయ్య. ఆ పాకలో... రెండు కుర్చీలు... ఒక మంచం... ఒక కూజా... బల్ల ... లాంటి కనీస సౌకర్యాలన్నీ అమర్చబడి ఉన్నయ్.

తండ్రీకొడుకు లిరువురూ చెరో కుర్చీలో కూర్చున్నారు.

క్షణాల్లో ... గట్టు మీదున్న కొబ్బరి చెట్టెక్కి బొండాలు తీసి... గ్లాసుల్లో కొబ్బరినీళ్ళు పట్టుకొచ్చాడు పోలయ్య.

"అబ్బ! ఎంత తియ్యగా ఉన్నాయో?" అన్నాడు శేఖర్ తాగిన తరవాత.

"ఇక్కడ వాతావరణమే అలా ఉంటుందిరా" అన్నాడు సీతయ్య. దాని అర్థం అతనొక్కడికి మాత్రమే తెలుసు!

"పోలయ్యా! కోడి వేపుడు... చేపల పులుసుతో చక్కగా వంట చేయించు" ఆజ్ఞాపించాడు సీతయ్య.

"అట్టాగేనండి" అంటూ వెళ్ళబోయాడు –






పోలయ్యా

"అదెక్కడ?" అన్నాడు సీతయ్య

ఆశ్చర్యంగా చూశాడు శేఖర్

మరుక్షణంలో పరుపు కింద నుంచి పేక పాకెట్టు తీసి ఇచ్చాడు పోలయ్య

"ఎందుకునాన్నా?" అన్నాడు శేఖర్ అమాయకంగా

"ఎందుకేమిటిరా? ఆడుకోటానికి! నవ్వుతూ అన్నాడు సీతయ్య

ఎవరెవరు?"

"భలేగా ఉందిరా అబ్బాయ్! నువ్వూ నేనూ

"నీకు తెలుసుగా నాన్నా నాకు పేకాడటం రాదని" ఇబ్బందిగా ఫీలయ్యాడు శేఖర్

"అబ్బాయ్ నీకో రహస్యం చెప్పనా?"

కనుబొమ లెగురేశాడు శేఖర్ ప్రశ్నార్థకంగా.

"చెట్టంత కొడుకుని స్నేహితునిలా చూడమన్నారు పెద్దలు. దాన్ని నేను నీ విషయంలో పూర్తిగా ఆచరిస్తాను అందుకని . ఇప్పుడు . ఇక్కడ నువ్వేమీ సంకోచించాల్సిన పనిలేదు. రా! ముందుగా మన కార్యక్రమాన్ని పేకాటతో ప్రారంభిద్దాం! రా!" మనస్ఫూర్తిగా ఆహ్వానించాడు సీతయ్య

. "నీ మంచి మనసు నాకు తెలుసునాన్నా ... కానీ పేకాట మీద నాకు మనసు లేనే లేదు . పొలం ... వ్యవసాయం, అందులోని సాధక బాధకాలు చెప్పు . వింటాను అమెరికాలోని సేద్యానికి అన్వయించి కొన్ని కొత్త విషయాలు చెపుతాను" అన్నాడు శేఖర్

గుండెల్లో రాయి పడింది సీతయ్యకి తనకు తెలిసేదుస్తేగా కొడుక్కు చెప్పటానికి? అనుకున్నాడు దాన్ని కప్పి పుచ్చుకోటానికి ఒక కొత్త ఎత్తుగడ వేశాడు

పోలయ్యా?" అంటూ కేకేశాడు.

"అయ్యా! అంటూ వచ్చాడు పోలయ్య.

'వచ్చేప్పుడు మరిచిపోయాను మీ దొరసానమ్మ కంగారు పడుతుందో ఏమో ఈ రాత్రికి అయ్యగారు అబ్బాయిగారు ఇక్కడే ఉంటారంట భోజనాలు కూడా ఇక్కడే నంటని చెప్పిరా" అని పురమాయించాడు

'సరేనయ్యా!"అంటూ వెళ్లాడు పోలయ్య అతను వెళ్ళిన అయిదు నిమిషాలకు "ఒరే శేకూ! నువ్విక్కడే కూర్చో . నేనలా బహిర్భూమికి వెళ్ళి వచ్చేస్తాను" అంటూ లేచాడు సీతయ్య అప్రయత్నంగా ఆయన చెయ్యి మీసం మీదికి వెళ్ళింది సగర్వంగా

"సరే నాన్నా అన్నాడు శేఖర్.

తండ్రి వెళ్ళిన తరువాత కుర్చీమీద నుంచి మంచం మీదపడుకొని రిలాక్సయ్యాడు. అమెరికాలోని ఫాస్ట్ లైఫ్‌కు .. ఈ పల్లెలోని ప్రశాంత జీవితానికి టేరీజు వేసుకుంటున్నాడు మనసులో.

పట్టుమని పది నిముషాలు కూడా కాలేదు. గాజుల చప్పుడు వినిపించింది.

ఆశ్చర్యపోయి ఆ శబ్దం వచ్చిన వేపు చూశాడు శేఖర్

గాజుల చప్పుడు ఆగిపోయింది.

ఉలిక్కిపడి లేచాడు శేఖర్.

ఛటుక్కున లోపలి కడుగుపెట్టిందా శాల్తీ!

కంగారు పడుతూనే పరిశీలనగా చూశాడు

ఇరవై . పాతిక సంవత్సరాలున్న స్త్రీమూర్తి చామన ఛాయగా ఉన్నా ఆకర్షణీయమయిన ముఖం చక్కటి కనుముక్కు తీరు, ఎత్తుగ ఎగసిపడుతూ మత్తెక్కించే యవ్వన సంపద చవులూరించే వంపు సొంపులు

ఆమె చేతిలో ఉన్న దాన్ని చూసి మరోసారి ఆశ్చర్యపోయాడు బ్రాందీ బాటిల్!

"ఎవరు నువ్వు?' అన్నాడు శేఖర్

"నిజంగానే మీకు తెలియదా? అబ్బాయిగారూ?"

, "తెలియదు బయటికెళ్ళు ముందు" తనకు తెలియకుండానే గద్దించాడు

ఆమె అంగుళం కూడా కదలలేదు

"నీకే చెప్పేది?"

"నేను లోపలికి వచ్చింది . ఎల్లటానిక్కాదు బాబుగారూ" అంది బ్రాందీ బాటిలు ... బల్లమీద పెడుతూ

మళ్ళీ ఆమే అంది. "మీ నాన్నగారు సూస్తారని భయమా? నేను మీతో ఉన్నంత వరకు ఎవురు రారిక్కడికి.'

"ముందు బయటికి వెడతావా వెళ్ళవా?" రెట్టించాడు

'ఏం దబ్బాయిగారూ! నాలాంటి పంచదార

# ఇ·వేమన·పద్యాలు




మర్మ మెఱుగలేక మతముల గల్పించి
యుర్విదిశలు గూర్తు రొకరి కొకరు
గాజు ఇంట గుక్క కళవళపడ్డట్టు
విశ్వదాభిరామ వినురవేమ.

లడ్డూని తింటానికి ఇంతసేపు ఆలోచిస్తున్నారు. ఇంకోల్లయితేనా ఈపాటికి ఎగిరి దూకేవోలు! బేగి రండి! ముందు ఈ మందు రుసి సూడండి ...!" అంటూ బ్రాందీ సీసా మూత తీసి ... గ్లాసులో కొంచెం పోసి ... దాంట్లోకి కూజాలోని నీళ్ళు వంపింది.

"తాగండబ్బాయి గోరూ! మజాగుంటది!" కవ్విస్తూ అతని చేతికిచ్చింది గ్లాసుని.

అంతే!

మరుక్షణంలో గ్లాసుని నేలకేసి కొట్టాడు శేఖర్.

నివ్వెరపోయిందామె.

"ఓహో! అబ్బాయిగోరికి మందక్కర లేదన్నమాట! అట్టాగా ... మీకేం కావాలో ఇత్తానుండండి" అంటూ అమాంతం శేఖర్‌ని కౌగలించుకుని మంచం వేపుకి లాక్కెళ్ళటానికి ప్రయత్నించింది.

"ఛీ! వదులుతావా వదలవా?"

## కొడుకా! నువ్వూ చెడిపో!

"వదల్ట మేమిటబ్బాయిగోరూ! మజా సేసుకోండి నాతో" అంది తన కౌగిలి నింకా బిగిస్తూ.

"ఆఖరుసారిగా చెపుతున్నాను. మర్యాదగా వదులుతావా? వదలవా?" గర్జించాడు శేఖర్.

"మీ మగాళ్ళంతా ఇంతేలెండి! ముందిట్టాగే బెట్టు సేసినట్టు కనిపిత్తారు" అతన్ని మరింత గట్టిగా హత్తుకుంటోందామె.

బలాన్నంతా కూడదీసుకుని విదిలించి కొట్టాడామెని శేఖర్. ఆ ఊపుకి అతని కౌగిలి నుంచి విడివడి ... పడిపోబోయి - నిలదొక్కుకుందామె. తరవాత ... తలదించుకొని ...

"నిజంగా మీకిట్టంలేదా అబ్బాయిగోరూ?" అంది దెబ్బ తిన్నట్టుగా.

"లేదు" నిష్కర్షగా చెప్పాడు శేఖర్.

ఆమె మారు మాట్లాడకుండా అమాంతం శేఖర్ కాళ్ళ మీద పడిపోయింది.

"తప్పు! ఏమిటిది? లే!" అన్నాడు.

లేస్తూనే అందామె "సెమించండి. నేను పోలయ్య పెళ్ళాన్ని! ఇదంతా సేయించింది మీ నాన్నగోరే! ఇంత నీతిమంతులు ఆయన కడుపునెట్టా పుట్టారు బాబుగోరూ? వత్తాను" అంటూ వెళ్ళిపోయింది.

నిర్ఘాంతపోయాడు శేఖర్. ఎవరో తనని పాతాళానికి అణగదొక్కినట్టుగా ఉందతనికి. కన్న కొడుక్కి ... తండ్రి స్వయంగా పూనుకుని ... మందుని ... మరో మగువని ఏర్పాటు చేయటమా? చాలా కొత్తగా ... అంతకన్నా వింతగా ఉందతనికి.

రివ్వున చుట్టింటి బయటికి వచ్చి ... "నాన్నా నాన్నా" అంటూ కేకేశాడు గట్టిగా.

"పాక కంతల్లోంచి సూసి ... మొకం సెల్లక యింటికెళ్ళి పోయారు బాబుగోరూ" తన పాకలోంచి జవాబిచ్చిందామె.

మళ్ళీ ఆశ్చర్య పోయిన శేఖర్ ... "ఇదిగో! ఆ వంటలేమీ చెయ్యకు. నేను వెళ్ళిపోతున్నాను" అంటూ ముందుకు నడిచాడు. అతని మనసంతా గజిబిజిగా ఉంది.

తన శీలానికి పరీక్ష ఎందుకు పెట్టాడు నాన్న? అదే అర్థం కావటం లేదతనికి.

ఇంటికి జేరేసరికి ... సన్నగా నాన్న ఏడుపు స్వరం ... వినిపించి కాళ్ళకు మేకులు కొట్టినట్టుగా అక్కడే ఆగిపోయాడు.

"నువ్వే గెలిచావ్ హనుమా! అమెరికాలో ఉంటున్న మనబ్బాయికి ... తాగుడు ...జూదం ... వ్యభిచారం, అన్నీ అలవాటయి ఉంటయ్యనుకొని ... మన పాలానికి తీసుకెళ్ళి ... వాడికి తెలియకుండా పోలయ్య పెళ్ళాన్ని చుట్టింట్లోకి పంపించాను ... మందు సీసాతో ... అబ్బాయి దాన్ని ఛీకొట్టి బయటకు గెంటేసాడు. పాక వెనకాల నిలబడి కంతల్లోంచి తొంగి చూస్తున్నాను నేను ... సిగ్గుతో చచ్చి పోయాను హనుమా! నా కొడుకులో మరో శ్రీరాముణ్ణి చూశాను. ఇంత వయస్సు వచ్చి గోపిలోలుడి వేషాలు వేస్తున్న నన్ను ... అబ్బాయి మంచిప్రవర్తన ... మెత్తని చెప్పుతో కొట్టినట్టయింది. నాలో పరివర్తన తీసుకు రాగలిగింది. నీకు హామీ ఇస్తున్నాను హనుమా. ఈ రోజు నుంచీ నేను మందు కొట్టను. పరాయి ఆడదాన్ని ముట్టను. ఇన్నాళ్ళు నీ మనసు బాధ పెట్టినందుకు నన్ను క్షమించు."

"అలా అనకండి. ఇప్పుడు నాకెంత సంతోషంగా ఉందో తెలుసా? సీమ వెళ్ళిన కొడుకు నీతిమంతుడని రుజువు చేసుకోవటమే కాకుండా ... ఈ పల్లెసీమకొచ్చి .. తండ్రిని కూడా మార్చి వెయ్యగలిగాడు ఇంతకన్నా ఏం కావాలండీ నాకు." అంది హనుమాయమ్మ.

తల్లిదండ్రుల మాటలు విన్న శేఖర్‌కి ... అమెరికానుంచి ... కేవలం వాళ్ళని చూద్దామని వేలు వేలు ఖర్చు పెట్టుకొని వచ్చిన తన ట్రిప్ సార్థకమయిందనిపించి ... ఆనందంతో కళ్ళు చెమ్మగిల్లాయి. □

# సాటిలేని విలువ, మేటి గుణం...

# వాడండి ఈ టూత్‌పేస్టు ప్రతిదినం—క్లోస్-అప్.



చాక్ గల చిక్కని టూత్‌పేస్టు 100 గ్రాములు | 100 గ్రాములు

చాక్ గల చిక్కని టూత్‌పేస్టుల కన్న వేరైనది క్లోస్-అప్. దీనిలోని అద్వితీయ ఆధునిక జెల్‌లో శుభ్రపరిచే నురుగు పుష్కలంగా వుంది. కాని ఇది అంత బరువైనది కాదు. అంచేత, ట్యూబును ట్యూబు పోలిస్తే, క్లోస్-అప్‌తో మరిన్నిసార్లు బ్రష్ చేసుకోవచ్చు. ఇప్పుడు మీరు వాడుతున్న టూత్‌పేస్టు* కన్న ఇది మరింత ఎక్కువకాలం వస్తుంది.

క్లోస్-అప్‌తో ఇంకా ఎన్నో ప్రయోజనాలు. దీనిలోని ఆధునిక క్లీనర్‌లు మీ పళ్లను తెల్లగా చేస్తాయి. మీ శ్వాసని ఎంతో శుభ్రంగా, ఎంతో తాజాగా ఉంచటానికి ఇందులో వుంది అసలైన మౌత్‌వాష్. అవును, క్లోస్-అప్‌తో మీకు అన్నీ కైవసం అవుతాయి—ముఖ్యంగా ప్రపంచాన్నే జయించే ఆ ఆత్మవిశ్వాసం ఇస్తుంది క్లోస్-అప్!

*ఒకే విధమైన నాజిల్ సైజు, 2 సెం.మీ. పేస్టు పొడవు ఉంటే.

- అసలైన మౌత్‌వాష్ గలది.
- ఆధునికమైన శుభ్రపరిచే జెల్ గలది
- ఎక్కువ సార్లు బ్రష్ చేసుకోవచ్చు

మిలమిలలాడే తెల్లటి పళ్లు,
మరింత తాజాగా
ఉండే శ్వాస కోసం!




హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.




# స్థానం

## కుమారి ఏ.వి.శేషారత్నం

అర్ధరాత్రి–

అమావాస్య –

శ్మశానం–

నక్కల ఊళలు విన్పిస్తున్నాయి..

ఆ నిశ్శబ్దానికి మామూలు మనిషికి గుండె ఆగిపోవడం ఖాయం.

అర్ధరాత్రి పన్నెండు గంటలవుతూంటే ఊడల మర్రి మొదట్లో గాలి కదిలినట్లయింది. క్రమంగా పది శవాలు పేర్చిన ఎత్తయిన సింహాసనం మీద ఒక ఆకారం ప్రత్యక్ష మయింది.

భయంకరమైన ముందుకు పొడుచుకొచ్చిన కనుగుడ్లు–

మెడలో పేగులు–

వికృతమైన ముఖం–

ముళ్ల కిరీటం–

క్రమంగా కొన్నివేల ఆకారాలు కేకలు నవ్వులు, ఏడ్పులతో కోలాహలం చేస్తూ కిరీటధారి చుట్టూ చేరాయి.

కళ్లలో నిప్పులు కక్కుతూ ఆ నాయకుడు–

'మూడు నెలల క్రితం మన జట్టు నుంచి మందూబాయి తప్పి పోయినా ఒక్కరికీ పట్ట లేదన్నమాట'– అన్నాడు.

మందూబాయి తల్లి చింపిరి జుట్టు పీక్కుంటూ అరిచింది.

"ఆదుకోడానికో మనిషి కావాలంటే మధ్య తరగతి మార్తాండరావుని చూపించాను దొరా! అంతే నా బిడ్డ జాడలేదు".

అదిరి పడ్డారు అక్కడున్న వాళ్లంతా–

'మార్తాండరావా! అతను ఆదర్శవాది – సకల సద్గుణశీలి. డబ్బులకి మొహం చూసుకునే మధ్య తరగతి వాడిని ఆదుకోడానికిచ్చావా? నువ్వసలు దయ్యానివేనా? మన జాతి నశించి పోవాలనా? ఇలాగయితే ఈ కలికాలం అంతమయ్యే లోగా మన పిశాచ సామ్రాజ్యం విస్తరించదు సరికదా ఊరిచివరి స్మశానాలే మనకు గతి'.

మార్తాండరావు చేతిలో ఓడిపోయిన డైమండ్ రాణి, సిగరెట్టు ధూమ్రాక్షుడు కోపంగా పళ్లు కొరికారు. 'అమ్మా:– ఎక్కడినుంచో ఓ పిలుపు–

హఠాత్తుగా మందూబాయి అనే పిల్ల పిశాచం మార్తాండరావు భుజాల మీద స్వారీ చేస్తూ ప్రత్యక్షమయేసరికి అందరి మొహాలూ వెలిగి పోయాయి.

ఏనుగులా ఉండే మధ్యతరగతి మార్తాండరావు పీనుగులా అయిపోయి– మందూబాయిని మొయ్యలేక మోస్తున్నాడు నీరసంగా–

## వర్గ పోరాటంలో ఇద్దరు దుర్మరణం!

పమిడి తండ్లవారి పల్లెలో రెండు వర్గాల వారు ఉద్రేకపడి చేతులు చాలక, కర్రలను వాడారట. వాటితో పాటు మరికొన్ని మారణాయుధాలు కూడా వాడారట. తత్ఫలితంగా వోయిద్దరు చనిపోవడం, సుమారు 40 మంది గాయపడడం జరిగిందట.

## పాదరక్షలే ఆహారం!

జపాన్‌కు చెందిన మాయన్‌గషి అనే వో వింతమనిషికి చెప్పులే ఫలహారమట. చెప్పులే భోజనమట. చెప్పులే చిరుతిండట. ఈ తిండిలో అతను సైకిల్ టైర్లు నంచుకుంటాడట. తోలు చెప్పులైనా, హవాయి వయినా సరే ఎంచక్కా




కొరుక్కుతిని తృప్తిగా తేనుస్తాడట యీ వాతాపి. గత కొన్నేళ్ళుగా యీయన మామూలు మనుషులు తినే తిండి తిననేలేదట.

## అందాల పిరుదుల పోటీ!

బ్రిటనులో రసిక హృదయులంతా వో వింత పోటీని నిర్వహించారట. ఈ పోటీ వోరకం అందాల పోటీ అట. అందమైన స్త్రీలు వేదిక మీదికి వచ్చి న్యాయ నిర్ణేతల ఎదుట తమ పిరుదుల అందాలను చూపాలట. ఈ పోటీలో వివిధ దేశాలకు చెందిన 108 మంది అంగనలు వచ్చారట. 1981లో అతి రమ్యమైన పిరుదులు కలిగిన జిన్ బ్రిగటాకు ప్రథమ బహుమతి వచ్చిందట. ఆ నాటి నుంచీ యిప్పటి వరకూ ప్రతి యేడు ఎవరికో ఒకరికి ప్రథమ బహుమతి వచ్చినా ఆ "జిన్ బ్రిగటా" పిరుదుల వంటి పిరుదులు కలవారెవరూ లేరని యీ న్యాయ నిర్ణేతలు వాపోయారట–

## ముక్కూడ తీసిన ముద్దు!

1837లో బ్రిటనుకు చెందిన థామస్ సేవర్ లాండ్ అనే ఆయన కరోలిన్ న్యూటక్ అనే వో అందాల భరిణను చూసి ముగ్ధుడై మైమరచి, ఎగిరి వో గంతేసి, చుపుక్కునో ముద్దు పెట్టుకున్నాడట పబ్లిక్‌న. అతనాపని చేయడంతో చిర్రెత్తిన ఆ వరకాంత లటక్కునాతని ముక్కు నోట చిక్కించుకుని, ఫుటుక్కున కొరికి, తుపుక్కున వుమ్మేసిందట. ఈ కేసు విచారించిన న్యాయస్థానం ఆ కరోలిన్ చేసిన పని చాలా సమ్మతమైనదే నని తీర్పిచ్చిందట.

## వింత ఆచారం!

ఐరిష్ దేశంలో వో వింత ఆచారం, మూఢనమ్మిక వున్నదట. పెళ్ళయి, సుఖంలేని స్త్రీలు, కొత్తగా పెళ్ళయిన వారూ తమ భర్తలు తమ మీద ఎంతో ప్రీతితో సామర్ధ్యంతో తమను సుఖ పెట్టాలంటే తొమ్మిది అర్ధ రాత్రుల వేళ స్మశానానికి వెళ్ళి సమాధి లోవున్న శవాలను రోజుకొకటిగా పైకి తీసి, వాటి చర్మాన్ని చిన్న ముక్కనో కొంచెం కోసుకుని తెచ్చి, అది తమ భర్తలు నిద్రపోతుండగా వారి కాలికి కట్టితే ఆ భర్తలు తమకు అనుకూలురై సుఖాన్ని యివ్వ గలరు అనిట ఈనమ్మిక. దీన్నినమ్మే ఆడవారు




శవాలు దొరక్క పిల్లల్ని రహస్యంగా ఎత్తుకు పోయి, చంపేసి కూడా యీతతంగం నిర్వహించిన నిదర్శనాలున్నాయట. □

---

'వీడి నెలా లొంగదీసావు'?

చుట్టూ చేరిన పిశాచాల ప్రశ్నల పరంపరకి కొండమీంచి రాళ్ళు దొర్లినట్టు నవ్వాడు మందూబాయి.

'ఇతన్ని పేకాట వ్యసనంలోకి దించి సర్వనాశనం చెయ్యాలని నేనెన్నో ఆశలు పెట్టుకుని ఓడిపోయాను దొరా!' – కక్షగా మార్తాండరావును చూపిస్తూ అంది డైమండ్‌రాణి.

ధూమ్రాక్షుడు రింగురింగులుగా పొగ రూపంలో చుట్టుముట్టాడు.

'ఈ మార్తాండరావు చాల కఠినాత్ముడు దొరా! ఇతన్ని వశపర్చు కోవాలని నేను అతని స్నేహితుల ద్వారా వేసిన ప్లాను పాడయింది. స్నేహితులని దూరం చేసుకున్నాడు గాని నన్ను ముట్టలేదు'. – కోపంగా ఉంది ధూమ్రాక్షుడి కంఠం.

'శభాష్ మందూ' విజయం సాధించావన్న మాట మనిషి మీద. అయితే మన నియమాలకు విరుద్ధంగా మానవుడిని ఇక్కడి కెందుకు తెచ్చావు?'– నాయకుడు కనుగుడ్లు ఎర్రగా చేసాడు.

మందూబాయి నవ్వు వికటంగా ఆ ప్రదేశమంతా మార్మోగింది.

'దొరా? ఇతను బ్రతికుండీ చచ్చినవాడితో సమానం. రేపో మాపో ఎలాగూ మనలో చేరబోతున్నాడు. మన మాటలు ఇతనికేం వినిపించవుగా'.

'ఇంతకీ ఈ మొండి వాడెలా లొంగాడు?'

కుతూహలం చెలరేగిందక్కడ.

'వీడి స్నేహితుడిని ఆశ్రయించాను ప్రభూ! మాటల గారడీ అతడి ప్రత్యేకత. "మనమీద మనకి విశ్వాసం ఉంటే ఏ వ్యసనమూ మనల్ని ఏం చెయ్యలేదు' అనేట్టు మార్తాండరావుచేత పందెం కాయించాడు.

'మొదటి పెగ్గులో మజా' అని స్నేహితుడు అంటూంటే మార్తాండరావు నన్ను క్రూరంగా చూసి తన కడుపులోని జఠరాగ్నిలో మసి చెయ్యాలను కున్నాడు. నాకు వణుకు పుట్టింది. నా జీవితం ఆఖరనుకున్నాను. కొన్ని రోజులదాకా మార్తాండ రావు కన్పించలేదు.

కాని ఒకరోజు స్నేహితుడు అతని భుజం మీద చెయ్యేసాడు. తట్టుకోలేని అతన్ని చూసి స్నేహితుడు నవ్వాడు. నావైపు చిత్రంగా చూసి మళ్ళీ నన్ను రెండు పెగ్గులుగా కడుపులో దాచేసుకున్నాడు.

నా పంట పండింది. నాలుగు రోజుల కొకసారి వచ్చేవాడల్లా రోజూ బార్‌కి రావడం – ఒక్క క్షణం కూడ నన్ను తాగకుండా ఉండలేక పోవడం – అంతే ఆరోగ్యం పాడయింది. ఎప్పటికప్పుడు 'ఇదే లాస్ట్ పెగ్గు' అనుకునేవాడు– చివరికి పెళ్ళాం పిల్లల్ని పుట్టింటికి పంపేసాడు. ఇల్లు అమ్మేసాడు– ఇపుడితను నా బానిస – నేనెలా చేస్తే అలాగే – ఇతని జీర్ణకోశం నుంచి మెదడు దాకా పాకాను. దొంగతనం కూడ చేయించాను. ఇతని శరీరం యావత్తూ ఇపుడు నా అధీనం– మీరు నా గురించి దిగులు పడకండి. ఎపుడు తల్చుకుంటే అపుడు ఇతని మీద – ఈ భుజాల మీద స్వారీ చేస్తూ క్షణంలో రాగలను.'

మందూబాయి కంఠంలో గర్వం తొణికిస లాడింది.

'మార్తాండరావు చచ్చి పోతేనో?'

'మరో భీమారావు. చండప్రచండుడు లాంటి ఆదర్శాలున్న ఇతనే వశంకాగా లేనిది బలహీన మనస్కులయిన మిగిలిన మనుషులొక లెక్కా?'

రెండు కాళ్ళూ మార్తాండరావు భుజాలచుట్టూ బిగించాడు మందూబాయి. నాయకుడి ముఖం తృప్తితో వెలిగింది.

జైజై నాదాలతో ఆ అర్ధరాత్రి హూరుమోగింది. □

"దొరికితే దొంగలు"లో విజయశాంతి

# సినిమా...

## స్వతంత్రానికి ఊపిరి పోయండి"

"మన దేశంలో స్వాతంత్ర్యం ధనిక వర్గానికి తప్ప బడుగు వర్గాల వా ికి ఏ మాత్రం ఉపయోగపడటం లేదు. సగటు మనిషి ఎన్ని వ్యధలకు గురవుతున్నాడో తెలిపే ఇతివృత్తం. సందేశం ఇచ్చే జనరంజకమైన



"దయామయుడు"లో రమ

చిత్రం. సౌత్ ఇండియన్ ఫిలిమ్ ఇన్స్టిట్యూట్‌లో తర్ఫీదు పొందిన అయిదుగురితో పాటు రంగస్థలానుభవం గల కళాకారులను కూడా పరిచయం చేస్తున్నాం. జూన్ నెలాఖరున విడుదల చేయడానికి సన్నాహాలు చేస్తున్నాం. ఈ చిత్రాన్ని తమిళంలో కూడా నిర్మించాం. మలయాళంలోకి డబ్ చేశాక, కన్నడంలో కూడా పునర్నిర్మిస్తాం." అన్నారు యు. వెంకన్నబాబు. ఈయన, చిన్నారావు కలిసి దర్శకత్వం నెరపిన అరుణోదయా ఫిలిమ్స్ డివిజన్ వారి పై చిత్రంలో చంద్రమోహన్, స్మిత, అహల్య, వై. విజయ, సుగంధి, అనూరాధ, కల్పనారాయ్, నవ నటులు వినయ్, విజయశేఖర్, జి. జయభూషణ్, బాలు సాయిరాజ్, దేవానంద్, మూర్తి, రామిరెడ్డి

# ...సినీ విశేషాలు

_జి.వి.జి.

ప్రభాకర్, హేమంతకుమార్, సువాస్, సాయి కిశోర్, శీను నటించారు. ప్రముఖ నేపథ్య గాయకుడు జి. ఆనంద్ స్వరకల్పనలో నిరంజన్ బొబ్బా రాసిన ఆరు పాటలు కర్ణపేయంగా ఉన్నాయి. విజయన్ ఛాయ, దిలీప్‌సింగ్ శిల్పం, 'బ్లాక్ బెల్ట్' శ్రీనివాసులు



...కృష్ణ, విజయచందర్

సాహసాలు, అంకిరెడ్డి కూర్పు, కె. హనుమంతరావు నిర్వహణతో రామనాథం సుబ్బారావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ ఐ. వి. రత్నం, ఘట్టమనేని సీతా రామయ్య చౌదరి నిర్మాతలు.

## "తాతయ్య కంకణం"

"రెండవ షెడ్యూల్ మే 25 నుంచి జూన్ 2 వరకు జరిగింది. ఇది భూతాలూ, మాయలూ లేని వినోదాత్మక జానపద చిత్రం. ఓ తాతయ్య సంగీత విద్వత్‌కు మెచ్చి, ఓ కంకణాన్ని ఒక దేవకన్య బహూకరిస్తుంది. మనమడు అమాయకుడు, అసమర్థుడు. అతన్ని ఆ ఊళ్ళోని వారు ఎన్నో విధాల



"ఇదా ప్రపంచం"లో డాక్టర్ రాజశేఖర్, శరత్‌బాబు

మోసగిస్తుంటారు. చివరికి ఆ వంచకుల ఆట కట్టిస్తాడు మనమడు... చివరి షెడ్యూల్ జూన్ 15 నుంచి 30 వరకు," అన్నారు కొమ్మినేని శేషగిరిరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో టి. బ్రహ్మాజీ, సి. ప్రభాకర్ నిర్మిస్తున్న శ్రీ ప్రభా ఆర్ట్స్ వారి ఫై చిత్రంలో నరసింహరాజు, నళిని, ప్రభ, పద్మనాభం, జె. వి. సోమయాజులు, నాగేష్, ప్రదీప్, వంకాయల, జయమాలిని, ఎస్. వరలక్ష్మి, శ్రీదుర్గ, సూర్యకళ, మాస్టర్ రాజేష్ పాత్రధారులు. కర్పూరపు ఆంజనేయులు, ఆత్రేయ, కె. వి. మహదేవన్, హెచ్. ఎస్. వేణు, కందస్వామి, పత్తిపాటి శ్రీరామమూర్తి, వేమూరి భాస్కర్ ప్రభృత సాంకేతికవర్గం.

"మన్మథ లీల – కామరాజుగోల"లో చంద్రమోహన్, రాజేంద్రప్రసాద్



# ఆంధ్రసచిత్రవారపత్రిక



## పాఠకులకు శతచిత్ర నటి సుమలత సమాధానాలు!

### త్వరలో ప్రారంభం!

తెలుగు సినిమా ప్రేక్షకుల ఆదరాభిమానాలని విశేషంగా చూరగొన్న శత చిత్ర నటి సుమలత ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారని తెలియచేయటానికి సంతోషిస్తున్నాము. త్వరలో ప్రారంభం కాబోయే ఈ శీర్షికకి పాఠకులు అర్థవంతమైన ప్రశ్నలని మాత్రమే పంప గోరుతున్నాము. వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో ప్రతివారం సుమలత ఎన్నిక చేసిన ఉత్తమ ప్రశ్నని పంపిన వారికి ఆటోగ్రాఫ్‌తో ఉన్న ఆమె అందమైన ఫోటో బహుమతిగా లభిస్తుంది. ప్రశ్నలు పంపేవారు తమ ప్రశ్నని ఈ కింది కూపన్‌లో స్పష్టంగా సిరాతో లేదా బాల్ పాయింట్ పెన్‌తో రాసి తమపేరు, పూర్తి చిరునామాతో - సహా " సుమలత సమాధానాలు " శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ –520003 అన్న చిరునామాకి పంపాలి. ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాయాలి. విడిగా రాసి పంపినవి పరిశీలింప బడవు.

పాఠకులు ఈ అవకాశాన్ని ఉత్సాహంతో వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము.

------------------------కూపన్------------------------

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న........................................................................................

..................................................................................................

..................................................................................................

పంపినవారి పేరు......................................................................

పూర్తి చిరునామా.....................................................................

## సినిమా

### విజయ బాపినీడు దర్శకత్వంలో మోహన్‌బాబు

"సంపూర్ణ హాస్య ప్రధాన చిత్రం. మోహన్‌బాబుతో పాటు మరో హీరో ఉంటారు. మనరాష్ట్రంలో ఆగస్ట్, సెప్టెంబర్ నెలల్లో షూటింగ్," అన్నారు విజయబాపినీడు. ఈయన దర్శకత్వంలో మోహన్‌బాబు సోదరుడు ఎం. కృష్ణ నిర్మించే చిత్రంలో సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, రాళ్ళపల్లి, సాక్షి రంగారావు, వేలు, వీరభద్రరావు, చిట్టిబాబు, శ్రీలక్ష్మి వగైరా నటవర్గం. వీరప్పన్ కథ, ఎం. డి. సుందర్ చిత్రానువాదం, బాలసుబ్రహ్మణ్యం సంగీతం, గోపాల్ ఛాయ నిర్వహిస్తారు.

### రాఘవేంద్రరావు, చిరంజీవి కాంబినేషన్‌లో దేవీవరప్రసాద్ చిత్రం "మంచి దొంగ"

"చిరంజీవి సరసన విజయశాంతి, రాధిక నాయికలు," అన్నారు దేవీ ఫిలిమ్ ప్రొడక్షన్స్ అధినేత కె. దేవీవరప్రసాద్. ఈయన నిర్మించే "మంచి దొంగ" చిత్రంలో రావుగోపాలరావు, రాళ్ళపల్లి, వేలు తక్కిన నటవర్గం. ఎం. వి. ఎస్. హరనాథరావు రచన, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, కోటగిరి వెంకటేశ్వర రావు కూర్పు నిర్వహిస్తున్నారు. ☐

---

ఇవాళ నా పుట్టినరోజు నిర్మాత ఖర్చుతో సెట్‌లో ఘనంగా జరుపుకుందా మనుకుంటే, ఇవాళ నాకు ఒక్క షూటింగ్ కూడా లేక పోయె గదా!





# తారలు - తీరులు

**శ్రీదేవి** కొంతకాలం క్రితం శ్రీదేవి ఒక హిందీ చిత్రం ఔట్‌డోర్ షూటింగ్‌కు సిమ్లా వెళ్ళింది. అక్కడ రోడ్ల మీద, గోడల మీద వివిధ భంగిమలలో తన బొమ్మలను చాక్‌పీసుతోను, బొగ్గుతోను గీచి ఉండడం చూసి ఆశ్చర్యపోయిందట. "ఇంత చక్కగా నా బొమ్మలు చిత్రించిన ఆ చిత్రకారుని చూడాలన్న తలపు కల్గింది నాకు. అతన్ని తీసుకు రమ్మని ఆ యూనిట్‌లోని వారితో చెప్పాను. మర్నాడు షూటింగ్ ముగించుకుని నా హోటల్ బసకు చేరుకునే సరికి ఓ పొట్టి మనిషిని ప్రొడక్షన్ మేనేజర్ తీసుకొచ్చాడు. అతనే చిత్రకారుడని తెలిసినప్పుడు నేనెంతగా విస్తుపోయి ఉంటానో మీరే ఊహించుకోగలరు. వణక్కం- అని తమిళంలో అంటూనే నమస్కరించాడు. అతనికి రెండు కాళ్ళూ లేవు పాపం. పొట్ట కూటి కోసం ఇలా బొమ్మలు వేస్తూ, మన దేశంలోని పలు ప్రాంతాలలో తిరిగి, చివరికి అలసిపోయి ఆ సిమ్లాలో స్థిరపడ్డాడట. 'కాన్వాస్ మీద రంగుల్తో కుంచెతో చిత్రించడానికి నా దగ్గర డబ్బులుంటేనా- మీ బొమ్మను ఇంకా ఎంత బాగా వేస్తానో!' అన్న అతనిపై నాకెంతైనా జాలి కలిగింది. నిర్మాతతో చెప్పి, ఆ హిందీ చిత్రంలో అతనికి ఓ చిన్న వేషమిప్పించాను. అతనికి వెయ్యి రూపాయలిచ్చారట నిర్మాత. రమేష్ అతని పేరు. అతనికి ప్రతి నెలా వంద రూపాయలు పంపిస్తున్నాను," అంది శ్రీదేవి.

**రాధ** "ఇటీవల నేను షూటింగ్‌కు బయలుదేరే ముందు పూజ గదిలో ఎక్కువసేపు గడుపుతున్నాను," అంది రాధ. ఆమెకు ఎవరో ఒక వినాయకుని విగ్రహాన్ని బహూకరించారట. "ప్రతి రోజూ ఆ విగ్రహానికి పూజ చేయకపోతే, లేనిపోని కష్టాలొస్తాయి. ఒక వేళ అలా పూజ చేయడానికి వీలు కాకపోతే, ఆ విగ్రహాన్ని ఏ ఆలయానికైనా సమర్పించండి," అన్నాడట ఆ దాత. "ఆలయానికి ఎందుకు సమర్పించడం? నేనే ప్రతి రోజూ పూజ చేస్తాను- అన్నానండి. అప్పట్నుంచి క్రమం తప్పకుండా పూజ చేస్తూనే ఉన్నాను. ఇప్పుడు వినాయక స్తోత్రం కంఠతా వచ్చేసిందండీ నాకు," అందామె నవ్వుతూ.

**రమ్యకృష్ణ** "నాకు శాస్త్రీయ నృత్యం తెలుసని చాలా మందికి తెలుసుండొచ్చు. ఐతే, చాలా కొద్ది మందికే తెలిసిన విషయమొకటుంది- నేను వీణ చక్కగా వాయిస్తానని. ఇప్పటికీ తీరుబడి ఉన్నప్పుడల్లా వీణ సాధన చేస్తుంటాను," అంది రమ్యకృష్ణ.

**అనూరాధ** చక్కగా ఒంటినిండా చీర కట్టుకుని తీయించుకున్న ఫొటోలే అనూరాధ ఇంట్లో కనిపిస్తాయి.

**కమలహాసన్** "నేనిటీవల పూర్తిగా శాకాహారినయ్యానండోయ్! ఒకప్పుడు ఎన్.వి. కాస్తో కూస్తో రుచి చూసేవాడ్ని. ఇప్పుడు సిసలైన శాకాహారిని. అన్నట్టు కోడిగుడ్డు శాకాహారమా?" అని కన్ను గీటుతూ అడిగారు కమలహాసన్. □

# BIFORA

## క్వార్ట్జ్ వాచెస్, క్లాక్స్ మరియు టైమ్ పీసెస్




బారత దేశపు అత్యంత వలుచనైన క్వార్ట్స్ నిశ్చిత సమయ
అనలాగ్ వాచ్‌లు క్వార్ట్స్‌లోనే ఇతర మోడల్‌లు మరియు
కీ ఇచ్చే వాచ్‌లు స్త్రీలకు మరియు పురుషులకు గూడ
అంతేగాకుండ గోడలపై అలంకరణకు మరియు టేబిల్‌పై
అలంకరణకు విస్తృత శ్రేణిలో లభించే అందాలు బైఫోర
మునుపెన్నడూ లభించేవి కావు మీ కిటువంటి మంచి సమయాలు

బైఫోర వాచ్‌లు (పశ్చిమ జర్మని బైఫోర ఉహ్రెన్ జి ఎం బి హెచ్ సహకారంతోను), బైఫోర ఇతర
గడియారాలు (జపాన్ దేశపు టోక్యో టోకెయ్ కం లిమిటెడ్) సహకారంతోను తయారు చేయబడుచున్నవి
బైఫోర వాచ్ కంపెని లిమిటెడ్, నెం 29, 7వ క్రాస్, వసంతనగర్, బెంగుళూరు-560 052

Akshara

# అభిమాన తారలపై అభిప్రాయం

నేను సుప్రీం హీరో చిరంజీవి అభిమానిని 'ఖైదీ' చిత్రం చూసి వీరి అభిమాని నయ్యాను "చిరంజీవి ఛారిటబుల్ ట్రస్ట్"ని పేద బాలబాలికలకు స్థాపించి, వరద బాధితులకు అందరికంటే ముందుగా రెండు లక్షల రూపాయల విరాళమును అందజేసిన విశాల హృదయుడు మా చిరంజీవి



అందుకే ఈ 'చిరంజీవి' అంటే మా ఇంట్లో 'చిరంజీవు' లందరికీ ఎంతో అభిమానం.

సినీ నీలాకాశంలో ధృవ నక్షత్రంలా మెరిసి, 'పున్నమి నాగు' లా బుసకొట్టి, 'రాక్షసుడు'గా మారి, 'రోషగాడై' 'చాణక్య శపథం' చేసి, 'విజేత'గా మారిన 'మగధీరుడు' మా 'చిరంజీవి' 'శుభలేఖ', 'విజేత' వంటి మంచి కథా బలం గల చిత్రాలలో నటించాలని, అభిమానుల హృదయాలలో 'చిరంజీవి' లా ఉండాలని అభిమానిగా నా అభిలాష

—కొటికలపూడి లక్ష్మి, సత్తెనపల్లి

★ ★ ★

నా అభిమాని నటి సుమధురహాసిని, సుహాసిని. చలనచిత్ర చరిత్రలో తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సాధించి అతి తక్కువ చిత్రాల్లోనే నటించి, తన నటనతో జాతీయ అవార్డు నందుకోగల్గింది. ఆమె ఎటువంటి పాత్రనైనా అవలీలగా నటించగల నటి "కొత్త జీవితాలు' ద్వారా తెలుగు తెరకు పరిచయమై "మౌనగీతం', 'ముద్దుల మనుమరాలు", "కర్పూర దీపం', "ఛాలెంజ్", "రాక్షసుడు", "మంగమ్మగారి మనుమడు", "లేడీ డాక్టరు", వంటి చిత్రాల ద్వారా ఆమె ప్రజలలో అత్యంత గుర్తింపు పొంది 'స్వాతి ద్వారా రాష్ట్ర అవార్డు అందుకొని "సింధుభైరవి" ద్వారా జాతీయ అవార్డు అందుకొన్నారు సిరి



వెన్నెల", "స్వాతి" వంటి చిత్రాలలో నటించారు అనేకన్నా జీవించారు అనడం సమంజసం. ఆమె "ఇన్స్పెక్టర్", "ఝాన్సీరాణి", లాంటి పాత్రల్లో నటించి ప్రేక్షక హృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోవాలని నా కాంక్ష.

- డి. కరుణాకర్, పాల్వంచ

నా అభిమాన నటీమణి, గ్లామర్ క్వీన్, నటనా సుందరి, నాట్యమయూరి కుమారి రమ్యకృష్ణ. తెలుగు నటీమణులందరూ పరభాషా చిత్ర ప్రవేశము చేస్తున్న ఈ తరుణములో తప్పని సరిగ సినీపరిశ్రమకు కొత్త నటీ మణులు ఎంతైనా అవసరము అటువంటి సమయములో కుమారి రమ్యకృష్ణ సినీ రంగ ప్రవేశము మన అదృష్టము. "భలేమిత్రులు" చిత్రము ద్వారా పరిచయమైన ఆమె "సంకీర్తన" చిత్రములో ప్రదర్శించిన నటన అద్భుతము, అమోఘము. విడుదల కావలసిన ఆమె చిత్రాలు "అస్తులు- అంతస్తులు", "మాపల్లెలో మగాడు', "మదన గోపాలుడు" చిత్రాలు విజయవంతమై మరో మెట్టు పై కెదగాలని ఆమె



అభిమానిగా నా కోరిక ఆమె చిరంజీవి ప్రక్కన నటిస్తే చూడాలని, తెలుగు చిత్రరంగములో అగ్ర తారగా నిలిచి పోవాలని ఆశిస్తున్నాను.

—జి. క్రాంతికుమార్, మాచర్ల

★ ★ ★

తెలుగు చలన చిత్ర రంగములో తెలుగు ప్రేక్షకులచే నాలుగుసార్లు సూపర్‌స్టార్ గా ఎన్నికైన



నటశేఖర కృష్ణ నా అభిమాన నటుడు

నిన్నటి "అల్లూరి సీతారామరాజు" నుండి నేటి "అగ్ని పర్వతం' వరకు ఎన్నో పాత్రలకు ప్రాణం పోసిన 'సర్దార్ కృష్ణమనాయుడు" మా కృష్ణ

తెలుగులో, హిందీలో 'సింహాసనం" ఒకేసారి నిర్మించి, దర్శకత్వం వహించారు "బుర్రిపాలెం బుల్లోడు" మా "సూపర్‌స్టార్" వరద బాధితులకు రెడ్‌క్రాస్ సంస్థద్వారా విరాళం యిచ్చిన "మహామనిషి" మా "కిరాయి కోటిగాడు".

ఆయన "ఛత్రపతి శివాజీ", "భగత్‌సింగ్" వంటి వీరుల పాత్రలలో నటిస్తే చూడాలి అని నా, మా అభిమానుల కోరిక.

టి. ఉమాకాంత్, విజయవాడ.

నా అభిమాన నటి సుహాసిని మహిళా ఛాయాగ్రాహకురాలిగా చిత్రసీమలోకి ప్రవేశించి హఠాత్తుగా అవకాశం, అదృష్టం వెంటాడగా నటిగా మారి అనతికాలములోనే అగ్ర నటీమణుల స్థానానికి చేరి, చిత్రసీమను, స్త్రీలోకాన్ని తన నటనా ప్రతిభతో ఆకట్టుకుంది ఎట్టి నటనానుభవం



లేకుండా నటనాలయంలో ప్రవేశించి అ, ఆలు నేర్చుకొని వానికి మెరుగులు దిద్ది అందలి మెళుకువలను నేర్పుగా గ్రహించి, వాటిని తన హావభావ ప్రకటనలతో వెలువరించి అత్యల్ప వ్యవధిలో ఊహకందని విధంగా నట నాకాశంలో తానొక తారగా నిలిచింది. "స్వాతి"తో అటు పరిశ్రమ ఇటు ప్రజల మెప్పు పొంది, 'సింధుభైరవి'తో జాతీయ ఖ్యాతి నార్జించి, దేశంలో దక్షిణాది సినీ పరిశ్రమకే వన్నె తెచ్చింది.

ఇలానే తన ఇమేజ్ దెబ్బతినకుండా అన్ని రకాల పాత్రలను పోషిస్తూ, అంతర్జాతీయ స్థాయిలో మన పరిశ్రమకు గొప్ప పేరు తేవాలని నా మనవి

— ఎ. శ్రీనివాస్, విద్యానగర్ (నెల్లూరు)

★ ★ ★

యువకిశోరం, నవరసరంజని "గోల్డ్‌స్టార్" విజేత బాలకృష్ణ గారంటే నాకు ఎనలేని అభిమానం.

హీరోగా 'సాహసమే జీవితం'తో భగ్న ప్రేమికుడుగా "కరుణరసం" పోషించి నా అభిమానం చూరగొన్నారు. 86వ సంవత్సరంలో వరుసగా సీతారామ కళ్యాణం", "అనసూయమ్మగారి అల్లుడు", "దేశోద్ధారకుడు" వంటి చిత్రాలు విజయవంతంగా ప్రదర్శించబడి విజయపతాకం



ఎగరవేసిన ఎక్సరీకింగ్. ఒకేరకమైన పాత్రలకు పరిమితం కాక వైవిధ్యంగల పాత్రలలో నటిస్తూ, జాతీయ, రాష్ట్రీయ స్థాయిలో అవార్డులను తన నటనావైభవంతో అందుకొంటారని ఆకాంక్షిస్తూ....

దబ్బీరు అజయ్‌కుమార్,

కట్టుబోలు(విశాఖ). □

# చేయూత

## పాలకోడేటి వేణు

"సుధా...."

"ఊ...."

"మాట్లాడు సుధా "

"ఏమిటి మాట్లాడమంటావు రాజూ...."

"అదేమిటి సుధా...."

"అవును రాజూ.... మనిద్దరి ప్రేమ గురించి మాట్లాడనా.... లేకపోతే మా యింటి సమస్యల గురించి మాట్లాడనా...."

"...." రాజు మాట్లాడలేదు.

మళ్ళీ సుధే అంది....

"అవును రాజూ.... యీరోజు మా యింట్లో జరిగిన గొడవతో నా మనస్సు పూర్తిగా పాడయి పోయింది...."

"ఏమిటయింది ..." అనునయంగా అడిగేడు.

అతని గొంతులోని మృదుత్వానికి ఆమె వేడి సోకిన వెన్నలా కరిగిపోయింది.

ఆమె కళ్ళెత్తి చూసిం దతని వైపు.... ఆ కళ్ళలో తడి అతను గమనించేడు. ..

"నేనొకటి అడుగుతాను సమాధానం చెప్తావా రాజూ... "

"అడుగు సుధా...."

"తీరా అడిగిన తర్వాత నన్నసహ్యించుకోవు కదా...."

"లేదు.... అసహ్యించుకోను...."

అతనివైపు చూడకుండా తల మోకాళ్ళమధ్య పెట్టుకుని అంది ఆమె మెల్లగా

"నీతో వొచ్చేస్తాను రాజూ.... యిలాగే... ఎక్కడి కయినాసరే. నన్ను తీసుకుపోగలవా రాజూ...."

"సుధా...." ఆమె అతని వైపు చూడలేదు.

ఒక్క నిమిషం ఆమె వైపు చూసేడు ... అతని కంటికి ఆమె పసిపిల్లలా కనబడింది. ఆమె కూర్చున్న తీరు అతనిలో ఏదో బాధ లేపింది. జాలి వేసింది. ఒక్కసారిగా ... ఆమె అంటే ఒక్కసారిగా ప్రేమ వెల్లువలా ముంచుకొచ్చింది. కాని తమాయించుకున్నాడు. తాము వున్న పరిసరాలు గుర్తు తెచ్చుకుని.... అది బీచ్ అనీ.... చుట్టుపక్కల జనాలు తమను పరిశీలిస్తుంటారని గమనించేడు....

ఆమె చుబుకాన్ని తర్జనితో ఎత్తేడు. ఆమె కళ్ళలో నీళ్ళు దుఃఖాన్ని ఆపుకోవడానికి విశ్వ ప్రయత్నం చేస్తున్నట్టు కనబడింది.

"ప్లీజ్ సుధా.... ఏడవకు...."

ఆమె కళ్ళలో నీళ్ళు వర్షించడానికి సిద్ధంగా వున్నట్టున్నాయి.

అతని అనునయానికి ఆమె దుఃఖాన్ని కంట్రోలు చేసుకోలేక పోయింది. అతని దగ్గరగా జరిగి అతని భుజమ్మీద తల ఆన్చి నిశ్శబ్దంగా ఏడవడం మొదలు పెట్టింది. చుట్టూ వున్న పరిసరాలని లెక్క చెయ్యకుండా.

రాజు ఆమె తలను నిమురుతూ వుండిపోయేడు.

కొంతసేపటికి ఆమె దుఃఖం ఉధృతి తగ్గింది. తన్ను తాను సంబాళించుకొంది. అతనికి దూరంగా జరిగింది. అప్పుడు గుర్తొచ్చేయి ఆమెకు పరిసరాలు.

"సారీ...."

"ఫర్వాలేదు...." అని షర్ట్ వైపు చూసుకున్నాడు. అతనికి నవ్వొచ్చింది....

"హలో మేడం.. తమరు చేసిన పని చూస్తారా...."

"ఏమయింది...."

"ఏమయిందా... చూడండి... ఇది ఎన్ని రేవులు వేస్తే వొదుల్తుందో చెప్పగలరా...."

తెల్లటి షర్టుమీద ఆమె కంటి కాటుక మరకలు నల్లగా అసహ్యంగా కన్పిస్తున్నాయి.

"సారీ"

"ఫర్వాలేదు కానీ...." అప్పుడు గమనించేడు రాజు ఆమె నవ్వలేదని.

ఆమె ఎటో చూస్తూ అంది....

'అవును రాజూ! తెల్లటి నీ జీవితానికి నల్లటి మచ్చలా లేనూ నేను.. '

"సుధా...." గట్టిగా అన్నాడు

"నో.. సుధా. నువ్వెప్పుడూ అలా అనుకోనక్కరలేదు.... ఎందుకంటే అనుబంధం అనేది యిద్దరికీ సంబంధించినది. పరస్పర ఆకర్షణ, పరస్పర ఆసక్తి లేకుండా ప్రేమ అనేది ఎక్కడా వుండదు."

"అదికాదు రాజూ నేను చెప్పబోయేది ..."

"నువ్వు చెప్పబోయేది యిదే విషయమ్మీద అయితే యిక చెప్పవద్దు. యింకేదైనా అయితే చెప్పు.... నేను వింటాను...." అని ఆగి,

"అన్నట్టు పొద్దున్న మీ యింట్లో ఏదో గొడవ జరిగిందన్నావు.... ఏమిటది...."

ఆమె మొహంలో మళ్ళీ నీలి నీడలు.

"ఆ విషయమే చెప్తాను రాజూ.... ఇంట్లో ప్రతి వాళ్ళ మనస్సుల్లోనూ ఏదో అసంతృప్తి. అక్కకి పెళ్ళి కాకపోవడం నాదా తప్పు.... నేను అందంగా ఉండడం నాదా తప్పు. అక్క అందంగా ఉండకపోవడం నాదా తప్పు. అసలే అక్క మనస్సు అతి సున్నితం. దానిని అమ్మ మరింత కృంగదీస్తోంది తన మాటలతో. అసలు ఒక్కోరోజు చూస్తుంటే తను తల్లేనా లేక సవతి తల్లా అనిపిస్తూ వుంటుంది.. ."

"సుధా...." వారిస్తున్నట్టుగా అన్నాడు రాజు.

"లేదు రాజూ నీకు తెలియదు మా అమ్మ విషయం. అక్కకి పెళ్ళి కాకపోవడంచేత మిగతా వాళ్ళ పెళ్ళిళ్ళు ఆగిపోయాయట. అసలు అది పుట్టిట్లోనే ఏ బిడ్డనొప్పొ వొచ్చి చచ్చిపోయి వుండినా బావుండేదిట. అంతలేసి మాట లనడానికి ఆవిడకు నోరెలా వొచ్చిందో అర్థం కాదు. అసలు అక్క విషయంలో వాళ్ళు చేసిన తప్పు వాళ్ళెందుకు గుర్తించరో నా కర్థం కాదు...." అని ఆగిందామె.

"ఏం తప్పు చేసేరు...?" రాజు అడిగేడు. అతనికి తెలుసు ఆమె ఏం చెప్పబోతుందో. తెలిసినా అడిగేడు కేవలం సంభాషణ పెంచడానికి. మరో విషయం కూడా అతను గుర్తించేడు.... ఆమె మనసులో వేదన తగ్గాలి. అందుకు అతను సహకరిస్తున్నాడు.

"ఏం తప్పు చేశారా.... ఏం తప్పు చెయ్యలేదని అడుగు. చదువు చెప్పించగలిగే స్తోమత ఉండి కూడా ఆమెకు చదువు ఎందుకు చెప్పించలేదు. ఏదో పుట్టగానే పెళ్ళి కుదిరిపోయినట్టు చదువు మాన్పించేసేరు.... నేను మొండిదాన్ని కాబట్టి యింట్లో పేచీ పెట్టి డిగ్రీ వరకు చదవగలిగేను. అది పెద్ద మనిషి కాగానే దాని చదువు చెట్టెక్కిపోయింది. అప్పటినుంచి అది తల్లి దండ్రులపై ఆధారపడ్డానికే తప్ప మరెందుకూ పనికిరాదు. ఎవరో నలకూబరుడు వస్తాడట... అంతవరకు దానికి వివాహ గీత లేదట.... యింట్లో వుండి అందరూ కబుర్లు చెప్పేవారే. ఒకవైపు అమ్మ సణుగుడు. మరో వైపు నాన్నగారి చాదస్తం. నాకు పిచ్చెత్తిపోతుందేమో నన్న భయం వేస్తోంది రాజూ..." అని ఆగి మళ్ళీ ప్రారంభించిందామె.

"ఒకళ్ళు దాని పెళ్ళి గురించి ప్రయత్నాలు చెయ్యరు. యివి పూర్వపు రోజులు కావు రాజూ... ఆ రోజుల్లో అయితే సాంప్రదాయం ఉన్న కుటుంబంలోని అమ్మాయి అయితే సరిపోయేది.... అందులోనూ పెద్దవాళ్ళు చెప్పిన మాటల్ని పిల్లలు వినేవారు. ఫలానా అమ్మాయిని మేం చూశాం వొచ్చి తాళి కట్టు అంటే సరిపోయేది.... మరి యీ రోజుల్లోనో.... ముందు తల్లిదండ్రి చూస్తారు. పిల్లవాడు చూస్తాడు. అందులో అమ్మాయి ఎర్రటి తొక్క వున్నది, బాగా చదువుకున్నది అయివుండాలి. ఎక్కువ కట్నం యివ్వగలిగిన, అడగ్గానే స్కూటర్లు, టీవీలు సప్లయి చెయ్యగలిగిన మావగార్లు వుండాలి.... ఏమిటిది రాజూ.... ఎటు వెళుతోంది 'మనదేశం.... ఎప్పటికి యిలాంటి సమస్యలకి పరిష్కారం.... అసలు పరిష్కారం అనేది కనుచూపు

మెరలో కనిఎంచడంలేదు రాజూ

రాజు ఆవేశాన్ని చూస్తూండిపోయేడు అతనికి తెలియని విషయాలు కాదివేవీ అయితే పరిష్కారం వుండటం అనే విషయంమీద అతనికీ కొన్ని అభిప్రాయాలు వున్నాయి సుధ మాటలు వింటుంటే అతనికి మరికొన్ని ఆలోచనలు పుట్టుకు వొస్తున్నాయి

సుధా నెమ్మదిగా ఎలిచేడు

వూఁ

మనమే ఎందుకు పూనుకోకూడదు సుధా యీ సమస్యా పరిష్కారానికి

రాజూ సంభ్రమంగా అంది

అవును సుధా నువ్వు కావాలనుకుంటున్న నేను నీ సమస్యలలో కూడా భాగం పంచుకోవడంలో తప్పులేదు కదా

కాని మా మూలాన నువ్వు యిబ్బంది పడడం నాకిష్టం ఉండదు

నో నువ్వు అడ్డు చెప్పకు సుధా గచ్ఛ తస్స్ఖలనం నదోషాయ అంటే అర్థం తెలుసా నడిచే వాని కాలు జారితే అందులో తప్పేం లేదు ఏదో యిబ్బందులు పడతామని అసలు కార్యక్రమం మొదలు పెట్టకపోవడ మన్నంత తప్పు పని లేదు కదలకుండా యింట్లో కూర్చుని విమర్శలు చేయడం సులువు తప్పులు పట్టడం సులభం వంకలు వెతకడం సులబం అవునా

అవుననుకో

రేపాక పని చేస్తావా సుధా

చెప్పు ఆసక్తిగా అందామె

యిక్కడికి మీ అక్కను తీసుకురాగలవా

మా అక్కనా ఆశ్చర్యంగా అడిగింది

అవును రేపు సాయంత్రం యిదే టైముకి ఈరోజు రాత్రి ఆలోచించి రేపు ఏ సంగతి చెప్తాను

ఎమిటది నాతో చెప్పకూడనిదా

వెయిట్ అండ్ సీ



venkat

ఆమె ఆరాధనగా అతని వైపు చూసింది. చాలు.... యీ మాత్రం అంత చాలు. ఒక్కరు.. . ఒక్కరు తమ సమస్య గురించి పట్టించుకుంటున్నారన్న స్పృహ ఆమెకు వెయ్యేనుగుల బలాన్నిస్తోంది. ఆమె హృదయం ఒక్కసారిగా తేలిక పడినట్టనిపించింది.

"నిన్ను చూస్తుంటే ఓ సినిమా డైలాగు చెప్పాలనిపిస్తోంది రాజా

సినిమా డైలాగా ఆశ్చర్యం నటించేదు

అవును అదేమిటో చెప్పనా అంది సుధ

చెప్పు వినక తప్పుతుందా అన్నాదు రాజా

నీలాంటివాడిని భర్తగా పొందగలిగే అదృష్టానికి నన్ను నేనే అభినందించుకుంటున్నాను రాజా

సినిమా డైలాగు బాగానే వుందిగాని చిన్న సవరణ

ఏమిటది

ఆంధ్ర దేశంలో భర్తలని ఏక వచనంలో సంబోధించరనుకుంటాను

ఎంకాదు నేన్నిన్ను అలాగే పిలుస్తాను

ఏమిటి పెళ్ళయ్యాక కూడానా

ఏం తప్పా

తప్పు నాక్కాదు మా యింట్లో వాళ్ళకి స్టెప్ కటింగ్ చేయించుకున్నానని అది తీయించేసేవరకు వూరుకోని మా తండ్రిగారూ, బెల్‌బాటం ఫాంట్‌కి బెల్ కొంచం ఎక్కువయిందని లంగాలా వుందని చీదరించుకొని బెల్ సైజు తగ్గించడానికి ఎన్ని రకాల మాటల అస్త్రాలు వాడాలో అన్నీ వాడి గెలిచిన మా బామ్మగారూ భర్త పిల్లలు ఏమైపోయినా పరవాలేదుగాని సుప్రబాతాన మొదలుపెట్టిన పూజని వుదయం ఎనిమిది గంటలు దాటినా పూర్తవని పూజలు జరుపుతూ పూజ గదిలోంచి బయటికి రాని మా మాతామహులూ

అయ్యో అవుతారా మీ సొద

అవును నేను మాట్లాడుతున్నదంతా తమరికి సొదలాగే అనిపిస్తుంది రేపు మనిద్దరికి పెళ్ళయి తమరు మా యింట్లో అడుగు పెట్టినపుడు తెలుస్తుంది అసలు విషయం ఏదో నీ బాగు కోరి నువ్వు ముందుగా జాగ్రత్త పడతావని మా యింటి విషయాలు, మా యింట్లో వాళ్ళ మనస్తత్వాలు చెప్తుంటే ... అవును.... నీకు సొదలాగే వుంటుంది... నాశం పట్టింది ఖర్మ.... నేను హాయిగా బాంకులో కూర్చుంటాను పొద్దున్న పది నుంచి సాయంత్రం ఐదు దాకా మధ్యలో బాధ పడేది నువ్వే తర్వాత నువ్వే అంటావు ముందుగా ఎందుకు మీ వాళ్ళ గురించి చెప్పలేదని

మహానుబావా పొరపాటు అని లెంపలు వేసుకుని యింకెప్పుడూ యిలాంటి తప్పుడ పనులు చస్తే చెయ్యను అని మరోసారి లెంపలు వేసుకోబోతోన్న ఆమె రెండు చేతులూ పట్టుకుని దగ్గరగా లాక్కున్నాడు

ఆ వేగానికి తట్టుకోలేక అతనిమీద వాలిపోయింది ఆమె

ఆమె ముఖాన్ని ఎత్తి

ఆమె హృదిలో హోరు క్షణకాలం యిరువు రొకటైపోయిన బావన అవిచ్ఛిన్న బావ తరంగాల వేగాల తాకిడికి ఎగసిపడే ఆమె గుండెలు అతని హృదయాన్ని నొక్కుతున్నపుడు, యీ ప్రకృతిలో కేవలం వారిద్దరు మాత్రమే వున్న అనుభూతి ఏ కలానికీ, ఏ కవితకూ అందని రసానుభూతి యీ ప్రపంచంలో వారిద్దరే అనుభవిస్తున్న అనుభూతి ఆ ఆనందపు ఆకాశపుటంచుల చివరకు చేరుకుని అక్కడనుంచి

ఆమె వొక్కసారిగా యీ ప్రపంచంలోకి వొచ్చి పడ్డది

ఆ అనుభూతి శాశ్వతమయితే బాగుండుననే బావన యిద్దరిలో వొకేసారి కలిగింది

ఆమె తడబడింది

ఎదురుగా నవ్వుతూ రాజా

ఎరుపెక్కాయి ఆమె బుగ్గలు

సన్నగా కనీ కనబడనట్టు నవ్వుతూ అన్నాదు రాజా

తమరీ లోకంలో లేనట్టున్నారు

అతని మాటలకు మరింత ఎరుపెక్కిన ఆమె ముఖం అస్తమిస్తున్న సూర్యుడితో పోటీ పడింది

ఆమె లేచింది....

"ఐతే రేపు మా అక్కని తీసుకొస్తాను...." సుధ అంది

"అలాగే. ." అన్నాదు రాజా లేవకుండానే ...

"అదేమిటి నువ్వు రావా...."

"లేదు సుధా.... నువ్వెళ్ళు... నేను కాస్సేపు పోయిన తర్వాత వెళ్తాను అన్నాదు రాజా

సరే వొస్తాను గుడ్‌నైట్

గుడ్ నైట్ అని ఆమె వెళుతున్న వైపుగా చూస్తుండిపోయేడు అతనిలో ఆలోచనలు ముసురుకున్నాయి

* * * * * * * * *

నమస్కారమండీ

నమస్కారం రండి కూర్చోండి మీ కోసమే చూస్తున్నాను ఏం యింతాలస్యమైంది అన్నాదు రాజా

ఆమె సమాదానం చెప్పకుండా చెల్లెలివైపు చూసింది

బస్సులు ఈవినింగ్ కదా చాలా రష్‌గా వున్నాయి అందుకని

అన్నట్టు మీ పేరేమిటన్నారూ రాజా అన్నాడు ఆమెని మాట్లాడించాలని

ర రాజేశ్వరి ఆమె తడబాటుగా అంది

మీరు ఎంతవరకు చదువుకున్నారు అడిగేడు రాజా

ఆమె సిగ్గు పడిపోయింది సమాదానం చెప్పకుండా తలదించుకుంది

అమెని పరిశీలనగా చూశాదు రాజా ఆమె అందంగా లేదు అలా అని అనాకారి కాదు చాలా సామాన్యమయిన అందం సుదతో పోలిస్తే ఆమె శరీరచ్ఛాయ చాల తక్కువ సుధ తెల్లని తెలుపైతే ఆమె చామనఛాయ సుధ అలంకరణలో కనబడే మోడర్నిటీ రాజేశ్వరిలో కనబడటం లేదు

గలగలా పారే సెలయేరు సుద అయితే నిండు గోదావరిలా వుంది రాజేశ్వరి

మీరు అంత కంగారు పడనక్కరలేదు నా గురించి మీ కీ పాటికి సుద చెప్పే వుంటుందనుకుంటాను అని రాజా సుద ముఖం వైపు చూశాదు

నీ గురించా ఆశ్చర్యంగా అంద నీ గురించి తన కెందుకు చెప్తాను అన్నట్టుగా ముఖం పెట్టి

యీసారి తడబడటం రాజా వంతైంది

అదే నే నెలాంటివాడినో అదీ మాటలు దొరకలేదు అతనికి

వోహో అదా మీ గుణగణాల వర్ణనా సారి మర్చిపోయాను చూడక్కా యిప్పుడు నేను ఆయన అపర శ్రీరామచంద్రుడు అని పొగడకపోతే ఆయన ఆయనగారి సొంత డబ్బా తీసి మనిద్దరికి వాయించేస్తారు అంది సీరియస్‌గా సుధ

సుదా అన్నాదు తర్జనితో బెదిరిస్తూ

ఏం ఏం చేస్తారు అంది సుధ కయ్యానికి కాలు దువ్వుతున్నట్టుగా

అప్పటివరకు బిగబట్టి కూర్చున్న రాజేశ్వరి యిక నవ్వు ఆపుకోలేకపోయింది వాళ్ళిద్దరి గొడవ చూసి



# ఎల్లప్పుడూ ఆంప్రోనే!

పిల్లలకు
ఆంప్రో అంటే ప్రాణం...
అందుకే ఎప్పుడూ
తయారుగా ఉంచుతాను!
అందులో ఎంతో రుచి,
బలమూకల బిస్కట్టు!

కాస్త ఆగండి...
ఒక్క బిస్కట్టును తినండి.




**ఆంప్రో గ్లూకోజ్ బిస్కట్లు**
**ఆంప్రో తో మీకు నాణ్యత ఖాయం.**

Sista's/AIL/232/85 Tel. a

హమ్మయ్య అన్నారు రాజు ఆమె నవ్వడం చూసి మళ్ళీ యిందాకటి ప్రశ్నని వేసేడు

మీరెంతవరకు చదువుకున్నారు

"పది

ఇంకా టైపు షార్టుహేండూ

టైపు హయ్యరు పాసయ్యాను షార్టుహేండు లోయరు పాసయ్యాను

గ్రామోదయ స్కీము క్రింద మీరు టైప్ యినిస్టిట్యూట్ పెట్టుకోవడానికి పాతికవేలు లోన్ యిస్తారు ఆ విషయాలన్నీ మా బ్రాంచి మేనేజరు గారితో మాట్లాడదాం ఈరోజు మీ గురించి అంతా చెప్దామనుకొండి మిమ్మల్ని కూడా తీసుకురమ్మని ఆయన చెప్పారు " చెప్పాల్సిందింకేమీ లేనట్టు వూరుకుండిపోయేడు రాజు

నేనా టైప్ యినిస్టిట్యూటా ఆమె కంఠంలో ఖంగారు ముఖంమీద స్వేదబిందువులు

అవును మీరే మీరే ఎందుకు నడపలేరు అసలు భారతదేశాన్ని 16 సం లు నడిపిందెవరు "

బాబూ మీ సొద మొదలుపెట్టేరా సుధ అంది

చూడండి రాజేశ్వరిగారూ మీ చెల్లెలు నేనేమైనా తప్పుగా మాట్లాడేనా అమాయకత్వం నటిస్తూ అన్నాడు రాజు

లేదు గానీ నేను యినిస్టిట్యూట్ నడపగలనా అనేదే సందేహం " రాజేశ్వరిలో బెరుకుతనం తగ్గి స్వేచ్ఛగా మాట్లాడడం మొదలు పెట్టింది

హమ్మయ్య యిప్పటికి మీరు దారిలో కొచ్చారు మీరు నడపగలరా లేదా అన్నది సమస్యకాదు ముందు మీకు యింట్రస్టు వుందా లేదా అన్నది ప్రశ్న తర్వాతి విషయాలన్నీ కన్యాశుల్కంలోని గిరీశం భాషలో చెప్పాలంటే టేకిట్ టు రాజు

సరే నాకేమీ అభ్యంతరం లేదు అని ఆగి,

అయితే వొక విషయం అంది రాజేశ్వరి

చెప్పండి అన్నారు రాజు

మా నాన్నగారు వొప్పుకుంటారా అనేది అంది రాజేశ్వరి

ఆదే ఆ విషయమే నేను చెప్పబోయేది ముందుగా మీ అమ్మగారితో చెప్పండి ఆవిడ రియాక్షన్ చూడండి నా వుద్దేశ్యం ప్రకారం ఆవిడ సుతరామూ వొప్పుకోదు అవునా

అవును అంది రాజేశ్వరి వెంటనే

ఆవిడకి చెప్తామా లేదా అన్నది ప్రధానం ఆవిడ వొప్పుకుందా లేదా అన్నది ముఖ్యం కాదు ఎందుకు ముందుగా మీ అమ్మగారితో చెప్పమన్నా నంటే ఆవిడ యీ విషయం మీ నాన్నగారితో వెంటనే చెప్పేస్తుంది మీ నాన్నగారికి కొంచెం ఆలోచించు కోవడానికి టైము వుంటుంది ఆ మర్నాడు మీరు మీ నాన్నగారితో విషయమంతా చెప్పేసెయ్యండి సుధని పక్కన సపోర్టుగా పెట్టుకోండి ఏం సుధా అన్నాడు రాజు

ఆ అలాగే చేద్దాం అంది సుధ

రాజేశ్వరి ఆలోచనలో పడింది ఆమెకైతే రాజు చేసిన ప్రతిపాదన బాగున్నట్టే అనిపిస్తోంది తన కాళ్ళమీద తను నిలబడడానికి సహాయం చేస్తా నంటున్నాడు ఇప్పట్లో తన కిలాగూ పెళ్ళయ్యే అవకాశంగాని, అదృష్టంగాని లేనట్టు కనబడు తోంది అమ్మ నాన్నలు అసలు పట్టించుకోవడం మానేశారు ఇంట్లో వొక్కర్తే కూర్చునీ, కూర్చునీ పిచ్చెత్తిపోతున్నట్టనిపిస్తోంది అందులో యింటికి వొచ్చేపోయే అమ్మలక్కల పరామర్శలు

ఏం మీ పెద్దమ్మాయికి యింకా సంబంధమేదీ కుదరలేదా

ఏమిటో వాళ్ళ వుద్దేశ్యం? కుదరాలనా కుదర కూడదనా ఎప్పుడూ ఎదుటివాళ్ళ బలహీనతలనో, వాళ్ళలో వాళ్ళో ఎంచి చూపిస్తూ వుంటారు

పోనీ మీ రెండో అమ్మాయికి చేసెయ్యకూడదూ

ఆ అమ్మాయి చదువెలాగూ పూర్తయిపోయిం దిగా ఒక మహిళ ఉచిత సలహా .

అమ్మ మొహంలో నిస్సహాయతతో కూడిన భావం జీవం లేని కంఠం

అవునండీ మీరు చెప్పినట్టు చేస్తే బావుంటుంది కాని పెద్దమ్మాయికి చెయ్యకుండా అని ఆ వాక్యం పూర్తి చేసేలోపుగానే మరో పిన్నిగారు అందుకుని అన్నట్టు మీ అమ్మాయికి పాతిక దాటిపోయినట్టున్నాయికదూ అని ఆరాలు

అప్పటికి సమాధానాలు చెప్పలేక సగం చచ్చివుంటుంది అమ్మ అయినా సమాధానం చెప్పాలి కనుక,

అవును అంటుంది బలహీనంగా

అదేమిటి పాతిక దాటడమేమిటి ముప్పయి రావటంలేదూ మా పెద్దదీ మీ పెద్దదీ ఒకీడువాళ్ళు కాదూ దాని పెద్ద కొడుక్కి నాలుగేళ్ళు వొస్తుంటేనూ అని మరో మహిళ దీర్ఘాలు తీసుకుంటూ మాట్లాడడం

మీరు మాట్లాడటం లేదు అన్న రాజు మాటలతో యీ లోకంలోకి వొచ్చిందామె

ఏం లేదండీ అని అంది రాజేశ్వరి

ఛాందసభావాలు గల మీ యింట్లో క్షమించండి యిలా అంటున్నందుకు యిలా ఆడపిల్లలు ముందుకు వొచ్చి తన కాళ్ళమీద నిలబడతాననేసరికి వ్యతిరేకత అనేది ఖచ్చితంగా వొస్తుంది వాళ్ళ భయం అసలు అమ్మాయి కేమిటవుతుందో నలుగురిలో తిరిగితే అని కాదు చుట్టుపక్కల 'వాళ్ళు ఎక్కడ నవ్విపోతారో అని పెళ్ళిళ్ళు చెయ్యలేక వుద్యోగాలు చేయిస్తున్నారు అని అంటారని భయం ఆ అమ్మాయి సంపాదిస్తే వుంటే మనసులో సంతోషంగానే వుంటుంది కాని ఖచ్చితంగా వొద్దని అనలేరు

మా కాలంలో యిలాంటి వెప్పుడైనా చూశామా ఆడవాళ్ళు వుద్యోగాలు చెయ్యడమంటే ఏమిటో ఎరగం అంటూ నన్నాయి నొక్కులు నొక్కుతారు

ప్రపంచంలో అన్ని దేశాలూ ఎంతో శాస్త్రీయంగా, వైజ్ఞానికంగా ముందుకు వెళుతున్న యీ రోజుల్లో యింకా యిలాంటి ఛాందసభావాలు, యిలాంటి మూఢ నమ్మకాలూ వున్నాయా అన్న ప్రశ్న వొస్తే, వున్నాయి అన్న సమాధానం చూసి ఆశ్చర్యపోవాల్సి వొస్తుంది

రాజేశ్వరికి ఎంతో సంతోషంగా వుంది రాజులాంటి వ్యక్తి తన చెల్లెలికి కాబోయే భర్త అని తెలిసి మరింత సంతోష పడింది యిన్నాళ్ళకి వొక్కరు తన సమస్యల్ని తన వైపు నుంచి ఆలోచించి, పరిష్కారం చెయ్యడానికి ప్రయత్నించడం ఆమె కెంతో మానసికానందాన్ని కలిగించింది ఆమెకు యిప్పుడు పెళ్ళివగైరాల గురించి ఆలోచన పోయింది ముందు తన కాళ్ళపై నిలబడడం ఎలా దానికి రాజులాంటి వ్యక్తి ఆధారం చూపిస్తుంటే అందుకోకుండా తిరస్కరించడం మూర్ఖత్వమే అవుతుంది అయినా తన కిప్పుడు ఏం వయస్సు మించిపోయిందని మొన్ననేకద పాతిక నిండుత మూర్ఖ, మూఢ నమ్మకాలు గల తన యింట్లో పదిహేనేళ్ళు రాకుండా వివాహాలు జరిగాయి కాబట్టి యీ రోజుల్లో కూడా అదే వయసుకి పెళ్ళి జరగాలనుకోవడమూ తప్పే, అలా జరగకపోతే బాధ పడడమూ తప్పే

రాజేశ్వరిలో వొస్తున్న మార్పుల్ని రాజు



## గడుసులోకం —బాబు




గమనిస్తున్నాడు ఆమె మొహంలో వెలుగునీ, కళ్ళల్లో కాంతినీ అతను గుర్తించేడు

రాజేశ్వరిగారూ మెల్లగా సంబోధించేడు

ఆమె యింకా మాట్లాడలేదు ఆమె తన ఆలోచనల ప్రవాహంలో కొట్టుకు పోతున్నది

అక్కా చేతులు కదుపుతూ పిలిచింది సుధ

ఊఁ అని చుట్టూ చూసి సిగ్గుపడింది

సారీ అందామె

ఫర్వాలేదుగాని యింతకూ మీరీ ప్రపోజల్‌కి పూర్తిగా వొప్పుకున్నట్లేనా? రాజు అడిగేడు

ఆ వొప్పుకున్నట్లే ' అంది రాజేశ్వరి

థేంక్యూ అక్కా సుద అంది ఆనందంగా

అయితే మీరొక పని చెయ్యండి రేపు వొచ్చే ఆదివారంనాడు మీ రిద్దరూ మా యింటికి వొచ్చెయ్యండి సుధా, నీకు మా యిల్లు తెలుసుగా అక్కడనుంచి మా బ్రాంచి మేనేజరు యింటికి వెళదాం ఆయన దగ్గర అవసరమ్మైన సలహాలూ అవీ తీసుకుదాం మర్నాడు పొద్దున్న బ్యాంక్‌కు వెళ్ళి అవసరమ్మైన అప్లికేషన్లూ అవీ యిచ్చి మిగతా పనులన్నీ పూర్తి చేద్దాం సరేనా యిద్దర్నీ ఉద్దేశించి అన్నాడు రాజు

అలాగే అన్నారిద్దరూ

మరి వెళదామా వాచీ చూసుకుంటూ అన్నాడు రాజు అప్పటికే సంజె చీకట్లు ముసురుకుంటున్నాయి

* * * * * * * *

ఆ ఆదివారంనాడు సుదా రాజేశ్వరి కలిసి రాజు యింటికి వెళ్ళేరు అక్కడినుంచి రాజు వాళ్ళ బ్రాంచి మేనేజరు యింటికి తీసుకు వెళ్ళేడు రాజేశ్వరి విషయం రాజు ముందుగా చెప్పి వుంచడంవలన ఆయన తప్పకుండా సహాయం చేస్తానని చెప్పి, ఎలా అప్లికేషను పెట్టాలో వివరంగా చెప్పి మర్నాడు బ్యాంక్‌కు వొచ్చి మిగతా విషయాలు పూర్తి చేసుకోవచ్చని చెప్పేడు ఆయన

రాజేశ్వరికి బెరకు బయం పోయినాయి తానొక వ్యక్తిననీ, తనకీ వొక ప్రత్యేకమయిన వ్యక్తిత్వం వుందనీ గుర్తించిందామె అందుకే ప్రతి విషయంలోనూ కుతూహలం కనబరచి క్షుణ్ణంగా' తెలుసుకుంది రాజు సుధ ఆశ్చర్యపోయేరు రాజేశ్వరిలో వొస్తున్న మార్పుల్ని చూసి ఆమె సరైన త్రోవలో పడినందుకు ఆనందించేరు కూడా

* * * * * * * *

ఓ మంచిరోజునాడు అన్నపూర్ణా టైప్ యినిస్టిట్యూట్ ప్రారంబించబడింది ఆ యినిస్టిట్యూట్‌కి రాజేశ్వరి తల్లి పేరు పెట్టబడింది ముందు వొద్దని నసిగినా తర్వాత వొప్పుకోక తప్పలేదు ఆవిడకి అలాగే రాజేశ్వరి తల్లీ దండ్రీ ముందు రామని బెట్టు చేసినా వాళ్ళంతట వాళ్ళే తర్వాత మనసు మార్చుకొని ప్రారంబోత్సవ సమయానికి వొచ్చేరు

ప్రజలలో పబ్లిసిటీ పెరగడానికి రాజు వో తెలివయిన పని చేసేడు ఆ యినిస్టిట్యూట్ ప్రారంబోత్సవానికి కలక్టర్‌ని బ్రాంచ్ మేనేజర్ని పిలిచి అట్టహాసంగా చేయించేడు

* * * * * * * *

సుదకి యిదంతా ఒక కలగా ఉంది అసలు జరుగుతుందా అనుకున్నది జరగడం ఆమెకు ఎంతో ఆశ్చర్యం కలిగించింది ఆమెకు ముఖ్యంగా ఆనందం కలిగించిన విషయ మేమిటంటే రాజేశ్వరి జీవితం ఒక దారిన పడటం యిప్పుడీ యినిస్టిట్యూట్ మరికాస్త పెద్దదై ఆదాయం పెరిగినప్పుడు దానివలన ఒక జీవితం బాగుపడుతుందన్న విషయం ఆమెకు ఎంతో సంతృప్తిని కలిగించింది

రాజేశ్వరి కళ్ళల్లో కనబడే వెలుగు ఆమె జీవితానికే ఒక వెలుగు అనిపించిం దామెకు

ఆ కొడిగట్టిన దీపంలాంటి రాజేశ్వరిలో చమురులాంటి ధైర్యాన్ని పోసి, వెలిగించిన రాజుపట్ల ఆమె మనసు కృతజ్ఞతా బావంతో నిండిపోయింది

ప్రారంబోత్సవ కార్యక్రమం ముగిసింది వొచ్చిన ఆహుతులందరూ వెళ్ళిపోయారు ఆ గదిలో మిగిలింది రాజేశ్వరి సుధ, రాజు

ఏమండీ రాజేశ్వరి పిలిచింది

ఓ మూలగా కూర్చుని అప్పటివరకు అయిన ఖర్చుల లిస్టులు చూస్తున్న రాజు చేస్తున్న పని ఆపి ఆమె వైపు చూసేడు ప్రశ్నార్ధకంగా ఏం కావాలి అన్నట్టు

మీకు నా కృతజ్ఞత ఎలా చెప్పాలో తెలియటం లేదు "ఆమె యింకా ఏదో చెప్పబోతుంటగానే ఆమె గొంతు పూడుకుపోయింది కృతజ్ఞతా బారంతో ఆమె కన్నుల్లో ఆనందాశ్రువులు

నో ఆమెను వారిస్తూ అన్నాడు యిందులో నేను ప్రత్యేకంగా చేసినది ఏమీ లేదు అవకాశాలు మనకి ఎన్నో వున్నాయి కాని అవి మనకి అందుబాటులోనే వుంటాయని తెలియక మనము అవకాశాల్ని పోగొట్టుకుంటున్నాం అయితే నేను చేసినదల్లా వొక్కటే ఆర్థికంగా మానసికంగా ఎదగడానికి అవసరమ్మైన నిచ్చెనలాంటి అవకాశాన్ని మీ అందుబాటులోకి తీసుకురావటం అది ఎక్కడానికి మీరు వెంటనే కుతూహలం కనబరచటం యిక ఆ నిచ్చెన మీరు ఎక్కేరు మొదటి మెట్టుమీద వున్నారు మీ అబివృద్ధి అంత తొందర్లోనే కనిపిస్తుంది ఓకే అని ఆగి "ఓ ముఖ్య విషయంలో మీ సహాయం కావాలి

చెప్పండి అంది రాజేశ్వరి

సుదతో నా వివాహం జరగటంలో

తప్పకుండా చేస్తాను అంది రాజేశ్వరి

థేంక్యూ అని సుద వైపు తిరిగి చిలిపిగా నవ్వేడు రాజు

సుద అందంగా సిగ్గుపడింది □

# స్థితప్రజ్ఞుడు

మంగళపల్లి రవీంద్రకుమార్

"ఎస్ కమిన్

ఎదురుగా భుజాన కొడుకుని ఎత్తుకుని నిల్చుంది ఓ స్త్రీ బాగా మర్యాదస్తుల కుటుంబానికి చెందిన వ్యక్తి అయివుండాలి కారులో వచ్చింది ఖరీదయిన చీరలో వుంది కళకళలాడే ముఖం ముఖానికి నిండుతనం తెచ్చే కుంకుమ బొట్టు నుదుటి నిండా చెమట భుజంమీద బిడ్డడు మొహం వ్రేలాడేసి వున్నాడు ఆదుర్దాగా ఏదో చెప్పబోయింది కాని దుఃఖంతో గొంతు పూడుకుపోయింది

చెప్పమ్మా- ఏం కావాలి? అన్నారు డాక్టర్ రాఘవ

నేను అశోక్‌కుమార్‌గారి భార్యనండి మా అబ్బాయికి మూడ్రోజుల నుండి జ్వరం డాక్టర్‌గారూ! కొద్దిగా జలుబు కూడావుంది గొంతు నొప్పని ఏడుస్తుంటాడు" అంటూ గాభరాగా చెప్పుకు పోతున్నది ఆ ఇల్లాలు

"ఇలా తీసుకురామ్మా చూడనీ " అంటూ బిడ్డని తీసుకుని ఎగ్జామిన్ చేసే టేబుల్‌మీద పడుకోబెట్టాడు డా రాఘవ

"జ్వరం ఎన్ని రోజుల నుంచి?" ప్రశ్నించాడు డాక్టర్

నాల్రోజులనుంచి. "దుఃఖం ఆగట్లేదు ఆ తల్లికి

'కంగారుపడకమ్మా! నర్స్ ఆ బ్యాటరీ లైట్ అందుకో "

పిల్లాడి వయస్సెంతమ్మా?'

ఐదేళ్ళండి "

పరీక్ష చెయ్యటం పూర్తయింది డాక్టర్ రాఘవ స్టెతస్కోప్ ప్రక్కన పెడుతూ ఆ తల్లికి చెప్పాడు "పిల్లాడికి డిఫ్తీరియా వచ్చింది"

"అంటే ' అని ఆందోళనగా అడిగింది ఆమె

కంఠ సర్పి ఇది వచ్చినప్పుడు శ్వాసనాళంలో ఓ అడ్డుపొర ఏర్పడుతుంది దానిమూలాన శ్వాస అడ్డం కష్టమవుతుంది జ్వరం, గొంతు నొప్పి, ఆయాసం ఈ రోగం యొక్క ముఖ్య లక్షణాలు డిఫ్తీరియాకి ఇ ఎన్ టి స్పెషలిస్టు దగ్గరకు తీసుకెళ్ళటం మంచిది" అన్నాడు రాఘవ

అశోక్‌కుమార్ పెద్ద బిజినెస్‌మేగ్నెట్ అతగాడికి సిమెంట్ కంపెనీల్లో, ఎరువుల కంపెనీలలో, మందుల కంపెనీలలో భాగస్వామ్యంవుంది ఇంకా యివికాకుండా ఊళ్ళో మూడు సినిమా థియేటర్లు వున్నాయి

ఆయన ఊళ్ళో లేరండి ఏదో పనిమీద హైదరాబాద్ వెళ్ళారు ఫోన్ చేయించాను కాని ఆయన దొరకలేదు ఈ ఊళ్ళో మీరు పేరుమోసిన సర్జన్ అని మీదగ్గరకి పరిగెత్తుకుంటూ వచ్చాను అంది ఆ తల్లి



నేను జనరల్ సర్జన్‌ని ఇది ఇ ఎన్ టి స్పెషలిస్ట్ ఎవరైనా ట్రీట్ చేయవలసిన కేసు అంటూ మీరేం కంగారుపడొద్దు ఇ ఎన్ టి స్పెషలిస్టు డాక్టర్ గోకర్ణరావ్ నా ప్రాణమిత్రుడు ఇప్పుడే ఫోన్‌చేసి రప్పిస్తా మీరలా సోఫాలో కూర్చోండి

త్వరగా చెయ్యండిబాబూ నా బిడ్డని బ్రతికించండి

డా రాఘవ ఫోన్‌రిసీవర్ ఎత్తి డయల్‌చేశాడు

రాఘవ మస్తిష్కంలో ఏవేవో ఆలోచనలు జ్ఞాపకాల తరంగాలు అశోక్‌కుమార్ ప్రఖ్యాత వ్యాపారవేత్త తను గవర్నమెంట్ ఆస్పత్రిలో డాక్టర్ దొంగమందులు ఆస్పత్రికి అంటగట్ట బోయాడు తను ససేమిరా కుదర దన్నాడు లంచం యివ్వబోయాడు ఇంకా రకరకాల ఆశలు చూపించాడు అయినా తను చలించలేదు పూర్వం తన ప్లేస్‌లో పనిచేసిన డాక్టర్, అశోక్‌కుమార్‌ని ఎప్పుడూ నిరాశ పరచలేదట అతడితో ఎప్పుడూ మంచి సంబంధాలే కలిగివుండేవాడట కానీ తనొచ్చాకే అశోక్‌కుమార్ మందుల కంపెనీకి బిజినెస్ పడిపోయింది అందుకే నయానా బయానాతనని లొంగదీసుకోవాలని ప్రయత్నించాడు కానీ తను కొండలా అచంచలంగా వుండిపోయాడు అశోక్‌కుమార్ కుతకుతలాడి పోయాడు ఓ నీచమైన పన్నాగం పన్నాడు ఒక పేషెంట్ తన భార్యకి అపరేషన్ చెయ్యాలనీ ఆవిడకి స్పెషల్‌వార్డ్ ఎలాట్‌చేసి అన్నివిదాల సహాయం చెయ్యమనీ, రెండొందలు జేబులో పెట్టబోయాడు తనొద్దంటున్నా వినిపించుకోకుండా చేతిలో పెట్టుండటం సరిగ్గా అదే సమయంలో అవినీతి నిరోధకశాఖ వారు ప్రత్యక్షమవటం తనని అరెస్టు చేయటం తను సస్పెండ్ అయిపోవటం అన్నీ సినిమా రీలులా అతని కళ్ళముందు కదలి పోతున్నాయి

అవతలి నుంచి నర్స్ మాట్లాడుతోంది హలో

నేను డాక్టర్ రాఘవను మాట్లాడుతున్నా డా గోకర్ణరావ్ వున్నారా?

లేరండీ ఏదో కేసు చూట్టానికి రాజమండ్రి వెళ్ళారు రేపటిగ్గానీ రారు

ఫోన్‌పెట్టేశాడు రాఘవ

అశోక్‌కుమార్ తను సస్పెండ్ అయ్యేదాకా నిద్రపోలేదు తన హోదా పరపతీ అంతా వుపయోగించి డిస్మిస్ కూడ చేయించాడు మరొకడయితే కృంగిపోయేవాడే కానీ తను మాత్రం

డాక్టర్ బిడ్డ మొహం నీలిరంగుగా మారుతోంది శ్వాస అందట్లేదు ఎగశ్వాసతో డొక్కలు లోపలికెళ్ళి పోతున్నాయి– మీ కాళ్ళమీద పడతాను మీరే రక్షించాలి

ఉండమ్మా! కంగారు పడకు ఓ ఇంజక్షన్ చేశాడు

ఆ వూర్లో వున్న మరో ఇ ఎన్ టి స్పెషలిస్ట్ డా నీలకంఠరావ్ అతనేవన్నా దొరుకుతాడేమోనని ఫోన్ చేశాడు అతను వాళ్ళమ్మగారికి సీరియస్‌గా వుందని హైదరాబాద్ వెళ్ళాట్ట ఏం చెయ్యాలి చెప్మా కాకినాడలో డాక్టర్ కోదండపాణి వున్నారు ఆయన రాగలుగుతే కుర్రాడు బతికినట్టే సూర్యం నువ్వు కారులో కాకినాడ వెళ్ళి డా కోదండపాణిగారిని నేపిలుచుకు రమ్మన్నానని చెప్పి ఉన్నపళంగా తీసుకు రావాలి రానూపోనూ పదహారుమైళ్ళు అఘమేఘాల మీద రావాలి మన డ్రైవరికి చెప్పు "

"యస్ సర్ ఇప్పుడే వెళ్తున్నాను సూర్యం కాంపౌండర్ విశ్వాసపాత్రుడు ఏపనైనా చురుకుగా చేస్తాడు

అశోక్‌కుమార్!! ఎంత దెబ్బకొట్టావయ్యా మరొకడవుతే తట్టుకోలేక పోయువాడే లంచగొండినన్న ముద్రపడ్డాక తలెత్తుకు తిరగ్గలడా తను తిరిగి నిలబడగలడా? అశోక్‌కుమార్ లాంటివాడిని కాదని బతగ్గలడా? అయినా తను ఆ పని చేయగలిగాడు ప్రైవేట్




ప్రాక్టీసు పెట్టుకున్నాడు పోయిన ఉద్యోగం గురించి ఏ మాత్రం వర్రీ అవలేదు చూస్తుండగానే తన దశ తిరిగింది ప్రాక్టీసు విపరీతంగా పెరిగింది! రెండు గదులు అద్దెకు తీసుకుని తను ప్రాక్టీసు మొదలు పెట్టాడు ఇప్పుడొ తన హాస్పటల్ పెద్ద బవంతి''' ఆ హాస్పటల్ ప్రక్కనే చక్కని బవంతి కట్టుకున్నాడు తను ఉండటానికి ఇప్పుడందరూ తనకి గౌరవం ఇస్తున్నారు అడుగులకి మడుగు లొత్తుతున్నారు కాలం కలసి రావటం అంటే అదే కామోసు'' మనిషి రాణించటమంటే ఇదే కామోసు''

డాక్టర్‌గారూ కుర్రవాడు తలవాల్చేశాడండీ నాకేదో భయంగా వుందండి

డాక్టర్ కోదండపాణికోసం కబురుపెట్టాను ఆయనీపాటికి వస్తుంటారు మీరేం కంగారు పడకండి మీ కుర్రాడికేం భయంలేదు

అశోక్‌కుమార్'' ఎంత దెబ్బ కొట్టావ్'' నా అవసరం నీ కింక ఉండదనుకొన్నావ్‌కదూ మరి యిప్పుడేమయింది నీ గతి?? నీ ఒక్కగా నొక్క కొడుకు చావు బ్రతుకుల్లో నా హాస్పిటల్లో వున్నాడు నా దయా దాక్షిణ్యాలమీద ఆధారపడి వున్నాడు ఇప్పుడేమంటావ్?

డాక్టర్‌గారూ''' దయచేసి మీరే అపరేషన్ చెయ్యండి నాకేదో బయంగా వుంది మా అబ్బాయి ప్రాణం దక్కించండి మీ కెంత డబ్బు కావాలంటే అంత ఇస్తాం మిమ్మల్ని దేముడికిమల్లే పూజించుకొంటాం

మళ్ళీ టెస్ట్ చేశాడు రాఘవ లాభంలేదు ఇంకో క్షణంవృధా కాకూడదు వృధా చేస్తే బిడ్డ దక్కడు

నర్స్ కుర్రాణ్ణి అపరేషన్‌కి రెడీ చెయ్యి వెంటనే ట్రకియాటమీ అపరేషన్ చెయ్యాలి అని ఆర్డరు జారీ చేశాడు డాక్టర్ రాఘవ

డా కొదండపాణి ఇంకా రాలేదేవిటి చెప్మా కొంపదీసి ఆయనకీ వీలుకాలేదా? ఇప్పుడేం చెయ్యాలి ఇంకమాత్రం జాప్యం చేసినా కుర్రాడి ప్రాణానికే ముప్పువస్తుంది అపకారికి ఉపకారము నెపమెన్నక చేయువాడు అంతా రెడీ చేసింది నర్స్ చాల ఎఫిషియంట్ తప్పదు తనే రిస్కు తీసుకోవాలి అంతా సవ్యంగా జరిగితే ఫర్వాలేదు లేకపోతే అశోక్‌కుమార్'' నీ ఒక్కగా నొక్క కొడుకుని చంపాననీ, కావాలని చంపాననీ కేసు పెడతావ్ కదూ

* * * * * * *

డాక్టర్‌గారూ బాబుకెలా వుందండీ? ఫర్వాలేధాండీ? తల్లి ఆవేదన ఆదుర్దా ఆ మాటల్లో ప్రస్ఫుటిస్తున్నాయి

ఏం ఫర్వాలేదమ్మా బగవంతుని దయవల్ల అంతా సవ్యంగానే జరిగింది'' మీ బాబుకేం పర్వాలేదు లోపలికెళ్ళి చూడండి మీ బాబుని ఎవరూ? మీరెవరూ! కాళ్ళమీద పడుతున్నా రేమిటి?! లేవండి లేవండి ఓహ్ అశోక్‌కుమార్‌గారా ? ఎప్పుడు వచ్చారు? మీ అబ్బాయికేం ఫర్వాలేదు హి ఈజ్ ఆల్‌రైట్ గాడ్ ఈజ్ గ్రేట్

డాక్టర్‌గారూ మీరు మనుషులుకారు దేముడు అశోక్‌కుమార్ రాఘవ చేతులు పట్టుకుని చెమ్మగిల్లిన కళ్ళతో ఆ బావాన్ని తెలియజేస్తున్నాడు □

సీరియల్

(గత సంచిక తరువాయి)

ఆ రోజు షావుకారు రాంకోటి వేసవి మధ్యాహ్నపు సూర్యుడిలా బగబగలాడేడు- అల్ప ప్రాణుల ముందు రాక్షస రాజులా తైమని గెంతు వేశాడు ఐదడుగుల మనిషీ ముఖంలో నే విశ్వరూపాన్ని చూపించేడు-

రైతు లందరూ బిక్కచచ్చి వూర్కున్నారు- రాంకోటి నారూపంలో ఎప్పుడూ చూడని పంతులుగారు కూడ కాస్త జంకి మాట ముకిదుకు రానీ లేదు-

అతివృష్టీ అనావృష్టీ, కరువులూ వరదలూ దేశంలోని నష్టాలూ కష్టాలూ అన్నీ మీకే వచ్చినట్టు ఏడిస్తే యిక మీకంతేసి అప్పులిచ్చిన మేమెట్లా ఏడవాలి? మేం చేస్తున్న యీ యాపారం కూడ నాలుగు డబ్బులు కోసమేగా- పోనీ బీద రైతోళ్ళు మేమియ్యకపోతే అప్పులిచ్చి యింకెవ రాదుకుంటారు అని జాలి దలిస్తే రోజులు కావ్రా- పంట పండలేదని ఒకడూ తెగులు బట్టిందని యింకొకడూ వర్షాల్లేవని కొన్నాళ్ళూ వరదలని కొన్నేళ్ళూ తీరా పంట చేతికొచ్చే సర్కి యీ కోవ(టి ముండాకొడుక్కి చెల్లు జేసే దేమిటని ఫేక్టరీకి తోల్తాడు- డబ్బుల్తీసుకుని జల్సాలు చేస్తారు- మరి మేమూ మా యాపారం ఎందల కలవాల? రేప్పొద్దున్న మా పిల్లలు ఎందల అడుక్కోవాల? అంచేత ఇన్నాళ్ళూ కక్కుర్తిపడో జాలిపడో తిరగ కట్టక పోయినా అప్పులిచ్చేను- ఇక కుదర్దు- మీరు నష్టపోతే మిమ్మల్నాదుకుందికి మీరు గెలిపించి గద్దెకెక్కించిన మీ ప్రభుత్వ ముంది- మధ్య నేనెవణ్ని- రేప్పొద్దున్న నా సొమ్ములు నా కొసూలుగాక అడుక్కుతింటే నన్ను చూసే దెవరు? అప్పులిచ్చి వొడ్డీలు గుంజే నా కొడుకురా అని నలుగురూ నా ముఖాన వూస్తారేగాని నన్ను జాలిదల్చినోడు కనిపించడు- అంచేత నేనూ జాలిపడ దల్చుకోలేదు- 76 ఏళ్టవల్ల కొందరిప్పటికే అప్పు లెగేశారు- లాబాలు గూబ ల్లోకి పోయాయి నాకు-

జరిగిన కథ – 4 సంతానం కలగ బోతున్నదని తెలిసిన సంగమయ్య ఆర్థిక స్థితి మెరుగుదల కోసం దేవుడిని ఆశ్రయిస్తాడు దేవుడి సలహాతో చెరుకు తోటలు స్వయంగా వెయ్యడంతోపాటు భాగానికి కూడా చేస్తుంటాడు. సంగమయ్యకు కొడుకు పుడతాడు రుణంతో సంగమయ్య కొనుక్కున్న పాడిగేదె, ఎద్దులు, ఆస్తి, పంటా సమస్తం వరదల్లో కొట్టుకు పోతాయి. మళ్ళీ రుణం కోసం కరణాన్ని ప్రాధేయపడతారు దేవుడు కరణం మోసాన్ని అధికారులకు తెలియ జేసి పట్టించుతాడు.

అలుపు తీర్చుకుందికి ఆగేడు రాంకోటి- ఎవ్వరూ ఏం మాట్లాడ లేదు జడ్జీగారి ముందు నిందితుల్లా తలలు వేలాడేసుకుని కూర్చున్నారు-

తాము షావుకారు దగ్గర మదుపులు తీసుకున్నదీ నిజమే- తీసుకున్న సొమ్ముకు చెరుకు తోలి జమ చేయని మాటా నిజమే- ఏ యేటి కాయేడు బాకీ వుంటూండగనే కొత్త అప్పులు చేస్తున్నదీ నిజమే- ఎవరూ కాదన్లేరు-

అయితే మాకాని నష్ట మొచ్చేసింది- వరదలు పంటల్ని ముంచేసేయి- అయితే గవర్నమెంటు సాయమంతా ఉద్యోగస్తుల్ని మేపడానికి తాము పొట్టకి తిండానికే సరిపోయింది- కష్టపడి ఒకరికొకరు సాయం చేసుకుని భూములన్నీ కాస్త బాగా చేసుకున్నారు- అయితే మళ్ళీ ఏంచెయ్యడానికి మదుపేది? ఎటుదిరిగి షావుకారే దిక్కయ్యాడు- గంపెడాశతో వచ్చిన రైతులకు రాంకోటి జవాబు వినేసర్కి గుండె నీరై పోయింది- కళ్ళు పచ్చబారి మరో దిక్కు కానరాలేదు-

బొత్తిగా సన్నకారు రైతులు రాంకోటి రూపం చూసీ మాటల్విసీ నిరాశపడి తిరుగుముఖం పట్టేరు- అప్పటికే వాళ్ళకున్న కొద్ది భూమి రాంకోటి దగ్గరే వుంది-'ఈ సమయంలో ఏమాత్రం అటూ యిటూ అయినా అంతా తన అప్పు కింద కలిపేసుకో గల్డు- అందుకే మరో మారు మంచి రోజు చూసి రాంకోటిని బతిమాలొచ్చు అనుకున్నారు-

కాస్త మోతుబర్లు మాత్రం శెట్టి వూరికే యిస్తున్నాడేటి అని అడగ్గల ధైర్యవంతులూ మాత్రం ఆ మాటలు తమను గురించి కాదులే అన్నట్టు అక్కడే కూర్చుండి పోయారు-

అయితే వాళ్ళ వూహ నిజమైంది-

వాళ్ళ ఆశలే ఫలించాయి-

అంత వుగ్రుడైపోయిన రాంకోటి అక్కడి జనం పల్చబడేసర్కి మంచుబొమ్మలా చల్లబడి పోయాడు ఆనక అంత కచ్చితంగ వుండకపోతె నేను మాత్రం యాపార మెలా జేయాలి చెప్పండి అన్నాడు-

మోతుబర్లకి వాళ్ళడిగింది కాకుండా తనకు తోచింది యిచ్చేడు అయితే అప్పుడే చెప్పేడు ఈ మారు తీర్చలేని వారెవరైనా వుండిపోతే వాళ్ళ పట్టాలు తను స్వాధీన పరుచుకోక తప్పదని-

అందరూ తల లూపేర్సరు-

ఊకొట్టి వొచ్చేసేరు-

"ఎప్పుడూ వుండే రాంకోటి బెదిరింపులే- తాటాకు చప్పుళ్ళే అనుకున్నారు

* * * * *



రాంకోటి అన్నంత పనీ చేస్తాడని ఎవరూ అనుకోలేదు- తన మనుషుల్ని తీసుకుని రాంకోటి పందోడిపాలెంలోని సన్న రైతుల భూముల్ని స్వాధీన పర్చుకోడాని కొచ్చేసర్కి వాళ్ళు ఆశ్చర్యపోయారు- ఆనక గుండెలు బాదుకున్నారు- మేమేం ఎగ్గొట్టే వాళ్ళమా వూరొదిలి వెళ్ళిపోయే వాళ్ళమా, భూమినీ మిమ్మల్నీ నమ్ముకుని బతికేవాళ్ళం- ఈ మారు కనికరించండి అంటూ కాళ్ళా వేళ్ళా పడ్డారు-

కానీ రాంకోటి నరసింహావతారం శాంతించ లేదు

ఈ వార్త వూరంతా గుప్పుమంది- వయసు మళ్ళిన వాళ్ళంతా గుసగుస లాడుకున్నారు- కానిరోజులు దాపరించేయను కున్నారు- కష్టపడేవోడి కంచం లాక్కోడం అన్యాయ మన్నారు

అయితే అదే సమయంలో యువకులూ ధైర్యవంతులూ కూడ ఒకచోట చేరి చర్చించారు తప్పెవరిదన్న ప్రశ్న వచ్చింది- వడ్డీతో సహా చెల్లుజేసే పద్ధతిపై అప్పు దీసుకున్న రైతుదీ తప్పుకాదు- వున్న డబ్బును పెంచుకో జూసిన రాంకోటిది తప్పుకాదు- మధ్యలో రైతుల పొట్టను కొట్టిన ప్రకృతిది తప్పు- దాన్ని ఆసరా చూసుకుని దురాశగా ఆస్తుల్ని కలుపుకో జూస్తున్న శెట్టిది తప్పు- మౌనంగా వూర్కుంటే యీ తప్పును సమర్థించినట్టే- రాంకోటి చర్యను ప్రతిఘటించాల్సిందే-

అంతా ఏక కంఠంతో ఒకే నిర్ణయాని కొచ్చేరు-

అంతే! వెదురు కర్రల్ని చేతబూని ముందుకు అడుగు వేశారు- క్రోధాగ్ని వారిలో వుప్పెనలా ముంచు కురికింది-

రాంకోటికీ అతడి మనుషులకీ అడుగు ముందుకు పడలేదు-

ఆ జన ప్రవాహానికి ఎదురు నిలవడం వారివల్ల కాకపోయింది-

*   *   *   *   *

తెల్లారేసర్కి సంగమయ్య రావడం దేవుడికి ఆశ్చర్యాన్ని కలిగించింది-

ఏంటికత? అన్నాడు-

షావుకారు కబురెట్టేడు

దేవుడి కంతా అర్థమైంది

పందోరిపాలెంలో ఆ రోజు జరిగిన పరాభవానికి వుగ్రుడై పోతున్నాడు రాంకోటి- తన దృష్టిలో బీద రైతు లనుకున్న వారి నందర్నీ పిలిపించి అదిలించో బెదిరించో తన బాకీని చెల్లేయమని అడుగుతున్నాడు

ఆ రకమైన పిలుపే యిది అనుకున్నాడు

ఏం జేయాల మరి అడిగేడు సంగమయ్య

ఏముందీ- వెళ్ళి ఏమంటాడో ఏందమే- బెదిరించినంత మాత్రాన ఆకాశమ్మించి డబ్బు రాలవుగా'

నువ్వుకూడ వస్తే కాస్తంత ధైర్యం నసిగేడు సంగమయ్య

నవ్వి సర్లే వొస్తాలే అన్నాడు-

అనుకున్నట్టుగానే ఆ రోజు షావుకారు సంగమయ్యను బాకీ అంతా వున్నప ళంగా కట్టేయమని, లేకుంటే మర్యాద దక్కదనీ నార్నింగిచ్చేడు

సంగమయ్య చెప్పవలసిందేదో చెప్పేడు అడగవలసిన గడువు అడిగేడు కానీ రాంకోటి ససేమిరా ఒప్పుకోలేదు తలే తాకట్టు పెడతావో, పొలమే అమ్మేస్తావో లేదా వస్తువులే కుదవ బెడతావో నాకు తెలీదు- నా బాకీ చెల్లించాల్సిందే - అని కచ్చితంగా చెప్పేశాడు.

ఒక్కోళ్ళనలా బెదర గొట్టేస్తే ఎలా బాబూ- సంగమయ్య డబ్బులేనోడే గాని నీతి లేనోడు గాదు- ఎప్పటికన్నా మీబాకీ వడ్డీతో సహా చెల్లేయగలడని నాను హామీ అన్నాడు దేవుడు కల్పించుకుని-

"హామీలు పనికిరావు గానీ అంత నమ్మకమైన వాడైతే నువ్వు కట్టి తర్వాత వసూలు చేసుకో అతగాని నుండి అన్నాడు రాంకోటి

ఆపాటి నాకాడే వుంటే యీ మాట పడనిస్తునా ఏనాడో కట్టేవోణ్ణి

మాటా మాటా పెరిగింది- ఇక లాబం లేదనుకున్నాడు సంగమయ్య- గొప్పోళ్ళతో తగూలు లాబకరం కాదని అతగాడికి తెల్సు-

మాటలెందుకు బాబయ్యా- మీకాడ డబ్బు తీర్చడానికే వుచ్చుకున్నాం- తీరుస్తాము- మీ రిప్పుడుగదా ఎచ్చరించేరు- ఎలాగోలా మీ బాకీ తీర్చే యత్నంలో నే వుంటా- నాల్రోజులు కాయండి అన్నాడు-

అలా అన్నావ్ బావుంది- ఆ మాట ముందే చెబితే నేనూరుకునే వాడినేగా- పెద్ద అర్చేవాళ్ళా యీ దేవుడెందుకు కలుగ జేసుకుంటాడు మధ్యలో - అసలు యిలాంటి మధ్య దళారీల వల్లనేనోయ్ యీ రైతులు పాడై పోతున్నది

దేవుడేదో అనబోయాడు- కానీ సంగమయ్య అతన్ని బతిమాలి బయటకు తీసుకొచ్చేశాడు

*   *   *   *   *

## తీపిగుర్తులు

అప్పటికింకాతెల్లవారలేదు

సగానికి పైగా హరించుకు పోయిన చంద్రుడు తాలూకు గుడ్డి వెలుగు మసగమసగ్గా వుంది–

లోకమంతా నిద్రాణమై  నిశ్శబ్దంగా వుంది

మామూలు ప్రకారం మెలుకువ వచ్చేసింది దేవుడికి లేచి, బయటకొచ్చి పాంకోళ్ళు తొడుక్కుని కర్ర తీసుకుని బయల్దేరేడు– కాలకృత్యాలు తీర్చుకుని, పశువుల కొట్టంలో పశువులకు కావల్సింది చూసి పొలానికి బయల్దేరే వేళకి తెల్లగా తెల్లారుతుంది–

మంచు కురిసినా, పిడుగులు పడినా అలా మొదలవ్వాల్సిందే రోజు–

తాటిపెండి దాటి చెరువుగట్టు ఎక్కబోతున్న దేవుడికి ఆకుల కదలిక విచిత్రంగా విన్పించింది– ఏవేళ విన్నా ఆ ఆకుల సవ్వడిలో ఆనందమే గాని బయం కన్పించదు–

ఇక్కడే పుట్టాడు  ఇక్కడే పెరిగాడు  ఇక్కడే రైతుగా కష్టించి పంట పండిస్తున్నాడు– స్వార్థం ఒక ప్రక్కవున్నా, మరో ప్రక్క దేశ సౌభాగ్యానికి కృషి చేస్తున్నాడు– ఒక విధంగా ఈ వూరు తనది– ఇక్కడి మట్టికీ, గాలికీ, నీటికీ, తనకూ అవినాభావ సంబంధముంది–

రేపొద్దున్న యీ మట్టిలోనే కలిసి పోతాడు తను– ఉన్నన్నాళ్ళు తను ఎవరికీ అన్యాయం చెయ్యడు– ఇంతవరకూ చెయ్యలేదు– ఇకపై చేయడు కూడ కానీ న్యాయాన్ని వెనకేసు కొస్తున్న కొద్దీ తనకు శత్రువులు అధికమౌతూన్నారు– చూస్తూ అన్యాయాన్నెలా సమర్థించాలి?

మనిషి వుండిపోడు– మంచి మాట వుండిపోతుందీ భూమ్మీద–

మళ్ళీ చప్పుడైంది– చుట్టూ చూశాడు దేవుడు–

ఇక్కడి పురుగూ పుట్రా, గాలీ ధూళీ తననేమీ చెయ్యలేవు–

ఆలోచనల్లోనే చెరువుగట్టు దిగేడు– ఎక్కడో నక్క అరుపు– ఆ వెంటనే దగ్గరగా అలికిడి–

తల తిప్పి చూశాడు– చుట్టూ నల్లని ముసుగుల్లో మానవాకారాలు–

అంతే! తలపై వరసగా కర్రలు పడ్డాయి–

దేవుడికింకేం కన్పించలేదు రెక్కలు తెగిన జటాయువులా నేల కూలిందతని శరీరం–

తెల్లగా తెల్లారేసరికి చెరువు గట్టు నిండా వూరి జనం–

ఏ విషపురుగో కరిస్తే తూలి బండమీద పడుంటాడు– బుర్ర బద్దలైంద ని కొందరంటే–

ఏ విషపురుగూ కాదు– మనిషిని మించిన విషపురుగేటుంటుందీ– ఇది ఆళ్ళ పనే– న్యాయానికి రోజులు కావివి అని కొందరు–

తప్పతాగి రాత్తిళ్ళు నడిస్తే ఏటవుతుంది అని యింకో అపవాదు వేశారు కరణం మనుషులు–

ఏమైనా పంచాయితీ జరిపించా లన్నారు కొందరు–

పంచాయితీలో తేలే విషయం కాదిది– పోలీసు రిపోర్టివ్వాల్సిందే– కేసు నడిస్తేనే గాని దోషులు తేలరు అన్నారింకొందరు–

అప్పటికి మున్సబు మధ్యలో కొచ్చాడు-

అలా అన్న దెవరో ముందుకు రమ్మన్నాడు– పోలీసులొస్తే సాక్ష్యం ఎవరెవరు చెబుతారో ముందుకు రమ్మన్నాడు– అంతే! ఒక్కరు అడుగు ముందు కెయ్యలేదు–

కేసు పోలీసుల కప్పగిస్తే పాత తగూలన్నీ బయట కొస్తాయి లేనిపోనోళ్ళంతా యిరుక్కుంటారు కోర్టులకి తిరగాలి– సాక్ష్యాలు చెప్పాల అందుకు మీకు సమ్మతమైతే అలాగే కానిద్దాం అన్నాడు

పోయిన పేణం ఎలాగూ పోయింది– దేవుడు లాంటి మనిషి పోయాక అదేం జరిగితే ఎవరిక్కావాల' ఎవుళ్ళ పాపాన ఆళ్ళే పోతారు' అన్నాడో ముసలయ్య

ఆ మధ్యాహ్నమే దేవుడి కట్టె పిడికెడు బుగ్గయి పోయింది–

పేద రైతులకు దన్నుగా ఆసరాగా మాటసాయం జేస్తున్నాడని ఆ కరణమూ శెట్టి కలిసే చేయించారీ పని అని గుసగుసలు మొదలయ్యాయి– దేవుడు ఆత్మారి పూర్తైన పందో డిపాలెంలో శెట్టి అవమానంపాలౌడం కూడ వారి అనుమానానికి ఆస్కార మైంది– ఎందరేమనుకున్నా ఒక్క మాటన్నా మాట్లాడకుండా పుట్టెడు దుఃఖాన్ని మింగి వూరుకున్నది సంగమయ్య ఒక్కడే!

*   *   *   *   *

సుఖం, దుఃఖం యీ రెండూ అందరి జీవితాలలోనూ సంక్రమించేవే– ఈ రెంటిలో ఏ ఒక్కటీ ఏ ఒక్కరి జీవితంలోనూ కలకాలం నిలిచిపోయేవి కావు–

చీకటి వెనుక వచ్చే వేకువలా దుఃఖం వెనుక సుఖమూ శాంతీ లభిస్తాయనే ఆశే మనిషి మనుగడకు దారి చూపే దౌతుంది–

మనిషి అస్థిరం– మంచి స్థిరం ఎంతటి గొప్ప మనిషి పోయినా ఆ దుఃఖం కాలం తెచ్చే మరపు లో క్రమేణా మాయమైపోక తప్పదు–

నోరులేని అమాయక రైతులను వెనకేసు కొచ్చి ధైర్యంగా, ఆత్మ స్థైర్యంతో మాటలాడే దేవుడు చావు కూడ అతి సహజంగానే మరచి పోయారంతా– కొన్నాళ్ళా లోటు కొందరికి కన్పించింది– అయితే ఆ లోటు ఆటు దేవుడి కుటుంబానికీ యిటు సంగమయ్యకీ తీర్చలేనిదే అయింది

ఆలోచనలతోనే చెట్టు క్రిందకు చేరి కాస్సేపు నీడన విశ్రమించాడు సంగమయ్య– మునపటిలా లేదు శరీరం పొలం పని తన కొక్కడికే బారమౌతూంది– శరీరం పనిచేయలేక ఎదురు తిరుగుతూంది– కానీ తప్పదు– జీవితం వెళ్ళబుచ్చుకోడానికి శ్రమపడక తప్పదు– ఈ చేసిన అప్పులలోంచి బయట పడడానికి తీపి పంట పండించి, చేదు అనుబవాలని బరించకా తప్పదు

దూరంగా మామిడితోటలో ఏదో అలికిడైతే అటు వైపు చూశాడు సంగమయ్య పిల్లలంతా కలిసి ఏదో ఆటలాడు కుంటున్నా రక్కడ–

వారిలో తన కొడుకు బోగేసుతో పాటు దేవుడు కొడుకు సత్యం, కరణం గారబ్బాయి వాసు, రాంకోటి కొడుకు బుచ్చిశెట్టి పంతులుగారి రెండో అబ్బాయి కూడ వుండటం గమనించాడు సంగమయ్య

ఏ సమస్యలూ కష్టాలూ తెలీని పసి వయసు పిల్లలు– నిష్కల్మషమైన ఆ మనసుల్లోని ఆనందం జీవితాంతం గుర్తుంచుకో దగ్గ తీపి గురుతు

వారివైపే చూస్తూ కూర్చున్నాడు సంగమయ్య–

ఈతోటే మన రాజ్యం అన్నాడు బోగేసు గట్టిగా

అవును– ఈ చెట్లు, పూలూ, కాయలూ అన్నీ మనందరి వీను అన్నాడు సత్యం

ఈ బండరాయే సింహాసనం అన్నాడు పంతులు గారబ్బాయి

మరైతే రాజుగోర్ని నేనే – అన్నాడు బోగేసు చటుక్కున

అదెలా గౌతుందీ? రాజు వేషం నువ్వెయ్య కూడదు– నేనే వెయ్యాలి అన్నాడు బుచ్చిశెట్టి–

ఏం? ఎందు కెయ్య కూడదూ– యీ ఆట అడదామన్నది నాను యీ స్థలం చూపించింది నాను– నాను రాజైతే తప్పేముంది అన్నాడు బోగేసు పౌరుషంగా

రాజేషం ఏసినోడు– ఎందులోనో అందులో గొప్పోడు కావాల. డబ్బో, కులమో చదువో ఏదీలేని నీలాటోడు రాజైతే దేశానికి అరిష్టం తెల్సా– అంచేత రాజును నేను– మంత్రిగా పంతులుగా రబ్బా యుంటాడు– సైన్యాదిపతి వాసు– అంటూ ఎవరెవరు ఏయే వేషాలకు సరిపోతారో చెబుతున్నాడు బుచ్చి శెట్టి– సత్యం అందుకు ఒప్పుకోలేదు– ఎక్కువ డబ్బో, గొప్ప కులమూ కాదు రాజుకి కావల్సింది– ఆ మాటకొస్తే రాజు పరాక్రమవంతుడూ, ధైర్యశాలీ కావాలి ఆ రెండూ నీలో లేవు అంచేత నువ్వు రాజుగా పనికి రావు అని తేల్చేశాడు

మొత్తానికి వాదోపవాదా లయ్యాయి– అభిప్రాయ బేదా లొచ్చాయి– ఎవరు గొప్ప? అన్నది తేలలేదు– మాటలు తండ్రుల గొప్పలు వరకూ వెళ్ళాయి– నేను తల్చుకుంటే మా బాబుతో చెప్పి ఏమైనా చెయ్యగలను అన్నాడు బుచ్చిశెట్టి

దూరం నించి అంతా వింటూనే వున్నాడు సంగమయ్య– వారి ఆటల్లో గాని మాటల్లో గాని జోక్యం కలిగించుకో దల్చుకో లేదతడు– కానీ యీ కులాల తారతమ్యాలూ యీ ఆర్థిక అసమానతలూ– పంటకు సోకే తెగుళ్ళలా జాతి మనుగడకే ముప్పు తెస్తాయని పించిందతనికి అవి విత్తులోనే కడతేర్చకపోతే ఎప్పటికేనా నష్టమే అనుకున్నాడు

*   *   *   *   *

బండి కదిలింది –

బండి నిండా బెల్లపు దిమ్మలు –

బండి మీద కూర్చుని ఎడ్లని అదిలిస్తున్న భోగేసు కళ్ళలో సంతోషం

సంవత్సరం పొడుగునా పడ్డ కష్టానికి ఫలితం దక్కినప్పుడు దాన్ని చూసుకుంటే సంతోషం కాక ఏమిటి?

జీవితంలో తమకు మిగిలేది అటువంటి సంతోషమే –

నిట్టూర్చేడు సంగమయ్య

తరం మారింది – చూస్తుండగానే తమ తరం పాతబడిపోయింది కొత్త తరం యువరక్తం అయితే తము సాధించలేనిది యీ కొత్త తరం సాదించగలదా అని ఎప్పటికప్పుడే సంశయం

కష్టాల కడలి నుంచి, పేదరికపు వూబిలోంచి బయటపడలేకపోయారు తాము గానుగెద్దు జీవితానికి అలవాటు పడిపోయి అందులో వున్న ఆనందానికే పరిమితమైపోతున్నారు –

అప్పులు, వడ్డీలూ, పంట చేతికందగానే కొంత చెల్లింపులు మిగిలిన అప్పు చెల్లు వెయ్యకుండానే మళ్ళీ కొత్త అప్పులు – ఈ వలయం మద్య




బారంగా బతుకు బండి లాగడం ఇంతే!

ఈ పాతికేళ్ళలోనూ యింతకు మించి సాదించింది లేదు– రామకోటి కొడుకు బుచ్చిశెట్టి మాత్రం తండ్రి స్థానంలో కూర్చున్న యీ నాలుగేళ్ళలోనూ పట్నంలో ఓ మేడ కట్టించేడు బెల్లం మార్కెట్‌కి వెళ్ళి రావడం కోసం ఓ కొత్త కారు కొన్నాడు– దేవుడు కొడుకు సత్యం మాత్రం అచ్చంగా తండ్రి బుద్ధులే పుణికి పుచ్చుకున్నాడు – అన్యాయమైపోయున్న జనానికి అండగా నిలిచి న్యాయం కోసం, ధర్మం కోసం పోరాడుతున్నాడు రైతు జనాలమీద అతనికి జాలి వుంది మంచితనం వల్ల, అమాయకత్వంవల్లా రైతులు అన్ని రకాలుగానూ దోపిడీకి గురవుతున్నారంటాడతను కష్టపడి పండించిన పంటకు గిట్టుబాటు దర లేకపోవటం వల్లనే రైతు ప్రతి యేడూ అప్పులపాలవుతున్నాడంటాడు

మనం పండించేది తీపి చెరుకే అయినా మన జీవితాల్లో మిగిలేది మాత్రం చేదే అంటాడు

అతనే ఆలోచనలూ చేతలూ వింటూ చూస్తుంటే ఒక్కోప్పుడు సంతోషం కలుగుతుంది ఆ వెంటనే బయం కూడ కలుగుతుంది–

ప్రవాహానికి ఎదురీదడం ప్రమాదకరం అని నమ్మినవాళ్ళు తాము మరి!

(ఇంకా ఉంది)

## పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## సమాజమా! నీవు మారేదెప్పుడు?

"అయ్యబాబోయ్! అయ్యగారూ కొట్టకండి. ఇంకెప్పుడూ వదలనండి. మీకు దండం పెడతానండి కొట్టకండి" అంటూ కామందు దెబ్బలబారి నుండి తప్పించుకోడానికి విఫలయత్నం చేస్తూ కన్నీటితో. అర్థిస్తున్నాడీ 10 సం.ల కుర్రాడు. "లమ్డికొడకా నిన్నిలా వదిలేస్తే లాభంలేదురా! బాగా మెక్కు-తుంటే ఒళ్ళు కొవ్వెక్కిపోతుంది నీకు. ఇంత నిర్లక్ష్యమా? ఓ రెండు రోజులు తిండిపెట్టకుంటే నీ రోగం కుదురుతుందిరా" అని హుంకరిస్తూ అయాసం వచ్చిందికాబోలు కొట్టడం అపుచేశాడు కామందు.

ఇంతకీ ఆ కుర్రాడు చేసిన నేరమేమంటే పశువుల్ని మేపుతూ, దాహమేసి నీరు త్రాగడానికెళ్తే ఈలోపుగా ఓ గేదె పొరపాటున చేలో జొరబడిందట. పాపం అంతకీ గబగబా వచ్చి గేదెను గట్టెక్కించాడట. కాని రాక్షసుడిలాంటి కామందు కోపానికి గురికాక తప్పలేదు.

పాపం 3 నెలల క్రిందటి వరకూ ఆ కుర్రాడు కూడా తోటి పిల్లలతో కలిసి చదువుకుంటూ ఆడుతూ పాడుతూ ఆనందం గా తిరిగేవాడు. కాని తండ్రి త్రాగుడు కోసం, అక్కకి కట్నం ఇవ్వడంకోసం కామందు దగ్గర తండ్రి తెచ్చిన అప్పుకోసం పాలేరుగా వెళ్ళక తప్పలేదు. మీ కుర్రాడిని పాలేరుగా పెట్టకోయ్. బాగా చదువుతాడు, చదివించు అన్నవాళ్ళతో ఆ అప్పు ఎవరు తీరుస్తారు బాబూ? మీరుకాని తీరుస్తారా? అని ఆ కుర్రాడి తండ్రి అనడంతో మారుమాట్లాడలేక పోయారు ఆ అన్నవాళ్ళు.

కామందు కొట్టిన దెబ్బలు చూసి అనునయించవలసిందిపోయి అంత



పొగరుగా పశువులను వదిలివేయడమేనేంట్రా వెధవా? అందుకే కామందు కొట్టాడు అన్న తండ్రి చీదరింపులకు కుమిలిపోయింది ఆ పసి మనస్సు. తనకెవరూ వత్తాసు పలకరనే ఆవేదనతో కుమిలిపోయి జ్వరం తెచ్చుకుని అయ్యా! కామందు గార్ని కొట్టొద్దనయ్యా! అంటూ కలవరిస్తూనే ప్రాణాలు విడిచాడు ఆ కుర్రాడు. ఇది నేనెరిగిన ఓ పసిబాలుడి ఉదంతం. పెరిగి పెద్దయి పరిమళించవలసిన చాలా మంది ఇలా మొగ్గగానే తుంచివేయబడుతున్నారు.

మనం చాలామందిని వివిధరకాల వృత్తులను చేస్తూ పసివాడని, పసివయస్సు నుండే బలవంతంగా బాధ్యతలు రుద్దబడి ఆడుతూ పాడుతూ గడపవలసిన బాల్యాన్ని నిరాశా, నిస్పృహలతో బ్రతుకు బండిని బలహీనంగా లాగే చిన్నారులను చూస్తుంటాం.

వీళ్ళ జీవితాలిలా అవడానికి కారకులు తల్లిదండ్రులు, సమాజం అన్పిస్తుంది. త్రాగుడుకోసమో, డబ్బులకోసమో తమ కొడుకులను, కూతుళ్ళను కామందుల దగ్గర తాకట్టు పెట్టే తల్లిదండ్రుల్లో మార్పు రావాలి.

ఏ ఒకరో, ఇద్దరో పూనుకుని ఈ పసి జీవితాల మార్పును కోరినంతమాత్రాన అది సాధ్యపడదు. ఈ సమాజం మొత్తంలో మార్పు రావాలి. సమాజంలో మార్పు తేవడానికి స్వచ్ఛంద సంస్థలు, సేవా సమాజాలు తీవ్రంగా కృషి చేయాలి. వీటికి ప్రభుత్వం చేయూతనిచ్చి ప్రోత్సహించాలి. ఈ విషయంలో అవకాశంవున్న ప్రతి పౌరుడు, పౌరురాలు సహాయపడాలని కోరుకుంటున్నాను.

-కొండమూరి శ్యామ,
గుత్తెనదీవి(తూ. గో.).



# తండ్రులు మారాలి

ఈనాడు ఎందరో అష్టకష్టాలు పడుతూ సరైన పోషణ, తినడానికి తిండి లేక కుమిలిపోతూ జీవిస్తున్నారు. దీనికి కారణం చిన్నతనం నుంచే వారికి తల్లి లేకపోవడం! తండ్రులు వారి కోసం పట్టించుకోకుండా వాళ్లను ఏ హాస్టల్లోనో చేర్చి వారి వ్యసనాలలో వారుంటున్నారు.

ఏదైనా పండుగ వస్తే అందరూ ఆనందంగా ఇంటికి వెళితే తల్లి ప్రేమతో బిడ్డను చూసుకుని మురిసిపోతుంది. పాపం తల్లి లేని ఈ పిల్లలు ఎవరినో బ్రతిమాలి వారికి ఏదో పనిచేసి వారిచ్చిన డబ్బులతో ఛార్జీ




వేసుకుని ఇంటికి వెళితేఇంటికి తాళం వేసి ఎక్కడో తన సుఖసంతోషాలతో మునిగి వుండే తండ్రులు ఎక్కువైపోయారు.

ఇలాంటి పరిస్థితులలో ఆ పసి హృదయాలు తల్లడిల్లిపోయి కుమిలి కుమిలి ఏడుస్తుంటారు. ఒక ప్రక్క కడుపు మంట భరించలేక ఆ వూరిలో ఐస్ పార్లర్‌కు వెళ్ళి ఇరువది రూపాయిల ఐస్‌లు ఆ యజమానికి అమ్మిపెట్టి అతను యిచ్చిన నాలుగు రూపాయలు పెట్టి రెండు రూపాయలతో కడుపు నింపుకుని మిగిలిన రెండు రూపాయలతో ఛార్జీ వేసుకుని వెళ్ళిపోయి అలాగే బెంగతో హాస్టల్లో జీవించేవారు ఎందరో వున్నారు.

వీరు ఇలాంటి స్థితిలో చదువు మీద శ్రద్ధ తగ్గిపోయి అందరికి దాసీపనులు చెయ్యడం వారు ఏదైనా ఇస్తే తీసుకుని రాత్రుళ్ళు సినిమాలకు వెళ్ళిపోవడం చేస్తుంటారు. పైగా ఎక్కడైనా పెద్ద

పెద్ద ఉత్సవాలు, సంబరాలు జరిగితే అక్కడికి స్కూలు మాని వెళ్ళే చిన్న గ దుకాణాల దగ్గర అడుక్కు బూ తినుబండారాలు దొంగిలించడం శుభ్రత లేని ఆహారపదార్థాలు తినడం ఆ రోజంతా అక్కడ తిరిగి తిరిగి చివరకి అక్కడే నిదురపోయి ఆరోగ్యం పాడుచేసుకుంటుంటారు.

కానీ వీరియొక్క తండ్రులు మా అబ్బాయిని హాస్టల్లో చేర్పించి చదువు చెప్పిస్తున్నాను అని రోడ్డుంట అందరి దగ్గర చెబుతారేగాని వారి పరిస్థితి ఎలా వుందో ఏమి తింటున్నాడో అన్న జాలి లేదు. ఇలాంటి తండ్రులు ఈ సమాజంలో ఎందరో వున్నారు'కాబట్టి ప్రతి. తండ్రి ఈ విషయం తెలుసుకుని తమ బిడ్డల బంగారు భవిష్యత్‌ను పాడు చేయకుండా వారిని భావి పౌరులుగా తీర్చిదిద్దాలి. అంతేకాదు. ఇలాంటి దిక్కులేని పిల్లల పట్ల ప్రభుత్వంవారు



ఎక్కువ శ్రద్ధచూపించి వారికి మంచి సౌకర్యాలు కల్పించాలి.

హాస్టల్ వార్డెన్లు ఇటువంటి పిల్లలను గుర్తించి వారిని మంచి క్రమశిక్షణలో నడిపిస్తే వారు బాగుపడతారు. వీరిని ప్రేమానురాగాలతో చూడాలి వారిని బాగుచేసే బాధ్యత ప్రతి ఒక్కరి పైన వుంది. చిన్నతనం నుండి వీరికి నీతి నియమాలు నేర్పాలి. అపుడు వీరు దేశ పౌరులుగా తయారవుతారు మనకు మంచి కీర్తి ప్రతిష్టలు తెస్తారు.

- సిహెచ్. రాజేశ్వరరావు,
కోనాల (ప. గో.)

* * *

# ప్రభుత్వమే కారణం

"అయ్యా! నేను పనోడ్డికి పోనే 'చదూకుంటాను" అంటున్నాడు ఏడేళ్ళ రాము.

ఏం పనా! ఒళ్ళొంగి పని చేయడానికి మనకాడ డబ్బులేయి.నా? నోరు మూసుకుని పనోడ్డికి పో లేకపోతే తన్ని మరీ పంపిస్తాను అంటూ బలవంతంగా ఈడ్చుకెళ్ళి ఒక హోటల్లో కప్పులు కడిగేందుకు కుదిర్చాడు రాము తండ్రి

ఇలాంటి పిల్లలు మన దేశంలో కోకొల్లలు. మామూలుగా చూస్తే మనకు ఈ పిల్లల దుస్థితికి తల్లిదండ్రులే కారణం అన్పిస్తుంది కాని లోతుగా ఆలోచిస్తే అది వాళ్ళ తప్పు కాదని తెలుస్తుంది

నూటికి యాభై మంది పైగా దారిద్ర్య రేఖకు దిగువ నివసిస్తున్న మన దేశంలో తల్లిదండ్రులు తమకు పని దొరకక, దొరికినా ఆ వచ్చింది ఇంట్లో అందరికీ చాలక, తమ పిల్లలకు కనీసం తిండి పెట్టలేక స్కూళ్ళకు పంపి విద్యాబుద్ధులు చెప్పించాలనే ఆశ ఉన్నప్పటికీ గత్యంతరం లేక తాపీ పనుల్లోకి, కార్ఖానాల్లోకి, షెడ్లలోకి, హోటళ్ళలోకి ఒహటేమిటి ఎక్కడ వీలుంటే అక్కడ పనుల్లోకి పంపిస్తున్నారు. అంతే తప్ప కావాలని చెడగొట్టడం జరగదు.

అందుకే పని చేయలేని (దొరకని) పిల్లలు అడుక్కుంటూ అందరి చీదరింపులకు గురై ఆదరణ కరువై జీవిస్తుంటే, షెడ్లలో పని చేసేవాళ్ళు ఏమాత్రం జాకీ తేబోయి రెంచ్ తెచ్చినా మేస్త్రీల చేత చావు దెబ్బలు తింటున్నారు. షెడ్లలో బాలల్ని మరీ గొడ్డుని కొట్టినట్టు కొడుతున్నారు. ఒక్కోసారి కాలితో ఫుట్‌బాల్ తన్నినట్టు తంతే రోడ్డు మీద పడ్డ ఘటనలు కూడ లేకపోలేదు. ఆ టైములో రోడ్డుమీద ఏ వాహనాలు రాకపోతే ఫర్వాలేదు. వస్తే ఇక ఆ చిన్నారుల ప్రాణాలు గాల్లో కల్సిపోతాయి. హోటల్లో వారి పని మరీ




దుర్భరం. కాళ్ళు చేతులు వాచిపోయి ఏ మాత్రం తప్పు చేసినా ఇటు కష్టమర్ల కోపానికీ, అటు యజమాని తన్నే తన్నులకు బలి అయిపోతున్నారు. చేయని నేరం మోపి దారుణంగా కొట్టి హింసిస్తే, తర్వాత పోలీసులకి అప్పగిస్తే ఆ పసి మనసు పడే వేదన ఎవరి కర్థమవుతుంది?

అందుకే ఆ విధంగా తమని హింసిస్తున్న సమాజాన్ని ఏమీ చేయలేక సిగరెట్లకీ, తాగుడుకీ, పేకాటకీ అలవాటు పడుతున్నారు ఎటూ నేరం మోపబడిందనే ఆలోచనతో కొంత మంది దొంగలుగా మారుతున్నారు వారినలా తయారు చేసిన సమాజమే వారిని అసహ్యించు కొంటుంది. ఏం చేయాలో తెలియక తమను తామే దిగజార్చుకొంటున్నారు వారు.

అందువలన బాలలు ఈ విధంగా మారడానికి ఈ సమాజమే కారణం ఈ సమాజాన్ని పరిపాలిస్తున్న ప్రభుత్వం కారణం కాదంటారా?

ఎంతో మంది బాలలు ప్రతీ సంవత్సరము సరైన తిండి, మందులు లభించక చనిపోవడం జరుగు తున్నది ఎంత మంది కనీసం ప్రాథమిక విద్య నభ్యసించ గుల్గుతున్నారు? దేశంలో ఎన్నో బాలల చట్టాలు చేశారు. అయినా అవి అమలు జరుగుతున్నాయా? మన దేశంలో కోటీ అరవై లక్షల మంది



బాలలు బాల కార్మికులుగా తమ జీవితం గడుపు తున్నారంటే 21వ శతాబ్దంలోకి సాంకేతికంగా అభివృద్ధి చెందుతామంటే నమ్మ బుద్ధవుతుందా? ప్రభుత్వం బాలల కొరకు ఏమీ చేయలేక పోతున్న దన్నది వాస్తవం. కనీసం చట్టాలైనా అమలు చేసేటట్లు చూడాలి. బాలల చట్టం ప్రకారం 14 సం లు నిండని బాలలు కొన్ని ప్రమాదకరమైన పరిశ్రమల్లో పని చేయరాదు. అయినా అనేక ప్రమాదకరమైన పనుల్లోకి బిడ్డలు పంపబడు తున్నారు.

ప్రభుత్వం బాలల చట్టాలు అమలు పర్చాలి నిర్బంధోచిత విద్య, విద్యా కాలంలో స్కాలర్‌షిప్‌లు ప్రవేశపెట్టాలి. వారి ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించాలి. నేటి భరత బాలలే భావి భరత పౌరులని గుర్తించాలి. బాలల స్థితి గతులపైనే భారత దేశ భవిష్యత్ ఆధారపడి ఉన్నది. సమాజం మారాలి.

– డి. రూపవాణి, ఇంద్రపాలెం,
కాకినాడ ☐

---- కూపన్ ----

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

. . . . . . . . . . . . . . .

పిన్‌కోడ్ :

## వ్యక్తిగతం



తమిళనాడు రాజకీయాలలో ఇప్పుడు ప్రముఖ స్థానాలలో ఇద్దరు సినిమా తారలున్నారు ఒకరు జయలలిత, ఎ ఐ డి ఎం కె ప్రచార కార్యదర్శి, మరొకరు వైజయంతిమాల బాలి, కాంగ్రెసు (ఐ) పార్లమెంటు సభ్యురాలు ఈ ఇద్దరినీ భయంలో ముంచెత్తేలా మరొక సినిమా తార రాజకీయాలలో ప్రవేశించనున్నదని వార్తలు వస్తున్నాయి అమె శ్రీదేవి! ఆమె కాంగ్రెసు (ఐ)లో చేరనున్నదని అనుకుంటున్నారు ఆమె ప్రవేశంతో ఆమె తనకంటె ఎక్కువ జనాదరణ గల తార గనుక తన ప్రాముఖ్యం తగ్గిపోతుందేమోనని వైజయంతిమాల భయపడుతున్నారు. అట్లాగే రాష్ట్ర రాజకీయాలలో బహుళ జనాకర్షక మహిళగా ఉన్న జయలలిత తన స్థానం ఎక్కడ రద్దయిపోతుందోనని గాభరాపడుతున్నారు కాని ఈ వార్తల పట్ల ప్రజలు మాత్రం ఆనందంగా ఉన్నట్టు తెలుస్తున్నది. తమ కలల రాణి తమ మధ్య తిరుగాడబోతున్నదని వాళ్ళు సంతోషిస్తున్నారు ఏది ఏమైనా ఆమెకు రాజకీయాలలో రాణించగల శక్తి లేదని, ఆమె శివాజీ గణేశన్ స్థాయికి కాకపోయినా, జయలలిత స్థాయికి కూడా ఎదగడం సాధ్యం కాదని రాజకీయ పరిశీలకులు భావిస్తున్నారు ... □



చాలామంది ప్రజలు, చాలా దేశాలూ నిరాదరించగా చివరికి ప్రశాంతంగా, పెద్ద సంచలనం సృష్టించకుండా జీవిస్తున్న భగవాన్ రజనీష్‌ను తరుముకొస్తున్న కష్టాలు ఇంకా ముగిసినట్టు లేవు అయన ఆధిపత్యంలోని ధర్మ సంస్థలు విదేశీ మారక ద్రవ్య నిబంధనలను ఉల్లంఘించాయనే నేరంపై అయనపై బెయిల్ ఇవ్వడానికి వీలులేని వారంట్ జారీ అయింది. దాదాపు నాలుగు కోట్ల రూపాయల నిధులపై ఆదాయపు పన్ను చెల్లించలేదని అయనపై అభియోగం ఉంది. ఈ విచారణ ఆయన గతంలో అమెరికా వెళ్ళినప్పుడు ప్రారంభమైంది. ఇప్పుడు అన్ని దేశాల నిరాకరణను పొంది, చివరికి నమ్మకమైన శిష్యుడు వినోద్‌ఖన్నాతో కూడ ఎడబాటు కలిగిన స్థితిలో భగవాన్ రజనీష్‌కు ఏమి చేయడానికీ పాలుపోవడం లేదు అనేకమంది శిష్యులు ఆయనను వదిలేసి వెళ్ళిపోతున్నారు కొత్తగా స్నేహితులైన ఖలిస్తాన్ వాదుల సహాయాన్నర్థిస్తారేమో. □

## వారఫలం

3-7-1987 శుక్రవారం మొదలు 9-7-1987 గురువారం వరకు

★ **మేషం** : వారం బహు విచిత్రంగా జరుగుతుంది అనుకొనని సంఘటనలు జరుగుతాయి. ఏనాడో కలసికొన్న వ్యక్తులు తటస్థపడుతారు. త్వరపడి చేసిన కొన్ని వ్యవహారాలు మీకే అనుకూలమవుతాయి దూర దేశాల నుండి అనువైన వార్తలతో ఉత్తరాలు వస్తాయి. స్త్రీలకు : ఉద్యోగమందు పెంపు, కళారంగాన ప్రసిద్ధి.

★ **వృషభం** : అడుగడుగునా యిబ్బందులని యిదివరకు భయపడేవారు. యిక అలాంటి యిబ్బంది లుండవు వృత్తియందు మేలుంటుంది ఇరుగు పొరుగు గొడవలు తగ్గి ప్రశాంతత ఏర్పడుతుంది. సజ్జన నివాసం సర్వఫలదాయకమని గ్రహిస్తారు. స్త్రీలకు . బంధు ప్రీతి, వృత్తి రీత్యా మేలు, ఆదాయమందు వృద్ధి

★ **మిధునం** : 'శని, గురు' గ్రహాల ఆశీస్సులున్నాయి వ్యాపారస్తులకు అనుకూలం రాజకీయంగా మేలు. ఆరోగ్యమందు కొంత మెరుగు కనిపిస్తుంది రాజకీయంగా యింతవరకు ఏమి మేలు సాధించారు? దూరంగా ఉంటేనే మేలు. స్థిర చరాస్థుల తగాదాలు రాకుండా చూచుకోండి. స్త్రీలకు అనుకూలం ధన సంబంధ చిక్కులు నివృత్తి

★ **కర్కాటకం** : ఏ వ్యక్తి ఎలాంటివాడో, ఏ స్త్రీ ఎలాంటిదో తెలియక ముందు వెనుకలాడుటతో వారం వ్యయిస్తారు. అనవసరంగా చిక్కులలో చిక్కుకొంటారు కొందరు. వృత్తి రీత్యా యిబ్బంది పడుతారు కొందరు. స్త్రీలకు : ప్రయాణాల్లో యిబ్బందులు, అనవసర వ్యయం.

★ **సింహం** : ఇంటా బయటా మీకు మేలైన వారం ఎలాగంటారా! బయటి మిత్రనురాగం. ఇంట శాంతికి అకారమైన స్థితి. వ్యర్థ ప్రయాణాలు జరుప కొందరు సంకల్పిస్తారు ఎందుకు? అనవసరంగా యిబ్బందులకు లోను గాకండి ప్రమాద సూచిత వారం స్త్రీలకు నిష్ప్రయోజక వ్యవహారాలు. అధిక ధన వ్యయం చేయవలసిన పరిస్థితులు ఉండవచ్చు. గ్రహించాలి

★ **కన్య** : వారమంతా, ముఖ్యంగా చివరి రెండు రోజులు ధనాదాయ ముంటుంది. అనుకొనని రీతిగా ఏవో వస్తువులు, ఒకవేళ విలువగల వస్తువులు సమకూర్చుకో గలుగుతారు. విద్యా విషయంగా కొందరకు చెప్పవచ్చు స్త్రీలకు : నూతన వస్తు సేకరణకు, పత్రికా రంగాన సదవకాశాలకు, రాజకీయంగా మేలు పొందుటకు అనుకూల వారం

★ **తుల** : రాజకీయవాదులకు మేలైన సమయం వారాంతాన ఏదో మేలు చేకూరుట నిశ్చయం. శని అనుకూలుడే. ధన స్థాన స్థితుడు. ఏదో విధంగా ధనం అందటం నిశ్చయం. గౌరవదాయక వారం. స్త్రీలకు : వృత్తియందు గౌరవం. పెద్దలవలన మేలు చేకూరటం, ప్రతిభ రాణించుటకు అవకాశం ఉన్నది.

★ **వృశ్చికం** : సాంఘికంగా మేలు గాదు. స్త్రీలవలన మేలు చేకూరదు. అనుకొన్నవిధంగా పనులు సాగి రావు. ఆదాయ లోపం చేకూరటం నిశ్చయం. ఒకటి రెండు రోజులు మనోవ్యధకు ఆకరం, అనుకొన్న వ్యవహారం, అలా జరుగకపోవటం గమనార్హం. స్త్రీలకు · కొందరకు అనవసర ఘర్షణ, ఋణదాతల వత్తిడి.

★ **ధనుస్సు** : మేలు కోరినవారు యింటికి వస్తారు మాటకు మరియాద పెరుగుతుంది. కొందరకు అప్రయత్న ధనలబ్ధి, గౌరవాభివృద్ధి, సజ్జన సాంగత్యం, పత్రికా గౌరవం చేకూరుట చెప్పదగిన విషయం. స్త్రీలకు : ధన కనక వస్తు వాహన సేకరణకు అనుకూల వారం. అయినా ఆరోగ్యరీత్యా జాగ్రత్త!

★ **మకరం** : పరుల వ్యవహారాలలో జోక్యం తగదని, అపకారమే జరుగునని, నష్టం వచ్చిందని, మాటలు పద్తామని గ్రహింపగలుగుతారు. ఎవరేమనుకొంటే నాకేమని అనుకోరాదు. సభా మర్యాద కొందరకు, పత్రికా గౌరవం కొందరకు చెప్పవచ్చు. స్త్రీలకు ధనాదాయం, వృత్తియందు పెంపు. సుఖ శాంతులు, ముఖ్యంగా మనశ్శాంతి చెప్పదగిన అంశం.

★ **కుంభం** : సభా మర్యాద కొందరకు, రాజకీయాలందు ప్రగతి కొందరకు, వృత్తియందు మేలు కొందరకు, అయిన వారివలన మేలు చేకూరుట కొందరకు, విలాస వస్తు సేకరణ కొందరకు, ప్రయాణ మూలక సౌకర్యం కొందరకు చెప్పవచ్చు స్త్రీలకు . ప్రతిభకు పారితోషికం, బంధు మూలకానంద, వాహన సౌఖ్యం సంభవం.

★ **మీనం** : నిత్య కృత్యాలందు, యధావిధి జరిగే వ్యాపారమందు ఎలాంటి అంతరాయం రాదు. సాగించండి. రాజకీయవాదులతో అనవసర ప్రమేయం పెట్టుకోకండి. అనవసర గొడవలకు దిగకండి. స్త్రీలకు : లేనిపోని గొడవలు రావచ్చు ఆదాయమందు స్వల్పంగా అభివృద్ధి కనిపించవచ్చు.

-విద్వాన్ కోట సత్య రంగయ్యశాస్త్రి

# ఆషాఢ మాసం

BANNU*

పద్మ...






















# జాతకం

## కాకాని కమల

సమయం ఉదయం పది గంటలు దాటుతూంది

అచ్యుతరామయ్య ప్రయాణం తొందర్లో వున్నాడు

స్నానం, జపం భోజనం అయ్యేసరికి ఆలస్యం అయిపోయింది

చిన్న చేతి సంచీలో ముఖ్యమైన కాగితాలు, ఎందుకైనా వుంటాయని ఓ జత బట్టలు సర్దుకున్నాడు

బీరువాలోంచి డబ్బు తీసి పర్సులో పెట్టుకొని చేతిసంచి అందుకొని హడావుడిగా చెప్పులు తొడుక్కున్నాడు

భార్య లక్ష్మిందేవి జరీ ఉత్తరీయం తెచ్చి భర్తకి అందించింది

కాస్త ఆ జాతక చక్రం అదీ బాగా విపులంగా వేయించుకుని రండి మన అమ్మాయి నక్షత్రంలో ఏదైనా దోషం వుంటే దాచకుండా చెప్పమనండి అవసరం అయితే పూజలు అభిషేకాలు చేయిద్దాం ఓ పది రూపాయలు పోయినా ఫరవా లేదు పిల్ల తల మీద నాలుగు అక్షింతలు పడితే అంతే చాలు అన

అచ్యుతరామయ్య విసుగ్గా నుదురు చిట్లించాడు

అబ్బ ఇంక చాల్లే ఎన్నిసార్లు చెప్తావ్ ఆ మాటతో గయ్ మంది లక్ష్మిందేవి

ఎన్నిసార్లు చెప్పినా ఏం ఫలితం? నా బాధ మీకు అర్థం కాదులెండి ఇక్కడికి నాలుగేళ్ళ నుంచి సంబంధాలు చూస్తున్నాం ఒక్కటన్నా కుదిరిందా? నేను ఎప్పట్నుంచో మొత్తుకుంటున్నాను దాని జాతకంలో ఏదన్నా లోపం వుందేమో ఎవరికైనా చూపించండి అని కాని నా మాట పెడచెవిని పెట్టారిన్నాళ్ళూ ఆఖరికి మొన్న పూజారిగారు చెప్పాక గాని మీ చెవికి ఎక్కలేదు పిల్ల చూడబోతే ఏపుగా బంతి చెట్టులా ఎదిగిపోతూంది ఇంకా కూతురి పెళ్ళి ఎప్పుడు చేస్తావ్ అని ఇరుగు పొరుగు కాకుల్లా పొడుస్తున్నారు నన్ను లక్ష్మిందేవి కంఠం దుఃఖంతో రుద్ధం అయ్యింది

కూతుళ్ళకి పెళ్ళిళ్ళు కావటం లేదన్న ఆవేదన కళ్ళలో ప్రతిఫలించింది బొటబొటా కన్నీటి ముత్యాలు చెక్కిళ్ళ మీద రాలాయి

అచ్యుతరామయ్య శాంతంగా భార్య మొఖంలోకి చూశాడు

లక్ష్మీ! అనూరాధ నీ ఒక్క దానికే కూతురు కాదు నాకూ కూతురే ఇప్పుడు నేను వెదుకుతున్నది అమ్మాయి కోసమే గాని నా కోసం కాదు కదా? చెప్పిందే చాదస్తంగా ఎందుకు చెపుతావ్? సరే నేను వెడుతున్నాను బస్సుకి టైమ్ అవుతుంది వెళ్ళిన పని అయిపోతే రాత్రికి వచ్చేస్తాను లేకపోతే రేపు ఉదయం భోజనం వేళ్ళకి వచ్చేస్తాను ఆఫీసుకి ఈ ఒక్క రోజే శలవు పెట్టాను జాగ్రత్త తలుపేసుకో అంటూ హడావుడిగా వీది గుమ్మం దిగి రోడ్డు మీదికి వచ్చాడు

కాళీగా ఆటో గాని రిక్షా గాని దొరుకుతుందేమో అని చూస్తూ పరుగు లాంటి నడకతో సందు మలుపు తిరిగాడు

అంతలో ఎదురుగా కాళీ ఆటో కనిపించటంతో బస్సు స్టాండ్‌కి పోనిమ్మని చెప్పి ఎక్కి కూర్చున్నాడు

చల్లగాలికి సేద తీరుతూ చేతిసంచి ప్రక్కన పెట్టుకుని స్థిమితంగా సీట్లో సర్దుకుని కూర్చున్నాడు

ఆటో క్షణంలో వేగం అందుకుంది

* * * *

అచ్యుతరామయ్యకి నలుగురు ఆడపిల్లలు మగపిల్లలు లేరు వెనక చెప్పుకోతగ్గ ఆస్తి పాస్తులు లేకపోయినా వుండటానికి స్వంత ఇల్లు నెలకి వెయ్యి పైగా జీతం వచ్చే గవర్నమెంటు ఉద్యోగం వున్నాయి పెద్దపిల్ల అనూరాధ ఇరవై నాలుగు సంవత్సరాలు నిండి ఇరవైఐదు వస్తుంది బి ఏ పూర్తి కాగానే బి ఇడి లో చేరి ట్రైనింగ్ పూర్తి చేసింది స్థానికంగానే వున్న ఒక ఆడపిల్లల స్కూలు టీచరుగా పని చేస్తుంది విశాలమైన కనురెప్పలు పెద్ద జడతో చూడముచ్చటగా వుంటుంది అనూరాధ

రెండో అమ్మాయి దుర్గ బి ఎస్ సి ఆఖరి సంవత్సరం చదువుతూంది ఇరవై ఏళ్ళు తరువాతి ఆడపిల్లలిద్దరూ హైస్కూలు చదువుకి వచ్చారు

దాదాపు ఇద్దరు ఆడపిల్లలు పెళ్ళికి సిద్ధంగా వున్నారు

అనూరాధ డిగ్రీ పూర్తి చేసినప్పట్నుంచి ఆ అమ్మాయి పెళ్ళి చెయ్యాలని తొందర పడుతున్నాడు అచ్యుతరామయ్య అంతో ఇంతో కట్నం ఇవ్వటానికి కూడా సిద్ధంగానే వున్నాడు

ఇక్కడికి నాలుగయిదు సంవత్సరాల నుంచి కాళ్ళకి బలపాలు కట్టుకుని తిరుగుతున్నాడు అయినా ఏ ఒక్కటి కలిసి రాలేదు మంచి కుటుంబం సంప్రదాయం చదువు అందం ఉద్యోగం వున్నా ఒక్క సంబంధం ఎందుకు కుదరటం లేదో అర్థం కాలేదు

మొదట్లో ఇది కాకపోతే ఇంకో సంబంధం కుదరకపోతుందా అనుకున్నారు కాని చూస్తూ వుండగానే నాలుగు సంవత్సరాలు గడిచి పొయ్యాయి

దాంతో ఆ అమ్మాయి పెళ్ళి ఒక సమస్యగా తయారై గుండెల్లో గుబులు రేపింది ఇరుగు పొరుగు దృష్టిలో కూడా చులకన అయ్యింది

ఒకటి రెండు సంబంధాలు తాంబూలాల దాకా వచ్చి కూడా చిత్రంగా వెనక్కి వెళ్ళిపొయ్యాయి పోనీ అనూరాధ నడత విషయంలో ఏమైనా లోపం వుందా అంటే అదీ కాదు

అంత చదువుకొని సంపాయిస్తున్నా కొంచెం కూడా అహంకారం లేదు. వంచిన తల ఎత్తదు మీ అనూరాధ ఆ అమ్మాయి గట్టిగా మాట్లాడగా ఎప్పుడూ వినలేదు మేం ఈ కాలంలో కూడా ఇంత వినయ విధేయతలు గల ఆడపిల్ల వుండటం మీ అదృష్టం లక్ష్మమ్మగారూ! అంటూ ఇరుగు పొరుగు ఆడవాళ్ళు ప్రశంసిస్తారు

అంగట్లో అన్ని వున్నాయి, అల్లుడి నోట్లో శని అన్నట్టు ఇన్ని సుగుణాలు వున్నా మరి ఏమిటి లోపమో, అనూరాధకి వచ్చిన సంబంధాలన్ని ఎందుకు తిరిగి వెనక్కి వెళ్ళిపోతున్నాయో అర్థం కావటం లేదు

అయినా శాయశక్తులా పిల్ల పెళ్ళికి ప్రయత్నాలు చేస్తూనే వున్నాడు నాలుగు నెల్ల క్రితం అన్నింటి కంటె ఆశ్చర్యకరమైన ఓ సంఘటన జరిగింది

ఓ సంబంధం వాళ్ళు అనూరాధని చూసి ఇష్టపడి పెళ్ళికి ఒప్పుకున్నారు

వాళ్ళు ఇరవై వేలు అడిగారు అచ్యుతరామయ్య పదిహేను ఇస్తానన్నాడు వాళ్ళు ఒప్పుకున్నారు

పది రోజుల తరువాత తాంబూలాలు పుచ్చుకుందుకు వస్తామని ముహూర్తం తారీఖు నిర్ణయించి, ఆ రోజు కట్నం డబ్బు కూడా ఇవ్వాలని ఆ ప్రయత్నంలో వుండమని ఉత్తరం వ్రాశారు

అచ్యుతరామయ్య డబ్బు ఏర్పాటు చేసుకుని మిగతా కార్యక్రమం అంతా సిద్ధం చేసుకున్నాడు

పెళ్ళికొడుకు అందగాడు, మంచి ఉద్యోగస్తుడు అనూరాధకి మంచి సంబంధం కుదురు తున్నందుకు ఇంటిల్లిపాది ఎంతో ఆనందించారు

కాని తెల్లారితే తాంబూలాలు పుచ్చుకుంటారనగా వరుడి తండ్రి మధ్యవర్తి చేత కబురు పంపించాడు

కొన్ని కారణాల వల్ల ఈ సంబంధం వదులుకుంటున్నామన్నదే ఆ కబురు సారాంశం!

ఆడపిల్లలు గల వాళ్ళం ఎంత అప్రతిష్ఠ? అంటూ లక్ష్మిందేవి రాగం అందుకుంది

వెంటనే ప్రయాణం అయి వియ్యంకుడ్ని కలవటానికి వెళ్ళాడు అచ్యుతరామయ్య

ఇంటి ముందు పచ్చగా తాటి ఆకుల్తో పందిరేసి మామిడాకులు కట్టారు

ఇంటికి తాళం వేసుంది

వాళ్ళ అబ్బాయి పెళ్ళని అంతా ఆడపిల్ల వాళ్ళింటికి వెళ్లారని చెప్పారు

అప్రతిభుడయి పొయ్యాడు అచ్యుతరామయ్య ఇంక చేసేది లేక నిరాశతో ఇంటికి వచ్చేసాడు ఆ తరువాత తెలిసింది వేరే వాళ్ళు పాతిక వేలు కట్నం ఇస్తామనటంతో డబ్బుకి కక్కుర్తి పడ్డారని

అయినా తాంబూలాల దాకా వచ్చిన పెళ్ళి వెనక్కి పోవటంతో చాలా అశుభంగా ఇరుగు పొరుగుల మధ్య తలవంపుగా అనిపించింది

లక్ష్మిందేవి అనారోగ్యంతో దిగులుతో మంచం

పట్టింది

రోజు రోజుకి అనూరాధ పెళ్ళి సమస్యగా తయారైంది

పిల్ల జాతకంలో ఏదైనా లోపం వుందేమో! ఎవరైనా మంచి జ్యోతిష్కుడికి చూపించండి నక్షత్ర దోషం ఏదన్నా వుంటే పూజలు అన్ని చేయించండి అన్ని సవ్యంగా జరిగిపోతాయ్ అంటూ నల్గురూ సలహా చెప్పారు

అచ్యుతరామయ్యకి తెల్సినంత వరకు అనూరాధ నక్షత్రంలో గాని జాతకంలో గాని ఏ లోపం లేదు అనూరాధ నక్షత్రం కూడా చాలా మంచిది అందుకని నక్షత్రం పేరే కూతురికి పెట్టారు మరి 'పెళ్ళి' దగ్గరకి వచ్చేసరికి ఇన్ని అవాంతరాలు ఎందుకు వస్తున్నాయో అంతు చిక్కటం లేదు

ప్రక్క ఊళ్ళో సుబ్బావధాన్లు గారని ఒకాయన వున్నారు యాభై య్యేవ పడిలోకి వస్తున్నారు ఆయన జ్యోతిష్ శాస్త్రంలో దిట్ట అని జాతక చక్రం రాశాడంటే దానికి తిరుగు లేదని ఆ చుట్టుప్రక్కల గ్రామాల్లో చాలా మంచి ప్రచారం వుంది

అరచేతుల్లోనూ, నుదుట బ్రహ్మరాసిన గీతల్ని అక్షరాల్ని చూసి చదివినట్లు చదువుతాడని, ఏవైనా దోషాలువుంటే దాచకుండా చెప్తాడని, ఆ దోషాలు పోవటానికి ఏం చెయ్యాలో పరిష్కార మార్గాలు కూడా సూచిస్తాడని, అంటే వగ్గరుండి పూజలు, వ్రతాలు చేయించి దోషాలు పోగొడతాడని, ఆ తరువాత అంతా సవ్యంగా జరిగిపోతాయని ఆయన పాండిత్యం గురించి అంతా ప్రశంసగా చెప్పు కుంటారు

ఇళ్ళు కట్టుకోటానికి వ్యాపారం విద్య ఉద్యోగం వడుగులు పెళ్ళిళ్ళు ఇలా ఏ శుభకార్యానికైనా చుట్టుప్రక్కల ఊళ్ళలోని జనాలు సుబ్బావధానిగారి దగ్గరకి వెళ్ళి ముహూర్తాలు పెట్టించుకుంటారు

ఆయన ముహూర్తం పెడితే ప్రళయం వచ్చినా శుభకార్యం మాత్రం ఏ ఆటంకం లేకుండా గట్టెక్కిపోతుందని అంతటి పాండిత్య ప్రతిభ హస్తవాసి ఆయన కుందని, ఫీజులుకూడా ఎక్కువగా తీసుకోడని తోచింది యిమ్మంటా డని యిలా రకరకాలుగా సుబ్బావదాన్లుగారి గురించి జనవాక్యం వినిపిస్తుంది

ఆఖరికి బంధు మిత్రులు, అయినవాళ్ళు అనూరాధ జాతకం సుబ్బావధాన్లుగారికి ఒకసారి చూపిస్తే మంచిదని సలహా చెప్పారు అచ్యుత రామయ్యకి

భార్య లక్ష్మిందేవి ఎప్పట్నుంచో ఆ మాట అంటూంది

అందుకే అచ్యుతరామయ్య అఫీసుకు సెలవు పెట్టి ప్రత్యేకంగా సుబ్బావధాన్లుగారికి కూతురు అనూరాధ జాతకం చూపించాలని బయలుదేరాడు

ఎన్ని ప్రయత్నాలు చేసినా అనూరాధ పెళ్ళి ఎందుకు వాయిదా పడుతోందో అసలు జాతకం చూసి అవధాన్లుగారు ఏం చెపుతారోనని కడుపులో అందోళనగావుంది

ఎలాగైనా ఈ ఏడాది కూతురు పెళ్ళి జరిపిం చెయ్యాలని తాపత్రయ పడుతున్నాడు

కీచు



ఆటో ఆగిన శబ్దానికి వులిక్కిపడి ఆలోచన్లనుంచి తేరుకొని తలఎత్తాడు అచ్యుతరామయ్య

బస్సుస్టాండ్ వచ్చేసింది

పెళ్ళిళ్ళ సీజన్ కావటంతో బస్సు స్టాండ్ జనంతో తిరునాళ్ళలావుంది

అప్పటికే బస్సు వచ్చి ఫ్లాట్‌పారంమీద ఆగివుంది

గబగబా కౌంటర్ వైపు పరిగెత్తి క్యూ లో నిల్చుని ఆ తొక్కిసలాటలో ఎలాగో కష్టపడి టిక్కెట్టు తీసుకున్నాడు

నుదురంతా చెమట్లు కారుతుంటే పై కండువాతో తుడుచుకుంటూ వచ్చి రిలీఫ్‌గా బస్సులో కూర్చున్నాడు

* * * * * * * *

గిరిరాజపురం లో బస్సు దిగేసరికి సమయం మధ్యాహ్నం మూడు గంటలు కావస్తూంది

బస్సు కుదుపులకి శరీరం అంతా అలసి నట్లయ్యింది

ఉదయం హడావుడిగా భోజనం చెయ్యటంవల్ల కడుపులో ఆకలి కూడా కరకరమంటూంది

దగ్గర్లో వున్న హొటల్‌కి వెళ్ళి వేడివేడిగా ఓ ప్లేటు టిఫెన్ తిని, కమ్మటి కాఫీ త్రాగి, వక్కపలుకు నములూ మెయిన్ రోడ్డుమీదకి వచ్చాడు

జేబులోంచి అవధాన్లుగారి యింటి అడ్రస్ కాగితం బయటికి తీశాడు

బ్రాహ్మణ అగ్రహారం శివాలయం ప్రక్కన సందులో మూడవ యిల్లు

రిక్షా మాట్లాడుకొని ఎక్కి కూర్చున్నాడు

పదినిమిషాల్లో రిక్షా యింటి ముందు ఆగింది

ఎత్తు అరుగులతో పాతకాలంనాటి వైభవాన్ని చాటుతున్న పెద్ద పెంకుటిల్లు ఇంటిముందు వెదురు బద్దలతో ఫెన్సింగ్ చిన్న గేటు లోపల రకరకాల పూల చెట్లతో లోగిలి కళకళలాడుతూంది

వల్లభ జోస్యుల సుబ్బావధాన్లు జ్యోతిష్య శాస్త్రవేత్త అన్న చిన్న బోర్డు యింటి ముందు వ్రేలాడుతూంది

అచ్యుతరామయ్యగారు వెదురు గేటు పక్కకి తప్పించి లోపలికి వచ్చాడు

ఎత్తుగా వున్న చీడీలు ఎక్కి తలుపుమీద బోల్టుతో కొట్టబోయాడు

కాని అంతలోనే లోపల్నుంచి కాస్త హెచ్చు స్థాయిలో ఘర్షణ పడుతున్నట్లు ఏవో మాటలు పెద్దగా వినిపించటంతో చప్పున చేతిని వెనక్కి లాక్కుని ఓ అడుగు పక్కకి వేశాడు

ఓరవాకిలిగా తెరిచివున్న తలుపు సందులోంచి లోపలి దృశ్యం కనిపిస్తూంది

ఎర్రటి పట్టుపంచె, ఒదులుగా వేసుకున్న జుత్తుముడి, పచ్చని శరీరఛాయ, వంటినిండా, నుదుటి మీద విబూదిరేఖలు, మధ్య చందనం కుంకుమ కలిసిన బొట్టు, మెడలో, చేతులకి రుద్రాక్షమాలలు ధరించి వృద్ధాప్య ఛాయలలో వున్న ఒక నడివయసుదాటిన వ్యక్తి చాపమీద కూర్చుని వున్నాడు

గోల్డుఫ్రేమ్‌తో వున్న తెల్లటి కళ్ళద్దాలు పెట్టుకొన్నాడు

ఆయన చుట్టూ జ్యోతిష్‌శాస్త్రానికి సంబంధించిన రకరకాల పుస్తకాలు పరిచి వునాయి

తలవంచుకొని దుర్భిణి లోంచి కాగితంమీదున్న రేఖల్ని దీక్షగా పరిశీలిస్తున్నాడు

చేతులెత్తి నమస్కారం చెయ్యాలన్నట్లు ఆయన్ని చూడగానే ఒకరకమైన పవిత్రత గౌరవభావం వుట్టిపడుతున్నాయ్

ఆయనే సుబ్బావధాన్లుగారని గ్రహించుకున్నాడు అచ్యుతరామయ్య

ఆయన ప్రక్కనే జరీఅంచు కలనేత చీరలో ఆయన భార్య కాబోలు కూర్చునివుంది

ఆవిడ చాలా కోపంగా కారాలు మిరియాలు నూరుతున్నట్లు చేతులు తిప్పుతూ రుద్ధమైన కంఠంతో సాధిస్తున్నట్లు అంటూంది-

ఇందాకట్నుంచి చూస్తున్నాను మీ ధోరణి, మీ పనిమీదేగాని, నా మాట మీ చెవికి ఎక్కడంలేదా? అసలు నేనంటు ఒకదాన్ని మీ పక్కన కూర్చున్నానన్న ధ్యాస అయినా మీకు లేదు పగలు రాత్రి ఊరివాళ్ళ జాతకాలతో కుస్తీ పట్టటం, వాళ్ళకి మంచి, చెడు బాగోగులు చూడటమేగాని ఇంతకీ మన అమ్మాయి పెళ్ళిగురించి ఏం ఆలోచించారు? చూస్తూ వుండగానే దానికి ఇరవై దాటిపోతున్నాయ్ పిల్లకి పోనీ చదువన్నా వుందా అంటే అదీ లేదు పెళ్ళిచేసి అత్తింటికి పంపుదామంటే వచ్చిన సంబంధాలన్నీ తిరిగిపోతున్నాయ్ ఈ ఏడాదన్నా దాని పెళ్ళిగురించి ఆలోచించరా లేదా? ముందు నాకు సమాధానం చెప్పండి దాదాపు అరుస్తున్నట్లు సర్రున ఆయన చేతుల్లో వున్న కాగితాలు, దుర్భిణి లాక్కుంది

థండరింగ్ ఆఫ్టర్ లైటెనింగ్ ఈజ్ బట్ నాచురల్ అన్న వేదాంతిలా సుబ్బావధాన్లుగారు ప్రశాంతంగా చిరునవ్వుతో భార్య మొఖంలోకి చూశారు

అప్పుడే దాని పెళ్ళిగురించి అంత దిగులుపడి పోతావేం కాత్యాయనీ! అయినా ఏవో సంబంధాలు చూస్తూనే వున్నాంకదా? మరి ఒక్కటీ కుదరటం లేదు దానికి నన్నేం చెయ్యమంటావ్ చెప్పు?

ఏం చెయ్యమంటానా? పెద్ద బండరాయి దాని మెడకి కట్టి నూతి లో తొయ్యమంటాను సంబంధాలు ఎలా కుదురుతాయి? ఊళ్ళో ఆడపిల్లల కాలేజి లేదని, పొరుగూరు పంపించటం ఇష్టంలేక పదవ తరగతితో దాని చదువు చట్టు బండలు చేశారు పోనీ కట్నం అయినా అవతలివాళ్ళు కోరినంత యివ్వగలమా అంటే అదీలేదు ఇల్లు అయ్యవారి నట్టిల్లు పేరుకి మాత్రం పెద్ద జ్యోతిష్‌శాస్త్ర పండితుడు తిరనాళ్ళకి వచ్చినంత జనం మీ దగ్గరకి వస్తూనేవుంటారు కాని నాలుగు రూపాయలు సంపాయించుకునే తెలివితేటలు మీకేవి? ఎక్కడలేని ధర్మ బుద్ధి మీకే వుంది మరి మీ లోకువ కనిపెట్టి అందరూ మీకు ఓ నమస్కారం పెట్టి పబ్బం గడుపుకొని వెళు తున్నారు నిక్కచ్చిగా ఇంత అని అడిగి డబ్బు తీసుకోండి అంటే మీరు నా మాట వినరు మీకు డబ్బు అవసరం లేదుగాని కట్నం మూటలేకుండా అల్లుడు వస్తాడా? . మీ పాండిత్యం

భర్త అన్న కనీస గౌరవం లేకుండా ఆవిడ యింకా ఏదో రుసరుస లాడుతుంటే కాత్యాయనీ" అంటూ అవధానిగారు ఆవిడ బుజంమీద చెయ్యివేసి ఓదారుస్తున్నట్లు అన్నాడు

అమ్మాయికి పెళ్ళి కాలేదన్న నీ బాధ నేను అర్థంచేసుకోగల్ను నా చేతనయిన ప్రయత్నం నేను చేస్తూనే వున్నాను డబ్బు అన్ని పన్లు సాధించ గలదు అనుకుంటే అవివేకమే దేనికైనా కాలం కలిసిరావాలి నా దగ్గరకి వచ్చేవాళ్ళకి నా పాండిత్యంమీద గొప్ప నమ్మకం గౌరవం వున్నాయి అందుకే వాళ్ళు నే చెప్పింది విశ్వసించి ఆచరిస్తున్నారు మన అమ్మాయికి కూడా తొందర్లోనే పెళ్ళి అవుతుందని నే చెప్తున్నాను కాని నువ్వు నమ్మవు అనవసరంగా ఖంగారుపడు తున్నావు నా దగ్గరకి వచ్చే వాళ్ళ చేతుల్లో, నుదుటిమీద వున్న రేఖల్ని చూసి వాళ్ళ జాతకం ఎలా వుందో చెప్పగల్నే కాని బ్రహ్మ రాసిన ఆ రేఖల్ని, తుడవటానికి నేనెంతవాడ్ని చెప్పు దేనికైనా నమ్మకం, విశ్వాసం ముఖ్యం

అవధాన్లుగారు భార్యకి యింకా ఏదో






# ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం హైదరాబాద్

# ప్రవేశ నోటిఫికేషన్

## B.A, B.COM & B.Sc. కోర్సులు 1986-87.

(1) ఎవరైతే ఇంటర్మీడియెట్ లేదా తత్సమాన పరిక్షను వుత్తీర్ణులైనవారినుండి **వయో నియమము లేకుండా** మరియు (2) 1985-1986 సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వ విద్యాలయం నిర్వహించిన అర్హత టిస్టు వుత్తీర్ణులైనవారినుంచి (ఆ సంవత్సరంలో ఏ కారణం చేతగాని అడ్మిషను పొందలేక పోయినవారు) నేరుగా బి ఏ, బి కామ్ మరియు బి ఎస్ సి ఇంగ్లీషు తెలుగు మీడియం కోర్సులలో ప్రవేశానికి దరకాస్తులను ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వ విద్యాలయం ఆహ్వానిస్తోంది

**బోధనా సరళి** విశ్వ విద్యాలయం ముద్రించిన పాఠ్యాంశాలను (నిపుణులచే రూపొందించబడినవి) సరఫరా చేస్తు రేడియో పాఠాల ద్వారా బోదిస్తూ ఆడియో కేసెట్లు, వీడియో పాఠములు లబించునట్లు చేస్తూ బహుళ ప్రచార విధానమును విశ్వ విద్యాలయం అవలంబించును

**అధ్యయన కేంద్రాలు** ఆంధ్రప్రదేశ్ అంతటా అద్యాపకుడు - విద్యార్థి విద్యార్థి - విద్యార్థి మధ్య పరస్పరావగాహనకు 57 అధ్యాయన కేంద్రాలు నెలకొల్పబడినవి జంట నగరాలలో 14 అద్యయన కేంద్రాలు మిగతావి వివిద జిల్లాలలో నెలకొల్పబడినవి మొదటి సంవత్సరం యు జి కోర్సులో చేర్చుకొనబడిన విద్యార్థిని సాదారణంగా అతని/ఆమె కోరిన అద్యయన కేంద్రానికి కేటాయించడం జరుగుతుంది అద్యాయన కేంద్రముయొక్క సమన్వయ అదికారి (కో ఆర్డినేటర్) ప్రతి 2వ శనివారములలోనూ ఆదివారములలో కాంటాక్టు-కమ్ కౌన్సెలింగ్ క్లాసులు నిర్వహించెదరు పని రోజుల సాయం సమయాలలో ఆడియో, వీడియో కార్యక్రమాలను నిర్వహిస్తారు ఆపీసులు ఫ్యాక్టరీలలో వుద్యోగాలు చేస్తున్నవారు గృహిణులు పని రోజులలో సాయం సమయములందు అద్యాయన కేంద్రాలకు వెళ్ళి ఆడియో విడియో పాఠాలను రిఫరెన్సు లైబ్రరీ సౌకర్యాలను వినియోగించుకొన కోరబడుచున్నారు

**దరకాస్తు ఫారం ఏవిధంగా పొందవచ్చును** పోస్టు ద్వారా

ఎ) రిజిస్ట్రార్ ఏ సి ఓపెన్ యూనివర్శిటి హైదరాబాద్ పేర్న రూ 10/-లకు డ్రా చేయబడిన క్రాస్ చేసిన డిమాండు డ్రాఫ్టును లేదా ఇండియన్ పోస్టల్ అర్డరును లిఖితపూర్వకమైన అభ్యర్ధన వుత్తరంతో పాటు జతపర్చి, డైరెక్టర్ స్టూడెంట్ సర్వీసెస్ బ్రాంచి, 8-3-952/10/6&7 శ్రీనగర్ కాలనీ రోడ్, పంజాగుట్ట, హైదరాబాద్-500016 వారికి పంపి, వారి ఆపీసు నుంచి పోస్టు ద్వారా మాత్రమే దరఖాస్తులు పొందాలి అభ్యర్ధనలు పంపుతున్న కవరు పైబాగంలో **"Application for Direct Admission to I Year B A / B Com/B Sc, course for the academic Year 1987-88"** అని స్పష్టంగా వ్రాయాలి పోస్టు ద్వారా దరకాస్తులు పంపేందుకు అభ్యర్ధనలను 15-7-1987 వరకు మాత్రమే స్వీకరిస్తారు

**బి) స్వయంగా తీసుకొనుటకు** ది రిజిస్ట్రార్, ఏ పి ఓపెన్ యూనివర్శిటీ పేర్న రు 5/- (ఐదు రూపాయలు మాత్రం)లకు క్రాస్ చేసిన డిమాండ్ డ్రాఫ్టు లేదా ఇండియన్ పోస్టల్ అర్డరును దాఖలు చేసుకొని డైరెక్టర్ స్టూడెంట్ సర్వీసెస్ వారి ఆఫీసునుంచి పై అడ్రసులో దరకాస్తు పారాలు స్వయంగా తీసుకొనవచ్చును

**సి) రిజిస్ట్రార్ ఏ పి ఓపెన్ యూనివర్శిటి వారి పేర్న రు 5/-లకు క్రాస్ చేసిన డిమాండు డ్రాఫ్టు లేదా ఇండియన్ పోస్టల్ అర్డరును దాఖలు చేసుకొని ఈక్రింది జంట నగరాలు, జిల్లాలలో నెలకొల్పబడిన ఏ. పి ఓపెన్ యూనివర్శిటి** స్టడీ సెంటర్ల కోఆర్డినేటర్ల నుండి కూడా సా 3-00 నుంచి 6-00 గం మద్య (గురువారాలు, పబ్లిక్ శెలవు దినములలో తప్ప) కూడా స్వయంగా దరకాస్తు పారాలు తీసుకొనవచ్చును

**1) జంట నగరాలు** 1) కాచిగూడా జూనియర్ కళాశాల 2) డి బి పి ఎం కళాశాల సికింద్రాబాద్ (కీస్ హైస్కూలు ఆవరణలో) 3) ప్రభుత్వ స్త్రీల కళాశాల బేగంపేట (హైదరాబాద్ పబ్లిక్ స్కూలు ఎదురుగా)

**2 జిల్లాలలో** 1) ఆదిలాబాద్ ప్రభుత్వ డిగ్రీ కళాశాల 2) అనంతపూరు ప్రభుత్వ డిగ్రీ కళాశాల 3) కడప ప్రభుత్వ డిగ్రీ కళాశాల, 4) ఏలూరు సర్ సి ఆర్ రెడ్డి కళాశాల 5) గుంటూరు జె కె సి కళాశాల 6) కరీంనగర్ ఎస్ ఆర్ ఆర్ ప్రభుత్వ కళాశాల 7) ఖమ్మం ఎస్ ఆర్ అండ్ బి జి ఎన్ ఆర్ ప్రభుత్వ కళాశాల 8) కర్నూలు సిల్వర్ జూబిలీ ప్రభుత్వ కళాశాల 9) మహబూబ్‌నగర్ ఎం వి ఎస్ ఆర్ట్సు అండ్ సైన్స్ కళాశాల 10) నల్గొండ నాగార్జున ప్రభుత్వ కళాశాల 11) నెల్లూరు శ్రీ సర్వోదయ కళాశాల 12) నిజామాబాద్ సిరిరాజ్ ప్రభుత్వ కళాశాల 13) ఒంగోలు సి ఎస్ ఆర్ శర్మ కళాశాల 14) రాజమండ్రి ప్రభుత్వ డిగ్రీ కళాశాల 15) సిద్దిపేట ప్రభుత్వ డిగ్రీ కళాశాల 16) శ్రీకాకుళం ప్రభుత్వ డిగ్రీ కళాశాల, 17) తిరుపతి ఎస్ వి ఆర్ట్సు కళాశాల 18) విజయవాడ పి బి సిద్దార్ధ కళాశాల 19) విశాఖపట్నం డా వి ఎస్ కృష్ణ సైన్స్ కళాశాల, 20) విజయనగరం మహారాజకళాశాల 21) వరంగల్ ఆర్ట్సు అండ్ సైన్స్ కళాశాల (కాకతీయ యూనివర్శిటి కాంపస్ - సుబేదారి) 22) సిర్‌పూర్ కాగజ్‌నగర్ ప్రభుత్వ జూనియర్ కళాశాల 23) హిందూపురం ఎస్ టి జి ఎస్ కళాశాల 24) పోలవరం ప్రభుత్వ జూనియర్ కళాశాల 25) పెద్దపల్లి ప్రభుత్వ జూనియర్ కళాశాల 26) గోదావరి ఖిని ప్రభుత్వ జూనియర్ కళాశాల 27) కొత్తగూడెం కె వై కె ఆర్ వై అండ్ బి ఎన్ గౌడ్ ప్రభుత్వ జూనియర్ కళాశాల 28) షాద్‌నగర్ ప్రభుత్వ జూనియర్ కళాశాల 29) ఆలేర్ ప్రభుత్వ జూనియర్ కళాశాల 30) కావలి జవహర్ భారతి కళాశాల 31) బన్స్‌వాడ ప్రభుత్వ జూనియర్ పి ఆర్ కళాశాల, 32) పిఠాపురం ఆర్ ఆర్ బి హెచ్ ఆర్ ప్రభుత్వ జూనియర్ కళాశాల, 33) కాకినాడ పి ఆర్ ప్రభుత్వ కళాశాల 34) సంగారెడ్డి తారా ప్రభుత్వ డిగ్రీ కళాశాల 35) చిత్తూరు పి వి కె ఎన్ ప్రభుత్వ డిగ్రీ కళాశాల, 36) కుప్పం హెచ్ ఎఫ్ సి ప్రభుత్వ కళాశాల 37) సత్యవీడు ప్రభుత్వ జూనియర్ కళాశాల, 38) మచిలీపట్నం ఆంధ్ర జాతీయ కళాశాల, 39) యలమంచిలి ప్రభుత్వ జూనియర్ కళాశాల 40) ములుగ్ ప్రభుత్వ జూనియర్ కళాశాల, 41) వికారాబాద్ ఎస్ ఏ పి ఆర్ట్సు అండ్ సైన్స్ కళాశాల 42) ఖమ్మం ప్రభుత్వ డిగ్రీ స్త్రీల కళాశాల 43) మార్కాపురు ప్రభుత్వ జూనియర్ కళాశాల

దరఖాస్తు పారమును 19-6-1987 నుండి **20-7-1987** వరకు జంట నగరాలలోనూ

**24-6-1987 నుండి 20-7-1987 వరకు జిల్లాలోనూ పొందవచ్చును**

**★ నిర్ణీత రుసుముతో సహా భర్తీ చేసిన దరకాస్తు ఫారాలను డైరెక్టర్ స్టూడెంట్ సర్వీసెస్, ఆంధ్రప్రదేశ్ ఓపెన్ యూనివర్శిటికి చేరవలసిన ఆఖరు తేది · 27-7-1987 న లోపున**

**సం. రిజిస్ట్రార్**










నచ్చచెపుతూనే వున్నారు

కాని గడప అవతల నిల్చున్న అచ్యుతరామయ్య గారికి మనసంతా చెదిరినట్టయ్యింది తలంతా గిర్రున తిరుగుతున్నట్టు తోచింది

ఇంక అక్కడ నిల్చోలేక గబగబా చీడీలు దిగి పూలమొక్కల దగ్గరకి వచ్చేశాడు

అలా తలుపు చాటుగా నిల్చుని భార్యా భర్తల సంభాషణ వినటం వివేకవంతుల లక్షణంకాదు పైగా వాళ్ళిద్దరూ వాగ్వివాదపడుతున్న సమయంలో లోపలికి వెళ్ళటం కూడా ఉచితమనిపించుకోదు సరికదా అసలు అవధానిగారి దగ్గరకి వెళ్ళాలా? వద్దా?' అన్న మీమాంసలో పడ్డాడు అచ్యుత రామయ్య

అయినా

అవధానిగారు కాలం కర్మ కల్సిరావాలి విధి అంటూ అలా వేదాంత ధోరణిలో మాట్లాడుతున్నా డేమిటి? ఆయన జాతక చక్రం వేస్తే తిరుగులేదని, ముహూర్తం పెడితే మిన్ను విరిగి మీదపడ్డా శుభ కార్యం జరిగిపోవాల్సిందేనని, ఏవైనా చిన్నచిన్న దోషాలు వున్నా పోగొడతాడని ఊరూ వాడా ఆయన గురించి గొప్పగా చెప్పుకుంటారు కదా? కాని కూతురు విషయంలో ఆయన వేదాంతం మాట్లాడు తున్నాడేమిటి? కాలం కల్సిరావాలి అనుకుంటే తను యింతదూరం రావాల్సిన పనిలేదు ఇంత జ్యోతిష్శాస్త్ర పండితుడు అయివుండి కూడా కూతురి పెళ్ళి చెయ్యలేకపోవటం విడ్డూరమే! పెరటి చెట్టు వైద్యానికి పనికిరాదు అన్న సామెత ఆయన విషయంలో నిజం అయ్యిందా? లేక

అచ్యుతరామయ్యకి ఆలోచిస్తుంటే బుర్ర వేడెక్కుతూంది

లోపలికి వెళ్ళాలా? వద్దా??' అన్న సందిగ్ధంలో గేటు దగ్గరే తచ్చాడుతూ నిల్చుండిపోయాడు

ఎంతో ఆశతో, నమ్మకంతో అక్కడికి వచ్చాడు

కాని లోపలి సంభాషణ విన్నాక ఆ నమ్మకం నీళ్ళుకారిపోయింది అడుగులోనే హంసపాదు అయ్యింది

ఆలోచన్ను తెగటంలేదు

## జాతకం

ఇంతలో -

"హలో అచ్యుతంగారూ! కులాసానా?' అంటూ పరిచితమైన పలకరింపు వినిపించింది

ఊరుకాని ఊళ్ళో ఎవరా అన్న ఆశ్చర్యంతో తల తిప్పిన అచ్యుతరామయ్యకి ఎదురుగా చిరునవ్వుతో పద్మనాభశర్మ కనిపించాడు

ఇద్దరూ కొలీగ్స్ ఐదు సంవత్సరాల క్రితం ఒకే ఆఫీసులో ఒకే సెక్షన్‌లో పనిచేశారు ట్రాన్సుర్స్ దృష్ట్యా ఇద్దరూ విడిపోయారు

కుశల ప్రశ్నలు అయిన తరువాత-

ఏమిటి? గేట్లోనే నిల్చుండిపొయ్యారు? అవధాన్లుగారిని కలిశారా?? లేక ఆయన ఇంట్లో లేరా?

గబుక్కున పద్మనాభశర్మ చేతిని పట్టుకొని గబగబా గేటు యివతలకి తీసుకువచ్చి మనసులో సందేహాన్ని బయటపెట్టాడు అచ్యుతరామయ్య

ఆయనకి కలిగిన ధర్మసందేహాన్ని వింటూనే పకపకానవ్వాడు పద్మనాభశర్మ

మీ యిల్లు బంగారం కానూ! ఇదా మీ అనుమానం? అవధాన్లుగారు అన్నదాంట్లో అసత్యం ఏముంది? మరి దేనికైనా కాలం కలిసిరావాలి అలా అనుకొని చేతులు ముడుచుకొని కూర్చోలేంకదా? మన ప్రయత్నం మనం చెయ్యాలి ఎంత పాండిత్యం వున్నా, శాస్త్రం తెల్సినా బ్రహ్మ రాసిన ఆ నుదుటి రాతని ఎవరు మార్చగలరు చెప్పండి?

మరి అపాటి దానికి ఈ శాస్త్రం, పాండిత్యం ఎందుకు? ప్రచారం ఎందుకు?

పద్మనాభశర్మ పకపకానవ్వాడు మళ్ళీ

ప్రచారం దానంతట అదే రావాలిగాని మనం చేసుకుంటే వస్తుందిటండి? అన్నాడు నవ్వు ఆపకుండా

!

"ఎంత అమాయకులండి మీరు? ఒక చిన్న ఉదాహరణ:

వైద్య శాస్త్రం క్షుణ్ణంగా చదువుకున్న ఓ పెద్ద డాక్టరు వున్నాడనుకోండి చావు బ్రతుకుల మధ్య వూగిసలాడుతూ తన దగ్గరకి వచ్చిన పేషంటుకి తన శాయశక్తులా వైద్యం చేస్తాడు భూమ్మీద నూకలుంటే బ్రతుకుతాడు లేదా హరీ మంటాడు అంతమాత్రంచేత ఆ డాక్టరు చేతకాని వైద్యం చేశాడని, అసలు వైద్య శాస్త్రమే అభూత కల్పన అనీ అనగలమటండి? ఇదీ అంతే! ఈ రోజుల్లో గుండెని తీసి గుండె పెడుతున్నారు గుండె మార్పిడి జరిగాక పదేళ్ళు బ్రతికిన వాళ్ళూ వున్నారు ఆపరేషన్ బల్లమీదే చచ్చినవాళ్ళూ వున్నారు ఇక్కడ శాస్త్రం యొక్క లోపం అనుకోకూడదు కర్మ సిద్ధాంతమే వర్తిస్తుంది

అంతే నంటారా?

నా అభిప్రాయమైతే అంతే గత పది సంవత్సరాలు మా కుటుంబం అంతా, పిల్లా పాపలకి పెళ్ళిళ్ళు, బాలసారెలూ గృహప్రవేశాలు, ఒడుగులు యిలా ఏ చిన్న కార్యం వచ్చినా మాకు అవధానిగారు ముహూర్తం పెట్టాల్సిందే మా కుటుంబంలో ఎవరికైనా జాతక రీత్యా అశుభాలున్నా, దోషాలు, గండాలు వగైరా లున్నా అవధానిగారే పరిష్కారం చూపి, పూజలు అన్ని చేయిస్తారు ఆ తరువాత అన్ని సవ్యంగా నిర్విఘ్నంగా జరిగి పోయిన సంఘటనలు మా కుటుంబంలో ఎన్నో వున్నాయి అయినా ఎవరి నమ్మకం వాళ్ళది అనుకోండి మాకు మాత్రం ఆయన మాట వేదవాక్కు నిరుడు మా అమ్మాయి పెళ్ళి చేద్దాం అనుకున్నాను కాని అవధానిగారు ఈ ఏడాదికి వాయిదా వెయ్యమని , ఫలానా నెల్లో మంచి సంబంధం వస్తుంది, ఆ సంబంధం ఖాయం చెయ్యమని చెప్పారు అక్షరాలా అలాగే జరిగింది. ఇప్పుడు పెళ్ళి ముహూర్తం పెట్టించుకుందుకు వచ్చాను ఆపైన మీయిష్టం అంటూ గేటు తెరిచి అవధానిగారింట్లోకి నడిచాడు పద్మనాభశర్మ

ఏ పుట్టలో ఏ పాముందో? ఒకసారి అవధానిగారి దగ్గరకి వెళ్ళిరండి అన్న భార్య మాటలు మనసులో మెదులుతుంటే పద్మనాభశర్మని అనుసరించాడు అచ్యుతరామయ్య □



# దూరదర్శనం

లత

## చక్రవర్తి

ఈ తడవ చక్రవర్తి భార్య అంటే డైవోర్సీ అని మనం అర్థం చేసుకోవాలి కూతురుని చూడటానికి చక్రవర్తి ఇంటికి వస్తుంది పొరపాటున యూనివర్సిటీ ఫంక్షన్‌కి మాజీ భార్య పేరు పడుతుంది కార్డుల మీద చక్రవర్తి మండిపడి కుమార్ అనే ఫిలిం స్టార్‌ని పిల్చుకు రమ్మని ప్రేమ్‌ని పంపుతాడు అక్కడ పార్వతి ఉంటుంది ఆమె కుమార్ భార్య అయ్యా ఇదీ కథ

తెలుగు ప్రోగ్రాంల మధ్య హిందీ వారి జాబులూ జవాబులూ హిందీలో వచ్చాయేమిటి? ఈ రోజు నుంచీ అవి రిలే చేస్తారా? మళ్లీ తర్వాత రేపటి ప్రోగ్రాంలు గురించి తెలుగులో సెలవిచ్చారు

## కష్మాకష్

ఇదెప్పుడో చాలా కాలం కిందట నృత్య రాగిణులు వేశ్యలై ఉండగా జరిగిన కథ ఒక పెద్ద మనిషికి చురుకయిన భార్యా అందమైన వేశ్యా ఉన్నారు కొడుకు పెళ్ళికి ఆ వేశ్య పాడాలని నలుగురూ కలిసి భార్యని ఒప్పిస్తారు వేశ్య సంగీతంలో తన గర్వం చూపిస్తుంది దాసీది నజరానా తెస్తుంది చూశావా నీవు నాకు ఇవ్వక తప్పదు అన్నట్లు చూస్తుంది వేశ్య ఇల్లాలు కొడుకుని పిలిచి అతని తల చుట్టూ రూపాయలు తిప్పి ఆమెని ఒడి పట్టమంటుంది గోడలన్నీ నీవు వెలయాలివి అంటాయి కథ ఎవరు వ్రాశారో ఎప్పటి లాగానే చెప్పలేను ఇది ఆఖరి కథ

## స్వరరాగ సుధ

ఈ మహాసంగీత సౌందర్యాన్ని దారా వాహికం అంటారు ఎనౌన్సర్లు ఊర్వశిని అపులమ్మ అన్నట్లు ఇది నాటకమా దారా వాహికం అనటానికి? కాదు పత్రికలలో సీరియల్సుని దారా వాహికంగా వస్తున్న అంటారు అది టి వి కి నప్పదు స్వరరాగసుద – బాలమురళీకృష్ణ సంగీత సుదా సమర్పణ అనాలి

సరే ఖరహరప్రియ – ఈ రాగంలో నివేదన భక్తి ఉన్నాయి శ్రీ బాలమురళీ త్యాగరాజస్వామి కీర్తన – పేరిట నిన్ను పెంచిన వారెవరే శ్రీ రామయ్య – ఇది నేను ఇది వరకు వినలేదు చాలా అరుదుగా గాయకులు పాడతారనుకుంటాను జమున జానకీ బానుమతి గారి పక్కల నిలబడి విన్నాం ఆ సినిమాల పేర్లు ఎనౌన్స్ చేయాలి బాలమురళీ – సినిమా పాటలు విందామా? అని పాత రేడియో అలవాటు ప్రకారం అనకుండా ఎనౌన్సర్లు చేత ఎనౌన్స్ చేయిస్తే బాగుంటుంది

## వేట

రచన శశాంక – ఎలుక ఒకటి కొంపలో నానా ఇబ్బందీ పెడుతుంది ఆఖరికి ఇల్లాలి మంగళ సూత్రాలు పోయి దొరికినయ్ – పక్కింటి వంట చేసే పెద్దమనిషీ బానుమూర్తి స్నేహితులూ చందా అడిగేవాళ్ళూ మొత్తం మీద నాటకం బాగుంది

## జాబులు జవాబులు

తప్పిపోయిన వారి కార్యక్రమంలో మీ ఫోటో చూపించాలంటే – ముందు పోలీసులకు రిపోర్టు చేయాలండీ అప్పుడు మేం ప్రసారం చేస్తాం – ఇది ఈ వారం జోక్

## రధచక్ర

పిల్లవాడు మొదటివాడుగా పాసవుతాడు అసలు వాడు తల్లి మాట వినడు తోడి కోడళ్ళు బయంకరంగా పోట్లాడుకుంటారు కొంపలోంచి పోయిన పిల్లవాడి తండ్రి వస్తున్నానని వ్రాశాడు అసలివి ఇంత వరకూ రక్తి కట్టలేదు రచయిత ఎవరో స్క్రీన్ మీద చదవలేకపోతున్నాం

## ఆగదు ఉదయం

రచన దివ్య ప్రబాకర్ ఈ బాగంలో అమాయకపు బార్యకి పరశురామ్ నాజూకు వేషం– బాష– క్లబ్బుడాన్సు లాటివి నేర్పి ఆదునిక యువతిగా తీర్చి దిద్దాడు స్నేహితుల్లో అమ్మాయిలు ఆటల్లో ఐస్‌క్రీమ్ ఇవ్వడోయి తమ్ములు తింటాడు మొత్తానికి ఈ నాటకంలో నటనా దర్శకత్వం బాగున్నాయి నటులు బాగా చేస్తున్నారు

## అమృత

మొదటి బాగం– సంగీతం జయదేవ్ కవిత అమృత– శ్రీ జయశంకర ప్రసాద్ కవిత ఆదారంగా ఈ నాటిక ఆయన రచించిన కామాయని తెలుగులోకి వస్తే చదివాను అదొక ఉపనిషత్తు అని చెప్పవచ్చును అందులో గీతాల ఆదారంగా అమృత రూపొందించి నట్లున్నారు అమృత– కవితకి మరో పేరు అంటారు జయశంకర్ ప్రసాద్ ఈ సంగీత నాటిక మొదటి బాగం చాలా బాగుంది ముఖ్యంగా నాలాటి సంగీత ప్రియులకు

మొదటి బాగంలో బాల్యప్రేమ - యవ్వన ప్రవేశం వియోగం చూపించారు నాలుగు పాటలూ నాలుగు మదుర దారలు ఇన్‌స్పిరేషన్ అంటారే అలాటిది ఏదో కలుగుతుంది ఈ నాటిక అయేలోపల మంచి నవల వ్రాయాలని పిస్తోంది

## కామాక్షి కథ

-రచన బానుమతీ రామకృష్ణ ఇందులో పద్మనాబం– రోజారమణి నటించారు– కథ బాగుంది ఒక పనిమనిషి కామాక్షి అత్తగారినీ తిరుమలాన్నీ రెడ్డినీ అందర్నీ మాయపుచ్చి తన మొగుడు కొడతాడని సింపతీ సంపాదించి అయిదా రొందలు ఎట్టుకు పోయింది కథనంలో ఏ లోపంలేదు బానుమతిగారు సృష్టించిన అత్తగారిని ఆ పాత్రలో చూడలేక పోయినాం రోజారమణి కామాక్షిగా బాగా చేసింది ప్రకటించిన కార్యక్రమం వెన్నెల వేటలాగా ఉంది దాని బదులు కామాక్షి కథ చూపించిన టి వి వారికి దన్యవాదాలు– అయితే కథ చివర ఈ కథ విన్నవారికీ చూసిన వారికీ అంటూ హరిదాసులాగా పద్మనాబం గారిచేత అనిపించ నవసరం లేదేమో □






సీరియల్

# ప్రత్యూష పవనాలు

జి. భవానీ కృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

ఇల్లు అద్దె కిచ్చేసి, ఆ అద్దె, మిల్లుమీద వచ్చే ఆదాయం తల్లి పేరుమీద బ్యాంకులో జమ అయ్యే విధంగా ఏర్పాటు చేసి, తల్లిని ఒంటరిగా వదిలి రావడం ఇష్టంలేక ఆమె రానంటున్నా బలవంతంచేసి హైదరాబాదు తీసుకొచ్చాడు వేణు

కొడుకు చేసిన పనికి దుర్గమ్మ కాస్త శాంతించిందనే చెప్పాలి

వచ్చిన రోజే మాలతి అత్తగారి పక్కన కూర్చుని అత్తయ్యా! ఇక్కడ మీకే లోటు రాదు ఏ పని చెప్పినా చెయ్యడానికి పని మనుషులు ఉన్నారు వంటకి వంట మనిషి ఉంది మీ ఇష్టాలేమిటో చెప్పి చేయించుకోండి మీ అబ్బాయికి చెప్తాను ఏమైనా పుస్తకాలు తెప్పించమని అవి చదువుకుంటూ బాబుని ఆడిస్తూ, టి వి చూస్తూ, రేడియో వింటూ హాయిగా కాలక్షేపం చెయ్యండి అస్తమానూ బాధ పడుతూ కూర్చుంటే ఆరోగ్యం పాడవడం తప్ప మావయ్యగారు తిరిగిరారు పోయిన వాళ్ళతో మనమూ పోలేము అని చెప్పింది

నౌకర్లు, చాకర్లు నా కెందుకే తల్లీ పాతికేళ్ళు కాపురం చేసిన ఆయనే విడిచిపెట్టి పోయాక అంది గద్గదస్వరంతో

నిజమే అత్తయ్యా, స్త్రీకి భర్త అనురాగం ముందు అన్నీ దిగదుడుపే కానీ ఏం చేస్తాం? పరిస్థితులు ఎదురు తిరిగినప్పుడు తట్టుకుని నిలబడాలి గానీ బాధ పడుతూ కూర్చుంటే ప్రయోజనం ఏముంటుంది? అంది

భర్త పోయాక ఆవిడ దురుసుతనం కాస్త తగ్గడం గమనించి మావయ్యగారు బ్రతికి ఉండగా ఈమెలో ఈ మార్పు వచ్చి ఉంటే ఆయనెంతో సంతోషించేవారు అనుకుంది మాలతి

వేణు కొత్తగా కొన్న కార్లో అప్పుడప్పుడు తల్లిని, భార్యని ఎటైనా తిప్పి తీసుకొస్తూ, తల్లి మనసుకి సేద తీరేలా కబుర్లు చెప్తూ ఆమె బాధని మరిపించడానికి ప్రయత్నిస్తున్నాడు

ఒకరోజు రాత్రి నిద్రలో ఉండగా ఏదో దబ్బున క్రింద పడినట్లు శబ్దం వచ్చి ఉలిక్కిపడి లేచి కూర్చుంది మాలతి

ఒక ప్రక్క బాబు మరో ప్రక్క భర్త ఆదమరచి నిద్రపోతున్నారు ఒకసారి ఇద్దరినీ చూసి తలుపు తీసుకుని బయటికి వచ్చి తండ్రి గదిలోకి వెళ్ళింది

ప్రకాశరావుగారు సన్నగా గురక పెడుతూ నిద్రపోతున్నారు వెను తిరగబోతూ అత్తగారి గదిలో నుంచి మూలుగు వస్తున్నట్లు అనిపించి గబగబా అటు పరుగెత్తింది

పైనున్న సీలింగ్ ఫేనుకి చీర కట్టి క్రింది కొసని తన మెడకి బిగించుకుని కాళ్ళక్రింద ఉన్న కుర్చీని పక్కకి తన్నేసింది ఆ కుర్చీ క్రిందపడి మాలతికి మెలకువ తెప్పించింది చీర మెడకి బిగుసుకుంటూ ఉంటే ఊపిరి అందక ఉక్కిరి బిక్కిరి అయి మూలుగు బయటికి వస్తోంది

మాలతికి ఒక్క క్షణం మెదడంతా మొద్దుబారిపోయినట్లు అనిపించింది మరుక్షణంలోనే తేరుకుని గబాల్న వెళ్ళి అత్తగారి కాళ్ళు రెండు చేతులతో బిగించి వేలాడకుండా మనిషిని పైకి పట్టుకుని, ఏమండీ! తొందరగారండి అంటూ భర్తని గట్టిగా పిలిచింది కానీ గాఢ నిద్రలో ఉన్న వేణుకి ఆమె అరుపులు వినిపించలేదు

అసలే సుకుమారి అందులో ఏడు నెలల గర్భవతి అయిన మాలతికి అత్తగారి భారీ శరీరాన్ని అలా పట్టుకుని ఆపడం మహా కష్టంగా ఉంది

ఎంత పిలిచినా పలకని భర్తమీద చెప్పలేనంత కోపం వచ్చింది పనివాళ్ళు రాత్రి పూట ఎవరూ ఉండరు

ఏదో తెలియని మొండి ధైర్యం, పిచ్చిబలం ఆవహించినట్లు అనిపించగా దుర్గమ్మని అలా గట్టిగా పట్టుకునే ఒంటికాలిమీద మొత్తం బరువుని ఆన్చుకుని మరో కాలితో పక్కనున్న మంచాన్ని మధ్యలోకి లాగింది మెల్లగా ఆ మంచంమీద ఎక్కి ఒంటి చేత్తో అత్తగారిని గట్టిగా పట్టుకుని మరో చెయ్యి పైకి చాపి ఆమె మెడకి బిగుసుకుంటున్న చీర ముడిని అతి కష్టంమీద విప్పింది అత్తగారి భారీ శరీరాన్ని ఆపలేక ఆవిడతో సహా మంచంమీద కూలబడిపోయింది

ఆయాసంతో, భయంతో రొప్పుతూ రెండు క్షణాలు అలాగే రాయిలా కూర్చుండిపోయింది

కర్తవ్యం వెన్నుతట్టగా ఆదుర్దాగా పిలుస్తూ గ్లాసుతో నీళ్ళు తెచ్చి ముఖమ్మీద జల్లింది

కాసేపటికి కళ్ళు తెరిచి చూసింది దుర్గమ్మ

ఎలా ఉందత్తయ్యా! కళ్ళలో నీళ్ళు నిండుకోగా గాభరాగా అడిగింది

నన్నెందుకు బ్రతికించావే? ఆయనతో పాటు నేనూ పోయినా బాగుండేది అంటూ ముఖం పక్కకి తిప్పుకుందావిడ

అత్తయ్యా! అలా అనుకోవద్దని మీకు ఎన్నోసార్లు చెప్పాను ఇప్పుడు మీకేం లోటు వచ్చిందని? మావయ్యగారు ఆస్తి నా పేర రాశారనే కోపం మీకింకా పోలేనట్లుంది మీరు నన్ను ఇలా పరాయిదానిలా భావిస్తున్నారే గానీ, నేనెప్పుడూ మిమ్మల్ని అలా భావించలేదు మా అమ్మ నా చిన్నతనంలోనే పోయింది అత్తగారయినా, అమ్మ అయినా మీరేనని అనుకున్నాను మీ కోసం ప్రత్యేకంగా ఒక పని మనిషిని పెట్టాను మీరు ఏది అడిగినా విసుక్కోకుండా

**జరిగిన కథ– 14** మారుతీరావు కోరిక మీద ఆయన కొడుకు వేణుగోపాల్‌కు, ప్రకాశరావు కూతురు మాలతికి పెళ్ళి జరుగుతుంది మాలతికీ వేణుగోపాల్‌కూ మధ్య విబేదం సృష్టించాలని అత్త చేసిన ప్రయత్నాలు విఫలమవుతాయి ప్రకాశరావుకు పెరాలిసిస్ వస్తుంది మాలతి, వేణుగోపాల్ హైదరాబాద్‌లో కాపురం పెడతారు మారుతీరావు ఆస్తిలో సగం కోడలికి రాయడం చూసి అత్తగారికి కోపం పెరిగి పోతుంది ఆడబిడ్డ సుగుణ పెళ్ళి జరుగుతుంది మాలతికి కొడుకు పుడతాడు తీర్థయాత్రలకి వెళ్ళిన మారుతీరావుగారు గంగలో ఆత్మ త్యాగం చేసుకుంటారు ఆయన భార్య, కూతుళ్ళు ఆస్తికోసం దారుణంగా ప్రవర్తిస్తారు



చేసిపెట్టమని వంట మనిషికి చెప్పాను నన్ను అడగడానికి మీకు మొహమాటంగా ఉంటుందని, మీ పేర బ్యాంకులో ఉన్న డబ్బు డ్రా చేసి తెచ్చుకోవడం మీకు చేతకాదని అడపా దడపా డబ్బు ఇస్తూనే ఉన్నాను పోయిన మావయ్యగారిని తెచ్చివ్వలేనుగానీ, మీకు ఏ లోటూ రాకుండా వెయ్యి కళ్ళతో చూసుకుంటూనే ఉన్నాను పోనీ, మీకు ఇంకా ఏదైనా ఇబ్బందిగా అనిపిస్తే నాతో చెప్పచ్చు నేను పరాయిదాన్ని అనుకుంటే మీ అబ్బాయితో చెప్పచ్చు అంతేగానీ, ఇలా ప్రాణం తీసుకోవడం ఏమిటి? మెల్లగా ఆమెను లేపి గ్లూకోస్ నీళ్ళు తాగించింది

నువ్వేమీ నాకు లోటు చెయ్యడంలేదే కానీ  కానీ  నీ కెలా చెప్పనే అంటూ దిండులో ముఖం దాచుకుంది దుర్గమ్మ

ఫరవాలేదు చెప్పండత్తయ్యా పోనీ, మీ అబ్బాయిని లేపి తీసుకురానా? అనగానే వద్దన్నట్టు గాబరాగా మాలతి చెయ్యి పట్టుకుంది దుర్గమ్మ

మీరు చెప్పకపోతే నా కెలా తెలుస్తుంది? పోనీ, సావిత్రిని, సుగుణనీ, సుశీలని రమ్మని ఉత్తరాలు రాయమంటారా? వాళ్ళని చూడాలని ఉంటే చెప్పండి నామీద కోపంతో వాళ్ళు ఇక్కడికి రాలేమోనని భయపడొద్దు నేను వెళ్ళి వాళ్ళని బ్రతిమాలి అయినా తీసుకొస్తాను లేకపోతే మిమ్మల్ని దగ్గరుండి కార్లో తీసికెడతాను సరేనా? అనునయించింది, ఆవిడ తనని అన్న మాటలు తన పట్ల ప్రవర్తించిన తీరు పూర్తిగా మరచిపోయి

అదేంకాదమ్మా  సంశయించడం చూసి ఫంవాలేదు చెప్పండత్తయ్యా మావయ్యగారు నన్ను కన్నబిడ్డకంటే ఎక్కువగా అభిమానిస్తూ తన మనసులో ఉన్న ప్రతి మాటనీ ప్రతీ ఆలోచననీ నాకు చెప్పేవారు మీరు కూడా అలాగే భావించి చెప్పండి

ఈ రెండు మూడు నలలనుంచీ బయట అవ్వకపోతే ముట్టుడిగిపోతున్నా యనుకున్నాను కానీ  అప్రయత్నంగానే పొట్ట చేత్తో తడుముకుంది ఆవిడ

మొగాడ్! పిడుగుపడినట్టు అదిరి పడింది మాలతి

ఆ మాట ఆమె అప్రయత్నంగా పైకే అనడంవల్ల దుర్గమ్మ మొహం మరీ సిగ్గుతో ముడుచుకుపోయింది

# ప్రత్యూష పవనాలు

అందుకేనమ్మా ఏ మొహం పెట్టుకుని తలెత్తుకుని నలుగురిలో తిరగ్గలను?

తన తప్పు తెలుసుకుని నాలిక్కరుచుకుంది మాలతి

అత్తయ్యా! చావు ఈ సమస్యకి పరిష్కారం కాదు

చావక ఏం చెయ్యమంటావమ్మా సుశీలకి ఇప్పుడు పద్దెనిమిదేళ్ళు పద్దెనిమిదేళ్ళ తరువాత ఇప్పుడు ఆయన పోయాక ఛీఛీ! ఎవరైనా వింటే నవ్వుతారు కూడాను

ఎవరో నవ్వుతారనీ, ఏదో అనుకుంటారని ఈ లోకం చూడాలని తహతహలాడుతున్న పసిగుడ్డుని కడుపులో ఉండగానే అంతంచేస్తే చచ్చి స్వర్గాన ఉన్న మావయ్యగారి ఆత్మ శాంతిస్తుందా? మావయ్యగారికి పిల్లలంటే ఎంత ఇష్టమో మీకు తెలియనిదేముంది?

నిజమేనమ్మా కానీ కానీ

ఇంకేమీ మాట్లాడకండి

ఎలాగమ్మా అబ్బాయికి తెలిస్తే

అత్తయ్యా! ఆ విషయాలన్నీ నేను చూసుకుంటానుగా మీరు మరోసారి ఇలాంటి ప్రయత్నం చేశారంటే నామీద ఒట్టే అత్తగారికి ధైర్యం చెప్పి వంట గదిలోకి వెళ్ళి హార్లిక్స్ కలిపి తీసుకొచ్చి అత్తగారికి ఇచ్చింది

మాలతీ! నేను నిన్ను అనరాని మాటలు అని నీ పసి మనస్సుని గాయపరిచాను కక్ష తీర్చుకోవాల్సిందిపోయి నన్నింతగా అభిమానిస్తున్నావెందుకమ్మా జలజలా కన్నీళ్ళు కారాయి దుర్గమ్మ కళ్ళనుంచి

మృదువుగా నవ్వుతూ; అత్తయ్యా! మీరు అత్తగారు, నేను కోడల్ని మీరొకమాట అనొచ్చు నేను పడొచ్చు అంతమాత్రంచేత ఒకరినొకరు ద్వేషించుకుని, కక్షలు పెంచుకుంటామా? దేని దారి దానిదే ఇదే నేను ఇబ్బందిలో ఉంటే మీరు ఆదరించి అక్కున చేర్చుకోరూ? ఆ! మీరిక నిశ్చింతగా పడుకోండి అనవసరపు ఆలోచనలతో మనసు పాడుచేసుకోకండి అని చెప్పి ఫేను ఆన్ చేసి స్లోగా పెట్టి లైటు ఆర్పేసి బయటికి వచ్చి తలుపులు దగ్గరకు చేరేసి, తండ్రి గదిలోకి ఒకసారి తొంగిచూసి తన గదిలోకి వచ్చేసింది

మంచంమీద మధ్యగా కూర్చుని భర్తని గట్టిగా కుదిపి ఏమిటీ మొద్దు నిద్ర? విసుక్కుంది

ఆమె కోపానికి కారణం ఏమిటో తెలియక టైము చూసి "అర్ధ రాత్రి పన్నెండూ ఇరవై నిద్రపోక ఏం చెయ్యమంటావు? అయోమయంగా చూశాడు

నిజమే కానీ, నాకు మెలకువ రావడం ఒక్క నిముషం ఆలస్యం అయి ఉంటే కొంప మునిగిపోయేది?

ఏమైంది మాలా? ఏమిటలా ఉన్నావ్? ఏమైనా పీడ కల వచ్చిందా? ఆమెని దగ్గరకు తీసుకుంటూ లాలనగా అడిగాడు




కలా కాదు పాడూ కాదు అంటూ జరిగినదంతా చెప్పింది మాలతి

ఇప్పుడెలా? అయోమయంగా చూశాడు

ఎలా ఏమిటి? అలాగే మీ రీ విషయం తెలియనట్లే ఉండండి

సరేలే లేకపోతే ఇప్పుడు వెళ్ళి అవిట్నీ నాకు తమ్ముడు పుడతాడా? చెల్లెలు పుడుతుందా అని అడుగుతానేమిటి? అన్నాడు చేతులు తలకింద పెట్టుకుని వెల్లకిలా పడుకుంటూ

నిజంగా ఈ జీవితం ఎంత విచిత్రమైనదో కదూ! మనం అనుకున్నవేమీ జరగవు అనుకోనివెన్నో జరుగుతాయి ఏం జరిగినా అదే మహా ప్రసాదంగా భావించి తలవంచి భరించవలసినదే తప్ప కాదని విధికి ఎదురీదలేము హు! కడుపున పడగానే తండ్రిని కోల్పోయిన ఆ బిడ్డ ఏం బావుకుందామని ఈ లోకంలోకి రావాలని తహతహలాడుతోందో? అతని ఛాతీమీద తల ఆనించి స్వగతంలా అంది మాలతి

ఆమె అతనినుంచి సమాధానం ఆశించి ఆ మాటలు అనలేదు కనుక అతనూ ఏమీ మాట్లాడలేదు మెల్లగా తిరుగుతున్న సీలింగ్ ఫేను కేసి చూస్తూండడం తప్ప

కాసేపటికి దీర్ఘంగా నిట్టూర్చి వెళ్ళి లైటార్పేసి వచ్చి పడుకో నిద్ర మానుకుని ఇలా కూర్చుంటే రేపంతా తలనొప్పి అని బాధ పడతావు అన్నాడు వేణు

నిద్ర రావడంలేదు

అదే వస్తుంది కళ్ళు మూసుకుని పడుకుంటే

లైటార్పేసి వచ్చి భర్త ఎదమీద తలానించి పడుకుని కళ్ళు మూసుకుంది మాలతి ఆమె నడుము చుట్టూ చెయ్యి వేసి మరింత దగ్గరగా హత్తుకున్నాడు వేణు

* * * * * * * * * * *

మాలతికి కాళ్ళూ చేతులూ ఆడడంలేదు లోపలినుంచి అత్తగారు ఉండి ఉండి గట్టిగా అరుస్తూంటే ఆమె గుండె దడదడలాడుతోంది తను రెండు కాన్పులు కంది ప్రసవవేదన అంటే ఏమిటో తెలుసు కానీ, ఒక బిడ్డకి జన్మనివ్వడానికి అత్తగారు చావు బ్రతుకులమధ్య ఊగిసలాడుతూంటే ఆమెకి అగమ్యగోచరంగా ఉంది

ఒడిలో ఉన్న పాప పాలకోసం చేత్తో తడుముకుని ఏడుస్తుంటే యాంత్రికంగా పైట భుజాలచుట్టూ కప్పుకుని రొమ్ము అందించింది ఆకలి తీరిన పాప అలాగే నిద్రపోయింది

కొడుకు చెయ్యి పట్టుకుని వేణు అక్కడే కాలు కాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతున్నాడు

భార్యాభర్తలిద్దరూ ఎదురు ఎదురుగానే ఉన్నా ఏమ్మాట్లాడుకోడానికీ ఇద్దరికీ నోరు పెగలడం లేదు, అపరిచిత వ్యక్తుల్లా ముఖముఖాలు చూసుకోవడం తప్ప

అంతకుముందు రోజు ప్రొద్దుటనుంచీ ఏకధాటీగా నొప్పులు పడుతూనే ఉంది దుర్గమ్మ

నొప్పులు ప్రారంభం కాగానే తీసుకొచ్చి ఆస్పత్రిలో చేర్చింది మాలతి

నెలలు నిండుతున్నకొద్దీ కొడుకు ఎదుట పడడానికే సిగ్గుపడి తప్పించుకుని తిరిగింది దుర్గమ్మ తల్లిని ఇబ్బంది పెట్టడం ఇష్టంలేక తనూ సాధ్యమైనంత వరకూ తప్పించుకునే తిరిగాడు వేణు

తల్లికి నొప్పులు ప్రారంభం అయ్యాయని చెప్పినప్పుడు గాభరా పడినా ధైర్యంగా తల్లి ముందుకి వెళ్ళలేక మాలతినే ఆస్పత్రికి తీసికెళ్ళమని చెప్పి అవసరం అయితే ఫోను చెయ్యమని తను కంపెనీకి వెళ్ళిపోయాడు వేణు

తీరా వెళ్ళాడన్నమాటే గానీ, మనసు ఆగక అరగంట అయినా గడవకముందే ఆస్పత్రికి వచ్చేశాడు

ఆ రోజంతా గడిచిపోయింది దుర్గమ్మకి ప్రసవం కాలేదు పరిస్థితి ప్రమాదకరంగా ఉందని, ముందుగా ఏమీ చెప్పలేమని డాక్టర్లు చెప్పడంతో గాభరా మరింత ఎక్కువైంది మాలతి, వేణులకి

మాలతి సలహామీదట చెల్లెళ్ళు ముగ్గురికీ టెలిగ్రాములు ఇచ్చేశాడు







తల్లి గర్భవతియైన విషయం వాళ్ళకి అసలు తెలియనే తెలియదు జరుగరానిదేదైనా జరిగితే మాకెందుకు తెలియజేయలేదు అని వాళ్ళచేత అడిగించుకునే పరిస్థితి ఎదురవకుండా ముందు జాగ్రత్త చర్యగా అలా చెప్పింది మాలతి

ఆ రాత్రి దుర్గమ్మకి ఆపరేషను చేసి బిడ్డని బయటికి తీశారు ఆడపిల్ల

కాసేపటికే దుర్గమ్మకి స్పృహ వచ్చింది

కళ్ళు తెరిచి మాలతిని, ఆత్రంగా తన వైపే చూస్తున్న కొడుకునీ చూసింది కళ్ళల్లో నీళ్ళు నిండుకుంటూండగా "మాలతీ! నేను నిన్ను ఎన్నో బాధలు పెట్టాను అయినా నువ్వు నన్ను కడుపులో పెట్టుకుని ఆదరించావు అలాగే నిర్భాగ్యురాలైన ఈ బిడ్డని " ఆపైన మాట రాక తల పక్కకి తిప్పుకుంది దుర్గమ్మ

'అత్తయ్యా! మీరేమీ బాధ పడకండి ఈనడం వరకే మీ వంతు ఇకనుంచీ పాప నాబిడ్డ నా ఒడిలో ఉన్న ఈ చిన్నారి పాపమీద ప్రమాణంచేసి చెప్తున్నాను ఆ విషయం గురించి మీరేమీ దిగులు పెట్టుకోకండి మీరు తొందరగానే కోలుకుంటారు "అత్తగారి చేతిలో చెయ్యి వేసి గట్టిగా పట్టుకుని మరో చేత్తో ఆమె తల నిమరసాగింది

తన చేతిలో బిగుసుకుని ఉన్న అత్తగారి చేతి పట్టు సడలటం గమనించి గాభరా పడుతూ, అత్తయ్యా! పిలుస్తూ కుదిపింది మాలతి

కదల్లేదు దుర్గమ్మ

భయంగా భర్త వైపు చూసింది

వేణు వెళ్ళి డాక్టర్ని పిలుచుకొచ్చాడు

డాక్టరు వచ్చి దుర్గమ్మని పరీక్ష చేసి, అయామ్‌సారీ అంటూ తల దించుకుని అక్కడినుంచి వెళ్ళిపోయింది

చేత్తో మొహం కప్పుకున్నాడు వేణు

మాలతి దుఃఖాన్ని బలవంతంగా ఆపుకుంటూ ఓదార్పుగా భర్త భుజాన్ని నొక్కింది

నాన్నా! బామ్మ కేమైంది? అమాయకంగా అడుగుతున్న ప్రహ్లాద్‌ని ఎత్తుకుని ఆ పసివాడి మెడ ఒంపులో ముఖం దాచుకున్నాడు వేణు

దుర్గమ్మ పక్కలో ఉన్న పసిపాప కేరు కేరున ఏడుస్తుంటే తన చేతుల్లో ఉన్న ప్రత్యూషని భర్తకి అందించి ఆ పసిపాపని ఎత్తుకుని అపురూపంగా గుండెలకి హత్తుకుంది మాలతి

దుర్గమ్మ మృత శరీరాన్ని కార్లో ఇంటికి తీసుకొచ్చారు

పిల్లల్ని నిద్ర పుచ్చి, మౌనంగా రోదిస్తూ భార్యాభర్తలిద్దరూ దుర్గమ్మ శవానికి కాపలా కాశారు

ఒడిలో ఉన్న పసిపాప ఆకలితో ఏడుస్తుంటే పూర్తిగా కళ్ళయినా తెరవని ఆ పసిగుడ్డుకి పోత పాలు పట్టడానికి మనస్కరించక తనస్తన్యంతో పాప కడుపు నింపింది

భార్య ఔదార్యానికి గుడ్లప్పగించి చూడడంతప్ప ఏమీ మాట్లాడలేక పోయాడు వేణు

అతనికి ఒక్కసారిగా దుఃఖం ముంచుకొచ్చింది ముడుకుల్లో మొహం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చాడు

మాలతి మెల్లగా అతని దగ్గరకు నడిచి, పక్కన కూర్చుని అతని జుట్టులోకి వేళ్ళు దూర్చి చూడండి మీరు ఇంచుమించు పాతిక సంవత్సరాలు తల్లిదండ్రుల అనురాగాన్ని చవిచూశారు కానీ, ఇంకా కళ్ళయినా తెరవని ఈ పసిపాప కడుపున పడగానే తండ్రిని, ఈ భూమిమీద పడగానే తల్లిని కోల్పోయి అమాయకంగా నిద్రపోతోంది ఈ పాపకంటే మీరు ఎంత అదృష్టవంతులో ఆలోచించండి మీలాగే మీ తండ్రి రక్తాన్ని పంచుకుని పుట్టింది ఈ పాప ఇకనుంచి తల్లి అయినా, తండ్రి అయినా, అన్న అయినా మీరే ఈ పాపకి" అంది

వేణు తలపైకెత్తి "మాలతీ, ఇందాకా నువ్వు నీ పాలతో పాప కడుపు నింపినప్పుడే ఈ పాప మనపాప అయిపోయింది ఇకనుంచీ మనకి ముగ్గురు పిల్లలు మాలతీ" అన్నాడు పాపనే రెప్పవాల్చకుండా చూస్తూ.

నిద్రపోతున్న పాపని తీసికెళ్ళి ప్రహ్లాద్, ప్రత్యూషల పక్కన మెత్తని పక్క పరిచి పదిలంగా పడుకోబెట్టి వచ్చింది మాలతి

మారుతీరావుగారు పోయినప్పటినుంచీ పూర్తిగా మంచంలోనే ఉంటున్న ప్రకాశరావుగారికి దుర్గమ్మ మరణవార్త తెలియకుండా పనివాళ్ళందరినీ హెచ్చరించింది మాలతి

గంభీరమూర్తిలా కూర్చునిఉన్న భర్తని మాట్లాడించే ధైర్యంలేక గుడ్లప్పగించి చూస్తూ కూర్చుంది మాలతి

* * * * * * * * *

చెల్లెళ్ళు ముగ్గురూ వచ్చాకగానీ తల్లి మృత దేహానికి దహన సంస్కారాలు జరపలేదు వేణు

ముగ్గురూ వచ్చి తల్లి శవం చుట్టూ చేరి బుడిబుడి దీర్ఘాలు తీస్తూనే ఇంత పని చేస్తావనుకోలేదే అమ్మా ఇంకా నిన్ను తీసికెళ్ళి కొన్నాళ్ళు మా యింట్లో ఉంచుకుందామనుకున్నాను మా ఆయనకి రోజూ చెప్తూనే ఉన్నాను వెళ్ళి మా అమ్మని తీసుకురండని రాలేదు కనుక సరిపోయింది వచ్చి ఉంటే అక్కడ మా అత్తవారింట్లో ఈ సంగతి తెలిసి నేను నవ్వులపాలయ్యేదాన్ని అని ఒకరంటే, నేనూ అలాగే అనుకున్నానే అక్కా. కానీ, మా ఆయన మీ అమ్మ పేరనున్న ఆస్తి కోసం, మీ అమ్మ మెడలో ఉన్న బంగారం కోసం తీసుకెడుతున్నాం అనుకుంటారు మీ వాళ్ళు అంచేత అలాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలు మానేసి వీలున్నప్పుడు నువ్వే వెళ్ళి నాలుగు రోజులు ఉండిరా మీ అమ్మ దగ్గర అన్నారు వచ్చి నాలుగు రోజులుందాం అనుకుంటూండగానే ఈ ఘోరం జరిగిపోయింది అని మరొకరు

వాళ్ళ మాటలు వింటూంటే మాలతికి చెప్పలేనంత అసహ్యం వేసింది అయినా మౌనంగా చూస్తూ ఊరుకుంది




డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

స హెచ్ సి – ఖరగ్‌పూర్

మా ఇంట్లో అందరికీ పేలు, ఈపేలు ఎక్కువగా వున్నాయి తగ్గేందుకు మందు చెప్పండి

బెంజైల్ బెంజొయేట్ 20 శాతం మందు గాని, గామా బెంజీన్ హెక్సాక్లోరైడ్ గాని పై పూతగా వాడవలసి ఉంటుంది అయితే దీనిని క్రమ బద్ధంగా పూయవలసి ఉంటుంది

తలకు బాగా స్నానం చేసి, తడి ఆరిన తర్వాత అన్ని వెంట్రుకలకి కుదుళ్ళ నుంచి చివరిదాకా అంటేట్లుగా పై మందుని పూసి 12 గంటలు నాన నివ్వాలి తర్వాత మరలా తలస్నానం చేయాలి ఇలా వరుసగా మూడు రోజులు చెయ్యటం అవుసరం ఇంట్లోని ప్రతివారూ ఒకేసారి ఈ మందు వాడాలి దువ్వెనలు వేరుగా వుంచాలి తలగడ గలీబులు, దుప్పట్లు మొదలైన వాటిని నీళ్ళలో ఉడికించి వాడితే తిరిగి పేలు వచ్చే అవకాశం వుండదు

పి ఆర్ సి – రేణిగుంట

పిట్యూటరి గ్రంధుల వల్ల విపరీతంగా లావు అవుతారని విన్నాను లావు తగ్గటానికి మందులు వున్నాయన్నారు అవి తెలియపర్చండి

లావయిన వారందరూ పిట్యూటరీ గ్రంది పనితనం వల్లనే లావు అవటం జరగదు మితిమీరి ఆహారం తినటం, శరీర వ్యాయామం లేక పోవటం వల్ల ఎక్కువగా శరీరం లావు అవుతూ ఉంటుంది లావు తగ్గటానికి ఆహారం తగ్గించటం, క్రమ బద్ధంగా వ్యాయామం చెయ్యటమే మంచి మందు తినేటప్పుడు మారు వేయించుకోక పోవటమే తగిన మందు

ఎం యస్ ఎన్ – ఖుర్దారోడ్

లెప్రొసి అంటువ్యాది కాదా? దీనికి మంచి వైద్యము మరియు పరిశోధనగల కేంద్రములు ఎక్కడవున్నాయో తెలియ జేయండి

'లెప్రొసి' అంటురోగమే అయినా ఈ రోగం అంటు కోవ టానికి చాలా ఏళ్ళు పడుతుంది అదీ కాక లెప్రసితో బాధపడే వారందరి దగ్గర నుండి ఈ రోగం ఇతరులకు అంటదు లెప్రొమేటస్ లెప్రొసి అనే రకంతో బాధ పడే వారివద్ద నుంచి ఈ రోగం వచ్చే అవకాశం ఎక్కువ అయితే కుష్టు రోగులలో ఈరకం వారి శాతం 15 మాత్రమే ఈ రోగం ఎలా అంటేదీ ఇంతవరకూ తెలియదు

మనదేశంలో కుష్టు రోగచికిత్సకి లెప్రొసికంట్రోల్ యూనిట్లు ఉన్నాయి మీ ప్రాంతంలో గూడా ఒకటి వుండే ఉంటుంది చెంగల్పట్టులోని సి ఎల్ టి ఆర్ అయి మొదలైనవి ఈ రోగానికి గాను ఎన్నో పునః పరిశీలనా, చికిత్సా కార్యక్రమాలను నిర్వహిస్తున్నవి □

## ప్రత్యూష పవనాలు

తల్లి మృతదేహాన్ని అగ్నికి ఆహుతిచేసి కొడుకుగా తన కర్తవ్యాన్ని నిర్వర్తించాడు వేణు

కర్మకాండ అంతా యదావిదిగా జరిగింది

తమ ఊరికి ప్రయాణం అవుతూ సావిత్రి అన్న మాటలకి మాత్రం మౌనంగా ఉండలేకపోయింది మాలతి

ఒరే అన్నయ్యా! కడుపున పడగానే నాన్నని భూమ్మీద పడగానే అమ్మని మింగిన ఈ ముదనష్టపు పిల్లని ఏ రోడ్డు వారనో పారెయ్యక ఇంటికి ఎందుకు తెచ్చావు? పసిపిల్లలున్న ఇల్లాయె నీది వాళ్ళు పది కాలాలపాటు చల్లగా ఉండాల్సినవాళ్ళు ఈ ముదనష్టపు గాలి సోకితే ఈ యింటికి కూడా అరిష్టం పట్టుకుంటుంది అంచేత ఈ పిల్లని తీసికెళ్ళి మధ్యలోనే సావిత్రి మాట పూర్తి కాకముందే మాలతి సావిత్రి ఎదురుగా వచ్చి తీక్షణంగా చూస్తూ సావిత్రీ! కడుపున పడగానే తండ్రిని కోల్పోయినా పుట్టగానే తల్లిని కోల్పోయినా దానికి పాప ఎంతమాత్రం బాద్యురాలు కాదనే చిన్న విషయం నీకు తెలియకపోవడం దురదృష్టం తోడ బుట్టిన చెల్లెల్ని ఏ రోడ్డువారనో పారేయమని చెప్పడానికి నీకు నోరెలా వచ్చిందో నాకు అర్థం కావడం లేదు

ఇంకా కళ్ళయినా తెరవని ఈ పసిపాప పవిత్రమూర్తి తప్ప ముదనష్టపుది ఎంతమాత్రం కాదు ఈ పాప గాలి సోకితే అరిష్టం అనుకున్నవాళ్ళు ఈ యింటికి ఇంక రావడం మానెయ్యవచ్చు ఎందుకంటే ఈ పాప మా మూడో బిడ్డగా ఈ యింట్లోనే పెరుగుతుంది మావయ్యగారు మీకు ఇచ్చిన ఆస్తిపాస్తులు ఈ పాపకి మీరేమీ పంచక్కరలేదు అత్తయ్యగారి ఒంటిమీది బంగారం మాత్రం నాలుగు వాటాలు వేసి మీ వాటాలు మీరు తీసి కెళ్ళండి పాపకి వాటా ఎందుకంటే ముందు ముందు పాపకి మేము ఎన్ని వస్తువులు చేయించినా ఇవి నీ కన్న తల్లి వస్తువులు అని పాపకి చూపించడానికి మీకు బాధగా అయిష్టంగా అనిపించినా తప్పదు అంటూ అప్పటికప్పుడు కంసాలిని పిలిపించి దుర్గమ్మ నగలన్నీ నాలుగు సమ బాగాలు చేయించి ఎవరికి ఇష్టమైన వాటా వారిని ఎంచుకుని తీసుకోమని పాప వాటాకి వచ్చిన వస్తువుల్ని తను తీసి జాగ్రత్త చేసింది మాలతి వేణు చూస్తూ ఊరుకున్నాడే తప్ప ఆ విషయంలో ఏమీ కల్పించుకోలేదు

భార్య ఏ పని చేసినా అసందర్భంగా అసమంజసంగా ఎప్పుడూ చెయ్యదనే నమ్మకం పెళ్ళయినప్పటినుంచీ అతని మనసులో బలంగా నాటుకోవడమే అతనలా చూస్తూ జోక్యం చేసుకోకపోవడానికి కారణం

వాళ్ళు ముగ్గురూ వెళ్ళిపోయాక నీతోడ బుట్టిన వాళ్ళకే నువ్వు శత్రువువి అయ్యావు పాపని ఒడిలోకి తీసుకుని బాదగా అన్నాడు వేణు

అప్పుడే అక్కడికి వచ్చిన మాలతి ఆ శత్రువుల బెడద వదిలిపోయింది లెండి చచా! మరీ ఇంతటి కఠినాత్ముల్ని నేనెక్కడా చూడలేదు కనీసం ఉంటారని కూడా వినలేదు అంది, ముఖం అసహ్యంగాపెట్టి

వేణు విని మౌనంగా ఊరుకున్నాడే తప్ప ఏమీ మాట్లాడలేదు

అతనికీ తెలుసు అది యదార్థమని కానీ మరో ప్రక్క తోడబుట్టిన చెల్లెళ్ళుగా వారిపట్ల ఉన్న కొద్దిపాటి అబిమానంతో

ఆ పాప ప్రఫుల్ల పేరుతో మూడవ బిడ్డగా వారి హృదయాల్లో స్థానం సంపాదించుకుంది

జరిగిన విషయాలు మరచిపోయి వాళ్ళు కాస్త మనుమల్లో పడుతున్నారు అనుకునేసరికి పక్షవాతానికి గురై మంచంలో ముద్దలా పడి ఉంటున్న ప్రకాశరావుగారికి ఈ లోకం నుంచి విముక్తి లభించింది

కన్న తండ్రి దూరమైనందుకు కుమిలిపోయినా అన్నాళ్ళు మంచంలో ఉంటూ ఆయన పడిన బాధ చూసిన మాలతి 'పోనీలే ఇకనైనా నాన్న సుఖపడ్డారు' అనుకుంది

చైతన్యాన్ని కోల్పోయిన బొమ్మల్లా యాంత్రికంగా తమ తమ పనులు నిర్వర్తిస్తున్నారే తప్ప ఓ సరదా, సంతోషం లేకుండా పోయాయి ఆ దంపతుల మధ్య

(ఇంకా ఉంది)

# అర్చకత్వం ప్రభుత్వ ఉద్యోగమైతే?















# హైదరాబాదు నోట్‌బుక్

## కూచిపూడి నృత్యంపై విదేశాలలో ఆసక్తి

ఆంధ్రుల సాంప్రదాయిక నృత్యమైన కూచిపూడిపై విదేశాలలోని తెలుగువారికి, ఇతర కళాప్రియులకు విశేషంగా ఆసక్తి వుందని, కాని దానిని తీర్చడానికి తగిన సౌకర్యాలు లేవని సుప్రసిద్ధ కూచిపూడి నర్తకి శ్రీమతి మద్దాలి ఉషా గాయత్రి తెలిపారు. శ్రీమతి గాయత్రి అమెరికా, ఇంగ్లాండులలో నెలపాటు పర్యటన జరిపి ఇటీవలే తిరిగివచ్చారు. విదేశాలలోని తెలుగువారికి, ఇతరులకు కూడ తమ పిల్లలకు కూచిపూడి నృత్యంలో శిక్షణ ఇవ్వాలని ఎంతో ఆసక్తి వుంది. కాని, అక్కడ భరతనాట్య శిక్షణాలయాలే ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి శ్రీమతి పద్మిని నిర్వహణలో వున్న పెక్కు శిక్షణాలయాలు. శ్రీమతి రత్నపాప తప్ప ఇంకెవరూ కూచిపూడి నృత్యం బోధించే వారు లేరు అమెరికాలో. సుప్రసిద్ధ కూచిపూడి నర్తకులు శ్రీ వెంపటి చినసత్యంగారు అప్పుడప్పుడువెళ్ళి కూచిపూడి నృత్యంలో శిక్షణ ఇస్తున్నారు. కనుక కూచిపూడి నృత్యాచార్యులకు అమెరికాలో చాల అవకాశం వుంది. అక్కడి తెలుగువారు తగిన సౌకర్యాలు కల్పిస్తే, నృత్యాచార్యులు అమెరికాలో స్థిరపడి శిష్య బృందాన్ని తయారు చేయవచ్చు అని ఆమె అన్నారు. తమ బృందానికి ప్రతి చోటా ఎంతో ఆదర సత్కారాలు జరిగాయని ఆమె అన్నారు. భరతనాట్యం, కూచిపూడి, ఒడిస్సీ మూడూ ఒక గుత్తి పూలే. ఒకరు ఆంగికానికి, మరొకరు వాచికానికి ఇంకొకరు ఇతివృత్తానికి ప్రాధాన్యం ఇవ్వడం వల్ల భేదం కనిపిస్తుంది. ఏమయినా భారతీయ నృత్యాల పట్ల విదేశాలలో చాల ఆసక్తి వుంది. సమర్థులైన నృత్యాచార్యులు విదేశాలకు వెళ్ళి శాస్త్రీయ పద్ధతులతో అక్కడి వారికి శిక్షణ ఇస్తే ఎంతో బాగుంటుంది. దానివల్ల పరస్పర సంస్కృత్యవగాహన, సామరస్యం ఏర్పడుతాయి.

## త్యాగరాజ కృతులతో రామాయణ నృత్యనాటిక:-

త్యాగరాజ కృతులు ఆధారంగా సుప్రసిద్ధ నృత్య నాటక రచయిత్రి శ్రీమతి వాసిరెడ్డి కనకదుర్గ రచించిన త్యాగరాజ రామాయణంలో భాగమైన సీతాకల్యాణం నృత్య నాటికను విజయవాడ ప్రభుత్వ సంగీత కళాశాల విద్యార్థులు జూన్ 4వ తేదీన రవీంద్రభారతిలో ప్రదర్శించి ప్రేక్షకుల మన్ననలు పొందారు. ఇలాటి రామాయణం రచించడం ఇదే మొదలు. త్యాగరాజుల వారి కీర్తనలు రామ కథా గ్రంథితాలు. ఒక్కొక్క కీర్తనా రామచరితాన్ని, స్వభావాన్ని వర్ణించేవే. శ్రీమతి కనకదుర్గ రామాయణం కథానుగుణంగా - ప్రస్తుతం సీతా కల్యాణ నృత్య నాటికానుగుణంగా కీర్తనలు ఎన్నుకొని,-చక్కగా నిర్వహించారు. ఈ నృత్య నాటిక జయదేవుని దశావతారాష్టపది జయ జగదీశ హరే తో ప్రారంభమయింది. పిదప రామావతార ప్రాముఖ్యాన్ని "ఎవరికై అవతారం" అనే కృతితో వివరించడం జరిగింది. రాముడు విశ్వామిత్రునితో పాటు యజ్ఞ రక్షణకు వెళ్ళుతున్నప్పుడు "శ్రీరామ జయరామ" కృతి అభినయం, అహల్యా శాప విమోచన సూచనకు "శ్రీరామ పదము" అభినయం సముచితంగా వున్నాయి. శివధనుర్భంగ సమయంలో "అలకలల్ల లాడగ గని" కృతి ప్రేక్షకులను పరవశింపజేసింది. అలకలల్లలాడగ కీర్తన త్యాగరాజ కవితా కమనీయతకు, భావనా భవ్యతకు బంగారు మచ్చుతునక. అది సహజంగానే శ్రోతలను పరవశింపజేస్తుంది. మరి దానిని సీతా కల్యాణ ఘట్టంలో నృత్య నాటికకు నేపథ్య గీతంగా, అభినయ కీర్తనగా చేస్తే ప్రేక్షకుల ఆనందాతిరేకాన్ని చెప్పనక్కరలేదు. నర్తక నర్తకీమణులు అలిమేలుమంగ, గౌతమి (సీత), గీతాలక్ష్మి, దివ్య, పద్మశ్రీ, దుర్గ విజయలక్ష్మి, శ్రీనివాసప్రసాద్ (రాముడు). సాయిప్రసాద్ (లక్ష్మణుడు), రామగోపాల్, పూర్ణానందం తమ పాత్రలను చక్కగా నిర్వహించారు. ఉత్తరోత్తరా ఇంకా చక్కగా నిర్వహించగలరని నమ్మినాను. శ్రీ బ్రహ్మానందం. శ్రీమతి జానకి కీర్తనలు పాడారు. శ్రీమతి సుమతి మృదంగం నృత్య నాటికకు ధ్వన్యాలోకం. వాసిరెడ్డి కనకదుర్గగారు సంపూర్ణ రామాయణాన్ని ప్రదర్శించి మెప్పు పొందుదురు గాక!

## మాణిక్య వీణ ఆవిష్కరణ

కొందరు కావ్యాలు చదివి కవులు అవుతున్నారు. మరికొందరు లోకాన్ని, లోకుల జీవితాన్ని చదివి కవులవుతారు. శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు రెండవ కోవకు చెందినవారు - అని ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ డాక్టర్ సి. నారాయణరెడ్డి శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు రచించిన మాణిక్యవీణ కవితా సంకలనాన్ని ఆవిష్కరిస్తూ అన్నారు. ఈ కవితా సంకలనం ఆవిష్కరణ జూన్ 5వ తేదీన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో జరిగింది. సభకు ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ పొత్తూరు వెంకటేశ్వరరావు అధ్యక్షత వహించారు. ప్రచారాలు కోరుకోని, ఆర్భాటాలు చేసుకోని నిజమయిన, నికార్సయిన కవి, రచయిత శ్రీ వెల్దుర్తి అని శ్రీ వేంకటేశ్వరరావు ప్రశంసించారు. శ్రీ వెల్దుర్తి తన కవితలో ప్రగతిశీల దృక్పథాన్ని అనుసరించి అభ్యుదయ కవితా పరిధిలో కొత్త పుంతలు తొక్కారని డాక్టర్ నారాయణ రెడ్డి అన్నారు. నిజాయితీ నడవడికి, కమ్మని తెలుగు పలుకుబడి! ఘాటైన పరిహాసాల అలజడికి, సమకాలీన రాజకీయ ప్రబోధాల ఒరవడికి ప్రతీకలు శ్రీ వెల్దుర్తి కవితలని డాక్టర్ రెడ్డి అన్నారు. శ్రీ మాణిక్యరావు తన కవితలను అలంకారానికి దూరంగా, ప్రాస కోసం ప్రయాసపడకుండా, ఆశుప్రాయంగా చెప్పారని డాక్టర్ రెడ్డి అన్నారు. కవిత కోసం కవిత వ్రాయకుండా, మనిషిగా జీవించడం కోసం శ్రీ వెల్దుర్తి కవితలు చెప్పారని ఆయన అన్నారు. ఈ కవితా సంకలనాన్ని పంచాయతీ శాఖామాత్యులు శ్రీ కరణం రామచంద్రరావు అంకితం పుచ్చుకుంటూ, సమకాలీన సమాజానికి దర్పణం పడుతూ, అత్యుత్తమ భావాలతో సమాజ సముద్ధరణ కోసం కృషి చేయాలని ఉద్బోధించారు. ఉన్నత ఆదర్శాలకు, త్యాగాలకు. నెలవైన మన రాజకీయాలు ప్రస్తుతం దిగజారిపోయాయని, రాజకీయాలకు కొత్త అర్థాన్ని చెప్పేందుకు సాహిత్యం ద్వారా కృషి కొనసాగించాలని ఆయన కోరారు. స్వాతంత్ర్య ఫలసిద్ధి కోసం, సమాజంలో మార్పు కోసం ఆనాటి స్వాతంత్ర్య సమరయోధులు కృషి చేయడం అవసరమని మంత్రి అన్నారు. నైతిక మూల్యాలు పెంచే విధంగా యువతను ప్రేరేపించేందుకు, భావి భారతం రామరాజ్యంగా విలసిల్లేందుకు ప్రతి ఒక్కరూ కంకణం కట్టుకోవాలని ఆయన కోరారు. తాను జీవితంలో ఉన్నత స్థితికి రావడానికి చిన్నతనంలో తనకు తన మేనమామ అయిన శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు ఇచ్చిన ప్రోత్సాహం కారణమని, శ్రీ

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో ప్రముఖ కవి శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు తమ "మాణిక్య వీణ" కవితా సంకలనాన్ని రాష్ట్ర పంచాయితీరాజ్ శాఖామంత్రి శ్రీ కరణం రామచంద్రరావుకు అంకితమిస్తున్న దృశ్యం





ఽీవల అద్దంకి ఎఱ్ఱాప్రగడ సాహితీ సమితి వారు
ఖ విజ్ఞాన శాస్త్ర రచయిత శ్రీ జమ్మి
రావు గారిని సన్మానించిన సందర్భంగా శాసన
డా. బాచిన చెంచ్చుగరటయ్య పూలమాలతో,
సతో రచయితని సత్కరిస్తున్న దృశ్యం.

వు సేవామయమైన, ప్రయోజనాత్మకమైన గడుపుతున్నారని ఆయన ప్రశంసించారు. విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ డాక్టర్ వు. శ్రీ కాటం లక్ష్మీనారాయణ, మాణిక్య కవితా కమనీయతను ప్రశంసిస్తూ గించారు. కవిని, ఆయన సతీమణి శ్రీమతి ాబాయిని వివిధ సాహిత్య సాంస్కృతిక వారు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం ంత్రి శ్రీ రామచంద్రరావు సత్కరించారు. ంలో శ్రీ ఎం. ఎల్. నరసింహారావు స్వాగతం చివరన శ్రీ ఎ. వి. జనార్ధనరావు వందన చేశారు.

**ఁతి :-**

ం బాగా కురిసేట్టున్నది. ఎరువుల కోసం లు పడుతున్నాను - అన్నారు ఒక మోతుబరి తు నాతో. మీరేమీ తంటాలు పడక్కరలేదు. ైదరాబాద్ నగరంలో వీధి పొడవునా ఎరువులే రీలో తోలుకునిపొండి - అన్నారు ఒక నగరవాసి.

## పొరబాటు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 12.6.87 సంచికలో హైదరాబాద్ నోట్ బుక్‌లో 70వ పుట మూడవ కాలం చివర "మధుర నేషనల్ కాలేజీ ఆచార్యులు డాక్టర్ ఆచార్య శ్రీనివాసన్, ఆచార్య రామనాధన్ మున్నగువారు" అని పొరబాటు దొర్లింది. "తిరుచిరాపల్లి నేషనల్ కాలేజీ ఆచార్యులు ప్రొఫెసర్ మణి, ప్రొఫెసర్ శ్రీనివాసన్, ప్రొఫెసర్ రామనాధన్ మున్నగువారు" - అని దిద్దుకుని చదవాలి.

- తిరుమల రామచంద్ర

# రిలయన్స్ వరల్డ్ కప్ క్రికెట్ - 87

## ప్రమాదస్థితిలో ప్రపంచ క్రికెట్

ఇండియా పాకిస్తాన్‌లు సంయుక్తంగా నిర్వహించనున్న ప్రపంచ కప్ '87 క్రికెట్ పోటీలు – దిగ్విజయంగా జరగగలవను నమ్మకము క్రికెట్ మేధావులకు లేదు. ఈ పోటీలు మనదేశములో జరుపుటకు బాధ్యత స్వీకరించినది 'రిలయన్స్' యిండస్ట్రీస్'. ఈ సంస్థ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ అనిల్ అంబానీ క్రికెట్ టెస్టు పోటీలు యింతవరకు చూడలేదనుట విచిత్రము. ఇతను కనీసము టి. వి. లో గాని రేడియో కామెంటరీ యందు కూడా ఆసక్తి కలిగియుండలేదు. రిలయన్స్ యిండస్ట్రీస్ సంస్థ చేపట్టిన మొట్టమొదటి క్రీడా పోటీ యిదే. ఎంతో వ్యయముతో కూడిన యీ పోటీలు నిర్వహించుటకు రిలయన్స్ సంస్థ ఆసక్తి చూపగా, మన దూరదర్శన్ 30 కోట్ల వ్యయముతో విదేశముల నుండి ఆధునిక యంత్రాలు దిగుమతి చేసుకున్నది. ఆస్ట్రేలియా, ఇంగ్లాండులకు సాంకేతిక నిపుణులను ప్రత్యేక శిక్షణకు పంపినది. పోటీలు దిగ్విజయంగా జరుపుటకు కృషి జరుగుతున్నది. కాని మన భూభాగముపై భారీఎత్తున జరగనున్న యీ పోటీలు సక్రమముగా నిర్వహించగలము అనేది సెప్టెంబర్ - అక్టోబరునాటికి కాని తెలియదు.

ఇంగ్లాడులో మాత్రము యింతవరకు జరిగిన వరల్డ్ కప్ క్రికెట్ పోటీలు మొదటిసారిగా యితర దేశములో, ఆసియాఖండములలో ఇండియా -పాకిస్తాన్ సంయుక్తముగా జరుపుచున్నవి. మన క్రికెట్ సమాఖ్య ఆర్థికముగా ఎంతో బలమయినది. ఇతర జాతియ సమాఖ్యల వలే ప్రభుత్వ ఆర్థికసహాయము కొరకు ప్రాకులాడవలసిన అవసరములేదు. కాని ఇండియా - పాకిస్తాన్ జాతీయ క్రికెట్ సమాఖ్యల నిర్వహణ సమర్థత అనుమానాస్పదము. మనదేశ క్రికెట్ సమాఖ్య నిర్వహణ పద్ధతిపై యిటీవల మనదేశం పర్యటించిన శ్రీలంక జట్టు చేసిన వ్యాఖ్యానాలు మరువరానివి. ఈసారి పోటీలు దేశ వివిధ కేంద్రాలలో జరుగును. పోటీలలో పాల్గొను జట్లను సకాలములో సౌకర్యముగా చేర్చవలసిన బాధ్యత కలదు. ఈ పోటీల గురించి కేంద్రప్రభుత్వము బహిరంగంగా ఎట్టి ఆసక్తి చూపుటలేదు. 1982 ఢిల్లీ ఆసియా క్రీడోత్సవాలు దిగ్విజయంగా నిర్వహించుటకు ఎంతో కృషి చేసిన కేంద్రం నేడు అనాసక్తిగా యుండుటకు ముఖ్య కారణం దక్షిణ ఆఫ్రికాలో క్రికెట్ పోటీల్లో పాల్గొనిన కొందరు అగ్రగామి క్రికెట్ ఆటగాళ్లను యీ పోటీలలో పాల్గొనుటకు మనదేశములో అనుమతించుట సమస్యగా ఉండుట వలన అని భావించబడుతున్నది. ఈ సమస్య గురించీ అంతర్జాతీయ క్రికెట్ సమాఖ్య జూన్ 26న లండన్‌లో జరుపు సమావేశములో పరిష్కారం కనుగొనవచ్చును. అంతర్జాతీయ క్రికెట్ సమాఖ్య అధ్యక్షుడు కొలిన్ కౌడ్రి, ఇంగ్లాండు సమాఖ్య అధినేతలు రామన్ సుబ్బారావు, అలెన్‌స్మిత్‌తో మన బోర్డు అధ్యక్షుడు శ్రీ రామన్,సాల్వేలు జరిపిన చర్చల ఫలితంగా అంతర్జాతీయ సమాఖ్య సమావేశము ఏప్రిల్ నుండి జూన్ 26కు మార్చబడినది. దక్షిణ ఆఫ్రికా, మనదేశము మధ్య పరిస్థితి అనుకూలంగా లేదు. దక్షిణ ఆఫ్రికాలో ఆడిన క్రీడాకారులను



రిలయన్స్ కప్ 1987

అనుమతించుట గురించి కేంద్రప్రభుత్వం అభిప్రాయము యింతవరకు ప్రకటించలేదు. ఇంగ్లీషుజట్టు మేటి ఆటగాడు గ్రాహంగూచ్, ఉప సారథి జాన్ ఎంబ్రూరేలు 1982లో నిబంధనలను ఉల్లంఘించి దక్షిణ ఆఫ్రికాలో పర్యటించారు. అందుకు వారికి మూడు సంవత్సరముల వరకు జాతీయ జట్టులో పాల్గొను అవకాశము యివ్వబడలేదు. 1986లో మనదేశం దక్షిణ ఆఫ్రికాతో అనుబంధము గల ఆటగాళ్లు, జట్లతో ఆడటం గురించి ఎట్టి ప్రకటన, అభ్యంతరం చేయలేదు. షార్జా చతుర్ముఖ పోటీలో నార్త్ అంటన్‌షైర్ ఆటగాడు డేవిడ్ కాపల్ ఆడటం గురించి ఎట్టి అభ్యంతరం తెలుపలేదు. డేవిడ్ కాపల్ కూడా దక్షిణ ఆఫ్రికాలో పర్యటించి వున్నాడు. మరియు



కుమారులు ముఖేష్, అనిల్‌తో రిలయన్స్ అధినేత దీరూభాయ్ అంబానీ

పోటీలలో పాల్గొను ఇంగ్లాండు , ఆస్ట్రేలియా, న్యూజిలాండ్‌లు తమ అభిప్రాయం బహిరంగంగా తెలుపలేదు. ఈ దేశములలో క్రికెట్ టెస్టు పోటీల వలన ఆదాయము కన్న మనదేశంలో టెస్టు పోటీలు, ఒక రోజు పర్యటనల వలన లభించు డబ్బు ఎక్కువ. అందుచే యీ దేశాలు తుది నిర్ణయమునకు ముందు జాగ్రత్తగా నిర్ణయము తీసుకొనును.

## ప్రపంచ క్రికెట్ రంగములో విబేధాలు

మనదేశం ప్రపంచ కప్ '87 పోటీల నిర్వహణలో తీసుకొను నిర్ణయముల వలన, కొందరు ఆటగాళ్లను మనదేశంలో ఆడుటకు అనుమతించక పోవుటచే యీ పోటీలలో పాల్గొను ఎనిమిది దేశాలలో విభేదముల వలన ప్రపంచ క్రికెట్ సమాఖ్య రెండుగా విడిపోయే ప్రమాదం ఉన్నది.

## "ఇమిగ్రేషన్ లా"

మనదేశమునకు దక్షిణ ఆఫ్రికాతో సంబంధం ఉండి వచ్చువారు వ్రాతమూలకముగా తమ 'విసా' దరఖాస్తుతో పాటు దక్షిణ ఆఫ్రికా వలస విధానము పట్ల తాము పూర్తిగా వ్యతిరేకించుచున్నామనియు, భారతదేశ విధానమును సంపూర్ణముగా ఆమోదించుచున్నామని యివ్వాలి. దానిని మన యింటిలిజన్స్ బ్యూరో వారు పరిశీలించి అనుమతిస్తారు. మరి యీ విధముగా ఎందరు క్రికెట్ యోధులు రాసి యిస్తారు. నిబంధనలను సడలించుటకు కేంద్రం ఎంత వరకు అనుమతిస్తుంది అనేది సమస్య.

## వరల్డ్ కప్ '87 నిర్వహణ ఖర్చు

వరల్డ్ కప్ నిర్వహణకు కనీసము రెండు కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా. ఈ పోటీలు నిర్వహించు రిలయన్స్ ఇండస్ట్రీస్‌వారు ప్రత్యేక పద్ధతిలో టికెట్‌లు ముద్రించి రెండు దేశముల క్రికెట్ సమాఖ్యలకు అమ్మకం నిమిత్తం విడుదల చేస్తారు. లాభములు అంతగా ఉండకపోవచ్చును.

మనదేశములో రాబోవు దశాబ్ద కాలములో యింత పెద్ద క్రీడా పోటీ జరుగు అవకాశము కనిపించటం లేదు. ఒలింపిక్స్ కూడా మన భూభాగములో జరిగే అవకాశము లేదు. అందుకే యీ పోటీకి ప్రాముఖ్యత లభించినది. మనదేశములో క్రికెట్ ఆటపట్ల గల అభిమానము కూడా కొంత కారణము.

## వరల్డ్ కప్ '87

లయన్స్ వరల్డ్ కప్ '87ను ప్రపంచ ఫుట్‌బాల్ కప్ రూపొందించిన అగ్రగామి బంగారు వ్యాపారస్త 'గెరార్డ్' కంపెనీ రూపొందించుచున్నది. కప్ దాని నమూనా అతి రహస్యముగా ఉంచ జూన్ 26 అంతర్జాతీయ క్రికెట్ సమావేశములో తుది చేయబడుతుంది.

## ఫైనల్స్

రిలయన్స్ వరల్డ్ కప్ '87 ఫైనల్ పోటీ న... 8న కలకత్తా ఏడన్ గార్డెన్స్‌లో జరుగును. రెం... జట్లు ఆఖరి పోటీలో పాల్గొనినప్పు... అభిమానులు, మిగిలిన ఆరు జట్ల... తిలకిస్తారు. టి. వి; రేడియోలు ...ంచ ప్రాంతములకు ప్రసారము ... జరిగిన ఒకటి, రెండు రోజుల ... అక్కడే ప్రపంచ కప్ విజేతల... ఆటగాళ్ల (రెస్ట్ ఆఫ్ వరల్డ్) పోటీ జరు...

మన భూభాగముపై తొలిసారి ... ప్రపంచ కప్ క్రికెట్ ఛాంపియన్‌షిప్ పోటీ... ప్రతిష్ఠాకరమైనవి. క్రికెట్‌ని అభిమానించే దేశాలన్నీ ఆటని, ఫలితాలని, నిర్వహణని శ్రద్ధతో గమనిస్తాయి. కాబట్టి ఎంతో జాగ్రత్త తీసుకోవలసిన అవసరం ఉన్నది. - ముకరమ్



'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమ పేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

–సంపాదకుడు.


Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishne.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667